# అలనాటి పట్టణాలు

ఆకాశవాణి, విజయవాడ కేంద్రం నుంచి ప్రసారమైన ధారావాహిక

రచన

డా॥ జి.వి.పూర్ణచంద్

శ్రీమధులత పబ్లికేషన్స్
డోర్. నెం. 28-3-49, సంజీవయ్య కాలనీ,
అరండల్‌పేట, విజయవాడ - 520 002

**ALANAATI PATTANAALU**

Written by :

**Dr. G.V. Purnachand, B.A.M.S.,**

Susruta Ayurvedic speciality hospital

Ist floor, Satnam Towers,

Opp. Buckinghampet Post Office,

Governorpet, Vijayawada - 520 002

Ph : 0866-5568185, Mobile : 94401 72642



1st Edition :

January, 2006

Price : **40/-**

Cover Design & Type Setting :

**SREE MADHULATHA GRAPHICS**

Arundelpet, VIJAYAWADA.

Printed At :

**VAASU OFFSET PRINTERS**

Arundelpet, Vijayawada-2.

Published by :

**Sree Madhulatha Publications**

28-3-49, Sanjeevaiah Colony,

Arundalpet, Vijayawada - 520 002

Ph : 2434320 (O), 2436936 (R)

Cell : 94401 72936

# కృతి స్వీకారం...



శ్రీ తన్నీరు శేషగిరిరావు (పెదబాబు) - శ్రీమతి సరోజ

# విషయసూచిక

# చరిత్ర నేర్పేది పాఠాలే...

సంగీత సాహిత్యాల పట్ల సమాదరణ కలిగిన కళా హృదయులు శ్రీ మంగళగిరి ఆదిత్య ప్రసాద్ విజయవాడ ఆకాశవాణి కేంద్రం డైరెక్టర్‌గా వచ్చిన తర్వాత నాకు ఒక లేఖ రాశారు- "మీ సేవలు రేడియో ద్వారా కూడా వినియోగించండి- అని! కృష్ణా, ఉభయ గోదావరి, ఖమ్మం, నల్గొండ, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాలలో ప్రముఖమైన ప్రాంతాల గురించిన చరిత్రల్ని వివరిస్తే ప్రయోజనకరంగా వుంటుందని ఆయన అభిప్రాయ పడ్డారు. ఆవిధంగా, ఇంచుమించుగా ఒక ఏడాది పాటు, ప్రతి బుధవారం ఆకాశవాణి విజయవాడ కేంద్రం ద్వారా అలనాటి పట్టణాల వైభవాన్ని నాతో రాయించి ప్రసారం చేశారు. ఆకాశవాణి శ్రోతలు ఈ శీర్షికకు చాలా చక్కగా ప్రతిస్పందించారు.

అసిస్టెంట్ స్టేషన్ డైరెక్టర్ శ్రీమతి కృష్ణకుమారి, ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్ శ్రీమతి పద్మజా నిర్మల ఇంకా ఆకాశవాణి సిబ్బంది ఈ శీర్షిక నిర్వహణ సమయంలో అందించిన సహకారం మరువలేనిది. వారికి ధన్యవాదాలు.

అలనాటి పట్టణాల వైభవాన్ని చెప్పకునేప్పడు జమీందార్లు, బ్రిటిష్ అధికారుల విశేషాలే ఎక్కువగా కన్పిస్తాయి. ఆస్తులు సముపార్జించుకోవడం, 'రాజా' అనిపించుకోవడమే లక్ష్యంగా పాలించిన జమీందార్లు కొందరైతే, ఈస్టిండియా కంపెనీకి డబ్బు కూడబెట్టడమే లక్ష్యంగా పాలించిన బ్రిటిష్ అధికార్లు ఇంకొందరు. వీరందరి కబంధ హస్తాలను తప్పించుకొని, తెలుగు ప్రజలు, తెలుగు గ్రామాలు అంతో ఇంతో అభివృద్ధినే సాధించగలిగాయంటే, ఈ నేల మీద అంతర్గతంగా ప్రవహించిన జన చైతన్యమే అందుకు ముఖ్య కారణం!

ఈస్టిండియా కంపెనీ పాలకుల దౌష్ట్యం ఈ పుస్తకంలో పేర్కొన్న ప్రతి పట్టణ చరిత్రలోనూ కనిపిస్తుంది. కొన్ని అలనాటి పట్టణాలు ఈనాడు కుగ్రామాలుగా మారిపోవడానికి గల కారణాలు కూడా స్పష్టంగా తెలుస్తాయి. మళ్ళీ మల్టీనేషనల్ కంపెనీలు ఈ భూమ్మీద వ్యాపారం పేరుతో అడుగుపెట్టి, భవిష్యత్తులో పాలకులుగా స్థిరపడే ప్రమాదం ముంచు

కొస్తున్న ప్రస్తుత తరుణంలో ఈ అలనాటి పట్టణాల పతనం కథల్ని తప్పకుండా చదవాలి. ప్రజల్లో చైతన్యమే ప్రభుత్వాల్లో పెరిగిన విదేశీ కంపెనీలపై మోజుని వదిలించ గలుగుతాయి.

అలాంటి చైతన్యాన్ని ఈ 'పుస్తకం'లో ఏ ఒక్క అంశం ఎంతమేర కల్గించినా ఈ శ్రమ ఫలించినట్లే!

రాజులు, జమీందార్లు సంగతి అలా వుంచండి- కోట్లకు పడగలెత్తిన వ్యక్తులు మనలో చాలామంది వున్నారు. కానీ, తమ అభ్యున్నతికి కారణమైన సమాజానికి తిరిగి ఎంతో కొంత మేలు చేయాలనే తపన వున్న వ్యక్తులు అరుదుగా కన్పిస్తారు.

మధ్యతరగతి కుటుంబంలో పుట్టి, చక్కని పారిశ్రామికవేత్తగా ఎదిగి, తను జీవిస్తూ పదిమందిని జీవింపచేస్తూ ఉన్నత స్థితికి చేరుకున్న తన్నీరు శేషగిరిరావు (పెదబాబు) చాలా భిన్నమైన వ్యక్తి. లయనిజం ద్వారా సమాజసేవలో పునీతుడు కావడం కోసం మాతో కలిసి పనిచేయాలని ముందుకొచ్చారు. తనకుతనే ఉత్తేజితులయ్యారు. పోలీస్ కానిస్టేబుల్‌గా పనిచేసిన తన తండ్రి కీ॥శే॥ తన్నీరు కృష్ణమూర్తి గారి పేరున ఉచిత వైద్య సేవలు అందించే ఒక కంటి ఆసుపత్రిని నిర్మించి ఇచ్చారు. ఆ విధంగా "తన్నీరు కృష్ణమూర్తి విద్యాధర లయన్స్ కంటి ఆసుపత్రి" చైర్మన్‌గా నేను ఆయనతో కలిసి పనిచేసే అవకాశాన్ని పొందగలిగాను. వితరణశీలానికి మరో పేరుగా నిలిచిన ఇలాంటి వ్యక్తిత్వాలు అరుదుగా కన్పిస్తాయి. ఆయన్ని కల్సినప్పుడల్లా ఇదే ఉత్తేజం కలుగుతూ వుంటుంది.

అలాంటి ఉన్నతుడికి ఈ కృతిని అంకితం ఇవ్వడాన్ని ధన్యతగా భావిస్తున్నాను.

- డా॥ జి.వి.పూర్ణచంద్

# బెజవాడ

**ఇది బెజవాడ, ఆది నుంచీ బెజవాడే! స్వాతంత్ర్యం వచ్చాకే 'కాలక్రమంగా ఇది విజయవాడగా మారింది.**

చరిత్రకు అందినంత వరకూ బెజవాడ పుణ్యభూమి. బౌద్ధం, జైనం, శైవం....ఎన్నో మత ధర్మాల ప్రధాన స్థావరంగా విలసిల్లిన నేల ఇది. శాతవాహనుల కాలం నుంచీ, ఇంకా అంతకు పూర్వం నుంచీ కూడా కృష్ణానదీమతల్లి పుణ్యమా అని గొప్ప వాణిజ్య కూడలిగా వెలుగొందిన భూమి ఇది. అంతకుమించిన యుద్ధభూమి కూడా! భౌగోళికంగా ఇది కృష్ణానదీతీరాన ఉండడాన, పెట్టని కోటలా చుట్టూ కొండలు సంరక్షిస్తున్న కారణంగా బెజవాడ ఏ రాజవంశీకుల ఆధీనంలో ఉన్నా అనేక యుద్ధాలకు కురుక్షేత్రంగా నిలిచింది.

నాగులు, ఇక్ష్వాకులు, శాతవాహనులు, పల్లవులు, విష్ణు కుండినులు, శాలంకాయనులు, చోళులు, కాకతీయులు, గజపతులు, కుతుబ్‌షాహీలు, అసఫ్ జాహీలు, బ్రిటిషర్లు, గోల్కొండ సుల్తానులు, హైద్రాబాదు నవాబులు - ఎందరో ఈ నగరాన్ని పాలించారు.

క్రీస్తు పూర్వం 500 ఏళ్లకు మునుపు "జెజ" అనే స్త్రీ దేవతని ఇక్కడి ప్రజలు పూజించేవారు. "జెజ", "తూర్క", "కొట్టి", "చాత" "ఎల", "ఎహువల", "కాట్టు" వీరంతా అచ్చ తెలుగు ప్రాచీన దేవతలు. బెజ దేవత పేరున బెజవాడ ఏర్పడి వుండవచ్చు. బహుశా 'బెజ' లేక బెజ్జ మహాదేవి జైనుల దేవత కూడా అయివుండొచ్చు.

బౌద్ధుల- "సిరివణిజ జాతక గ్రంథం" లో తెలివాహ నది ఒడ్డున వున్న అంధపుర (ఆంధపుర) నగరం ప్రస్తావన కనిపిస్తుంది. ఇది ఆంధ్రుల తొలి రాజధాని. 'తైల స్నేహోపలబ్ద సరళత' అంటే నూనె ఒలికినంత సరళంగా కృష్ణానది ప్రవహిస్తుందని 'విఖ్యాత కృష్ణవేణీ" అనే శ్లోకంలో ఓ నిర్వచనం కన్పిస్తుంది. దీని ఆధారంగా 'రాయ్‌చౌధురి'

అనే పరిశోధకుడు తెలివాహ నది అంటే కృష్ణానదేననీ, దాని ఒడ్డున ప్రసిద్ధనగరం నేటి బెజవాడే అయివుంటుందనీ పేర్కొన్నాడు. ఆ విధంగా ఆంధ్రుల తొలిరాజధానీ నగరంగా బెజవాడకు ఈ ప్రశస్తి గర్వకారణం అయ్యింది!

క్రీస్తుపూర్వం 100 నాటికే నేటి మొగల్రాజపురం కొండల్లో గుహలు తొలిచి బౌద్ధులు విహారాలు నిర్మించారు. జైనులు ఈనాటి కనకదుర్గ కొండ దగ్గర జైనమఠాలు నిర్మించారు. కుబ్జ విష్ణువర్ధనుడి రాణి అయ్యన మహాదేవి జైనుల కోసం "సర్వలోకాశ్రయ జిన భవ ఆలయం" కట్టించి ఇచ్చింది. "నడుంబి జైన వసతి" పేరుతో పెద్ద ధర్మ సత్రం కూడా ఉండేది. "సమస్త భువనాశ్రయ శివాలయం" కూడా ఉండేదనీ, రెండవ అమ్మిరాజు తాడికొండ గ్రామాన్ని ఈ శివాలయం కోసం దానం చేశాడనీ శాసనాల ద్వారా తెలుస్తోంది.

బెజవాడ, ఆ రోజుల్లో శైవమతానికి రాజధాని నగరం లాంటిది. ఆ కాలంలో శైవుల "సింహపరిషత్తు" (ప్రధాన కార్యాలయం) బెజవాడలోనే ఉండేది. విష్ణుకుండిన రాజులు మల్లికార్జున స్వామి దేవాలయంతో పాటు, అనేక ప్రసిద్ధ శివాలయాలు నిర్మించారు. చింతచిగురు అమ్ముకునే ఒక స్త్రీ యొక్క కుమారుడు యువరాజు రథం కింద పడి మరణించినప్పుడు, నిష్పక్షపాతంగా విచారించి తన కొడుకుకు మరణశిక్ష విధించిన మాధవ వర్మ అనే రాజుగారి కథ బెజవాడ చరిత్రలో అజరామరంగా నిలుస్తుంది.

చైనా యాత్రికుడు హ్యూన్‌త్సాంగ్ క్రీ.శ. 6వ శతాబ్దిలో బెజవాడ వచ్చి ఒక నెల రోజులపాటు మొగల్రాజపురం బౌద్ధ గుహల్లో ఉన్నాడనీ, "మూల అభిదమ్మ సూత్రాలు" ఇక్కడి బౌద్ధ పండితుల దగ్గర నేర్చుకున్నాడనీ చరిత్ర చెప్తోంది. మొగల్రాజపురం కొండ గుహల్లో 'పూర్వశిల' అనే బౌద్ధ వాదానికి సంబంధించిన విద్యాలయం, ఉండవల్లి కొండగుహల్లో 'అపరశిల' అనే బౌద్ధ వాదానికి చెందిన విద్యాలయం ఉండేవనీ, బెజవాడ పూర్వ శైలికులే మహాయాన బౌద్ధాన్ని అభివృద్ధి చేశారనీ అంటారు. ఈనాటి మొగల్రాజపురంలో బౌద్ధ స్తూపం కూడా ఒకటి వుండేదని పండితుల భావన. ఆ ప్రాంతం అంతా జనావాసాలతో నిండిపోవడంతో ఇప్పుడు స్తూపం ఆచూకీ కనుగొనడం కష్టమే!

క్రీస్తుశకం మూడవ శతాబ్దిలో "బృహత్పలాయన" రాజ వంశీకులు బెజవాడను రాజధానిగా చేసుకొని పరిపాలించారు. మొగల్రాజపురంలో ఒక కోటని కూడా వీరు నిర్మించారు. ఆరోజుల్లో అనేకమంది పండితులు, మత గురువులు, శిల్పులు ఇతర కళాకారులూ ఇక్కడినుంచి ఆగ్నేయాసియా దేశాలకు వెళ్ళడానికి వీరు ఎంతగానో తోడ్పడ్డారు. క్రీ.శ. 1687లో గోల్కొండ రాజ్యాన్ని ఔరంగజేబు జయించిన తర్వాత, రాజ్య రక్షణకోసం కొంత సైన్యాన్ని ఈ కోటలో ఉంచాడనీ, ఆ కారణంగానే ఈ ప్రాంతం "మొఘల్ రాజపురం" అయ్యిందనీ అంటారు.

క్రీ.శ. 1070-1120లలో కుళోత్తుంగ చోళుడు పశ్చిమ చాళుక్యులతో వేంగి దేశాన్ని జయించడానికి చేసిన యుద్ధాలకు (Battle of Bezwada) ఆనాడు బెజవాడ మరో కురుక్షేత్రంగా వినియోగపడింది. ఆ తర్వాత రాజరాజ నరేంద్రుడు రాజధానిని రాజమహేంద్రవరం నగరానికి తరలించాడు.

ఒరిస్సాను పాలించిన గజపతుల పాలనలో బెజవాడ నగరం చాలాకాలం ఉంది. విద్యాధర గజపతి పేరుతో విద్యాధరపురం, కూతుళ్ళు పైడమ్మ పేరుతో పైడూరుపాడు, ముత్యాలమ్మ పేరుతో ముత్యాలంపాడు గ్రామాలు వెలిశాయి. మరో నగరపాలకుడు చౌక్కాయి పాత్రుడు దుర్గగుడికీ, శివాలయానికి ఎన్నో దానాలు సమర్పించుకున్నాడు. ఈ పాత్రులు నాగజాతికి చెందిన వారనీ, రాజ వంశీకులనీ, అందుకే వీరిని నాగరాజులు, నగరాలు అని నేటికీ వ్యవహరిస్తారని కొందరు పరిశోధకులంటారు.

నేటి గుణదల 'గుడుందల' గానూ, ఎనికేపాడు 'ఎనికేపద్ది' గానూ, పటమట పట్టమెట్ట గానూ ప్రాచీన శిలాశాసనాలలో కన్పిస్తాయి. 1515లో కొండపల్లి కోటని జయించి గజపతుల్ని ఓడించిన కృష్ణదేవరాయలు బెజవాడ నుంచి కృష్ణాజిల్లా శ్రీకాకుళం వెళ్ళి ఆంధ్ర మహావిష్ణువును సందర్శించుకొని, ఆ దేవుని ప్రేరణతో 'ఆముక్తమాల్యద' రచనకు శ్రీకారం చుట్టాడు.

రాయలు తర్వాత ఈ హిందూ రాజ్యాన్ని జయించిన కుతుబ్‌షాల పాలనలోనూ, తరువాత వచ్చిన అసఫ్ జాహీల కాలంలోనూ బెజవాడ ప్రాముఖ్యత తగ్గి కొండపల్లి రాజకీయ కేంద్రంగా మారింది.

1700-1846 మధ్యకాలంలో కలువకొలను వారు బెజవాడ జమీందారులుగా వుండేవారు. కేవలం మూడువేల రూపాయిల నామమాత్రపు వేలంపాటలో బెజవాడ జమీందారీని బ్రిటీషు వారు కొనేశారు.

కృష్ణానదిపైన ఒక ఆనకట్ట అవసరం గమనించి 1792లో మేజర్ బీస్టసన్ ఓ ప్లాను తయారుచేసి దానిని బెజవాడ వద్ద నిర్మించాలని సూచించాడు. అంతలో డొక్కల కరువొచ్చింది. 1839లో కెప్టెన్ చికిల్ అనే ఇంజనీర్ అదే ప్రతిపాదనని తిరిగి కంపెనీ వారికి పంపాడు, ధవళేశ్వరం వద్ద గోదావరి ఆనకట్టని నిర్మించి అటు కాకినాడు వరకూ, విజయవాడలో కృష్ణకు ఆనకట్టకట్టి ఇటు మద్రాసు వరకూ జలరవాణా మార్గాన్నీ ఏర్పరచారు. 24-10-1881 నాటికి ఆనకట్ట నిర్మాణం పూర్తయింది. 1957లో ఈ ఆనకట్టపైన ప్రకాశం బ్యారేజి నిర్మాణం జరిగింది. కలకత్తా వరకూ గ్రాండ్ ట్రంక్ రోడ్డు, రైల్వేస్టేషన్ల రాకతో బెజవాడ స్వరూపం మారిపోయింది. కొత్త వాణిజ్య కూడలిగా అవతరించింది.

1921 మార్చి 31, ఏప్రిల్ 1 తేదీలలో లోకమాన్య బాలగంగాధర్ తిలక్ మరణానంతరం జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ మొదటి కార్యవర్గ సమావేశాన్ని ఈనాటి గాంధీనగర్ ప్రాంతంలో భారీ స్థాయిలో నిర్వహించారు. గాంధీని కాంగ్రెస్

నాయకత్వం చేపట్టవలసిందిగా ఆహ్వానించిన చారిత్రాత్మక సమావేశం ఇది. అందులోనే మేడమ్ కామా రూపొందించిన జాతీయ జెండాకు బదులుగా బెజవాడ వాస్తవ్యులు పింగళి వెంకయ్య గారు రూపొందించిన జాతీయ జెండాను ఎగరేశారు. అస్పృశ్యతా నివారణ, పంచముల దేవాలయ ప్రవేశం వంటి సంస్కరణ కార్యక్రమాలను కాంగ్రెస్ చేపట్టే విధంగా స్థానిక నాయకులు కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు, అయ్యదేవర కాళేశ్వరరావు, ఎంతో కృషి చేశారు. ఆనాటి నుంచీ రాజకీయ చైతన్యం నిండిన సాంస్కృతిక రాజధానిగా బెజవాడ మరో కొత్తరూపు సంతరించుకొంది. రాష్ట్ర కాంగ్రెస్ కమిటి, కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ రాష్ట్ర కమిటీ, కమ్యూనిష్టు పార్టీ రాష్ట్ర కమిటీ, అభ్యుదయ రచయితల సంఘం, ప్రజానాట్యమండలి, రైతుకూలీ, కార్మిక, యువజన విద్యార్థి మహిళా సంఘాల రాష్ట్ర కమిటీలన్నీ బెజవాడ కేంద్రంగానే మొన్నమొన్నటిదాకా పనిచేశాయి. పత్రికారంగం, సినిమా, ప్రచురణ రంగాలు బెజవాడ కేంద్రంగానే నడిచాయి.

ఒక దశలో బెజవాడ నుంచే హైదరాబాద్ సంస్థానంలో కాంగ్రెస్, కమ్యూనిస్ట్ రాజకీయాలు కూడా విస్తరించాయి. కాలక్రమంలో హైదరాబాద్‌కు అన్నీ తరలిపోయినా, బెజవాడకు చైతన్య స్ఫూర్తి తగ్గలేదు

చుండూరు వెంకటరెడ్డి, గూడూరు లక్ష్మణరావు విజయవాడని పారిశ్రామిక వాడగా మలిచారు. భూగర్భశాస్త్రవేత్త పింగళి వెంకయ్య, అపర భగీరధుడు డా|| కె.యల్.రావు, పారిశ్రామికవేత్తలు కాశీనాధుని నాగేశ్వరరావు, కట్టమంచి కొళందరెడ్డి, వెలగపూడి రామకృష్ణ వీరంతా విజయవాడ ఖ్యాతిని అంతర్జాతీయ స్థాయికి తీసుకువెళ్ళారు.

గడచిన రెండు దశాబ్దాల కాలంలో విజయవాడ విద్యలవాడగా మారిపోయింది. సిద్ధార్థ కళాశాలలు ఈ నగరాన్ని చదువుల తల్లికి నిలయంగా మార్చివేశాయి. రాష్ట్ర ప్రసిద్ధి పొందిన కృష్ణవేణి, చైతన్య, నలందా, గీతాంజలి వంటి రెసిడెన్షియల్ కళాశాలలు విజయవాడకు ఒకప్పటి "మేధావుల సహారా" అనే పేరును చెరిపివేసి, "మేధావుల విహార భూమి" గా తీర్చిదిద్దాయి.

దేశం అంతా నిద్రపోతున్నా విజయవాడ మెలకువగానే ఉంటుందన్నట్లు విజయవాడ రైల్వేస్టేషన్, పండిట్ నెహ్రూ బస్‌స్టేషన్లు, ఇరవైనాలుగ్గంటలూ జనంతో కళకళలాడుతూ ఉంటాయి.

# మచిలీపట్నం

క్రీస్తుశకం 50లో "పెరిప్లస్ ఆఫ్ ది ఎరిత్రియాస్" అనే గ్రీకు గ్రంథం కృష్ణానది ముఖద్వారానికి సంబంధించిన ప్రాంతాన్ని "మసాలియా" అని పేర్కొంది. క్రీస్తుశకం 130లో "టోలెమీ" అనే గ్రీకు యాత్రికుడు 'మైసోలాస్' అనే నగరం గురించి ప్రస్తావించాడు.

ఈ మైసోలాస్ నగరం ఏది అనే విషయమై, స్పష్టమైన వివరణ లేదు. మరో కోణంలోంచి పరిశీలించినప్పుడు కొన్ని వివరాలు తెలుస్తాయి.

కృష్ణా తీరంలో వస్త్ర పరిశ్రమను విస్తరింపచేసిన 'సాలి' గోత్రీకులైన సాలంకాయనులు తమ పేరున 'మహాసాలిపట్నం' నిర్మించుకున్నారని, ఈ సాలంకాయనులే వేంగి రాజధానిగా కొంతకాలం తెలుగు నేలను ఏలారనీ, "నంది" గుర్తు కల్గిన సాలిగామ జెండా వీరిదేననీ, వీరే మహాసాలిపట్నం నుంచి సింహళం వెళ్ళి అక్కడ కూడా వస్త్రపరిశ్రమని వ్యవస్థాపించారనీ, ఎం.డి. రాఘవన్ అనే పరిశోధకుడు పేర్కొన్నాడు.

క్రీస్తుశకం 130లో గ్రీకు యాత్రికుడు టోలెమీ కృష్ణాతీరం వచ్చినప్పుడు ఈ మహాసాలిపట్నాన్నే మైసోలోస్‌గా వ్యవహరించి వుండ వచ్చు! ఇది నిజానికి కొత్త పరిశోధనాంశం. ఈ పరిశోధన ప్రకారం ఈనాటి మచిలీపట్నానికి రెండున్నర వేల సంవత్సరాల కనీస వయసు వుండివుండాలి!

కృష్ణాజిల్లా కైఫీయత్తుని 1815లో రాయడం జరిగింది. ఇందులో బందరు కథ వుంది. దాని ప్రకారం ఈ నగరాన్ని కరపట్నం అన్నారనీ, అది ఉప్పెనలో మునిగి పోవడం వలన వూరు ఇనకుదురుకు మారిందనీ, ఇనకుదురురాజు ముక్కంటి తన పేరుతో రాజుపేటని కట్టించాడనీ, రాజుకు గొడుగు పట్టేవారు గొడుగుపేట కట్టుకున్నారనీ, ఇలానే తక్కిన పేటలూ ఏర్పడి మచిలీపట్నం రూపొందిందనీ ఈ కైఫీయత్తు చెప్తుంది.

బిందదు అనే అంధుడైన ఓ ముసలి జాలరి ఉపాయంగా చాలా పెద్ద తిమింగలాన్ని పట్టి తెచ్చిన కథని బట్టి ఈ వూరుకు మచిలీపట్నం అనే పేరు వచ్చిందని ఈ కైఫీయత్తులో వుంది.

14వ శతాబ్దిలో అరబ్బులు ఇక్కడ తమ కాలనీలు ఏర్పరచుకున్నాక ఈ ఓడరేవుని మచిలీబందరుగా పిలిచారు.

బందరులో నివాసానికి వచ్చిన మొదటి విదేశీయులు 'షియా' మతస్థులైన అరబ్బులు.

క్రీస్తుశకం 1290లో మార్కోపోలో కృష్ణాతీరానికి వచ్చినప్పుడు బందరులో బట్టల పరిశ్రమని చూసి ఆశ్చర్యపోయాడట! 1397 నాటి ఓ దానశాసనం ఈ బందరు నగరానికి కనీసం ఏడెనిమిది వందల సంవత్సరాల చరిత్ర ఖచ్చితంగా వుందని చాటిచెప్తోందంటాడు గోర్డాన్ మెకంజీ.

1495లో బందరులో వుంటున్న షియా ముస్లింలు హిందూరాజులైన విజయనగర ప్రభువుల ప్రోత్సాహంతో ఇక్కడ ఓ మసీదు నిర్మించుకున్నారు. తిరుగులేని మత సామరస్యానికి ఈ మసీదు తార్కాణం!

1385-1475 మధ్యకాలంలో జీవించిన శ్రీనాథ కవిసార్వభౌముడు పలనాడులో ఎక్కువ గడిపినా, ఆయన జననం, బాల్యం, అవసానకాలం మాత్రం కృష్ణాజిల్లాలో గడిచాయి. శ్రీనాథుడు కాల్పట్టం అనే వూళ్ళో పుట్టి పెరిగాడు. ఎనిమిదవ శతాబ్దినాటి నాల్గవ విష్ణువర్ధనుడి గుడివాడ శాసనం ఆధారంగా రెండుబల్లి అనే గ్రామానికి తూర్పున కాల్పటనం, దక్షిణాన తుర్కుటూరు, పశ్చిమాన నిడుగాడు, ఉత్తరాన జక్కన చెరువూ సరిహద్దులుగా వున్నట్లుంది. దీన్ని బట్టి బందరుకు దగ్గరగా వున్న కల్పటమే ఈ కాల్పట్టంగా చరిత్రకారులు నిర్ధారించారు. అదే శ్రీనాథుడి జన్మస్థలం. ఆయన అత్తగారి వూరు గుడివాడ తాలూకా దగ్గుపల్లి. దగ్గుపల్లి దుగ్గన కవి శ్రీనాథుడికి బావమరిది.

కృష్ణానది ఒడ్డున బొడ్డుపల్లి అనే వూరుండేది. అక్కడ కొంత భూమిని కౌలుకు తీసుకొని, వ్యవసాయం చేసాడు "కృష్ణమ్మగొనిపోయే కొంతఫలము" అని, తన పంటంతా వరదపాలయి, శ్రీనాథుడు కడగండ్లపాలయ్యాడు. ఆ దిగులు తోనే ఆయన మరణించాడు. కృష్ణాజిల్లాలో వ్యవసాయం దెబ్బతిని అసువులు బాసిన మొదటి రైతు శ్రీనాథుడే..!!

క్రీస్తుశకం 1478లో బహమనీ సుల్తాన్ రెండవ మహమ్మద్‌షా బహమనీ మచిలీపట్నాన్ని ఆక్రమించాడు. బహమనీ సుల్తాన్‌లు అనతికాలంలోనే పరాజితులు కావడంతో, మచిలీపట్నం ఒరిస్సా గజపతుల ఆధీనంలోకి వెళ్ళింది. 1515లో కృష్ణరాయలు ఈ గజపతుల్ని ఓడించాడు. కానీ, రాయల తర్వాత 1557లో తళ్ళికోట యుద్ధంలో గెల్చిన గోల్కొండ సుల్తాన్ కులీ కుతుబ్‌షా 50వేలమంది సైనికుల్ని పంపి మచిలీపట్నాన్ని స్వాధీనం చేసుకున్నాడు.

గోల్కొండ సుల్తాన్‌లు వరుసగా యూరోపియన్ కంపెనీలకు బందరులో ఆశ్రయం కల్పించడం మొదలు పెట్టారు. మొదట పోర్చుగీసులు, తర్వాత డచ్చివారూ వ్యాపార కేంద్రాలు తెరిచారు. 1611లో ఈస్టిండియా కంపెనీ వచ్చింది!

1611 జనవరి నెల ఎనిమిదవ తేదీన కెప్టెన్ హిప్పన్ "గ్లోబ్" అనే పేరున్న ఓడపైన సరుకులు తీసుకొని ఈస్టిండియా కంపెనీ పక్షాన కోరమాండల్ సముద్రతీర ప్రాంతాలలో వ్యాపారానికి బయల్దేరాడు. అలా చేరారు బందర్లో బ్రిటిషర్లు.

1623 లో షాజహాన్ బందరు వచ్చాడు. తండ్రి జహంగీరుతో రాజ్యాధికారం సంగతి తేల్చుకోడానికి, అవసరం అయితే సైనిక తిరుగుబాటు చేయడానికి పెద్దపెట్టున సైన్యాన్ని సమకూర్చుకుని అహ్మదాబాద్ నుంచి గోల్కొండ చేరి సుల్తాన్ అనుమతితో బెజవాడ మీదుగా మచిలీపట్నం వచ్చాడు. సముద్ర మార్గాన తన సైన్యాన్ని కలకత్తా తీసుకువెళ్ళి అక్కడినించి రోడ్డు మార్గాన ఢిల్లీకి గోల్కొండ వెళ్ళాడు.

గోల్కొండ సుల్తాన్‌లు 1632లో బ్రిటిష్‌వారికి అనుకూలంగా మచిలీపట్నంలో వ్యాపారం చేసుకునేందుకు ఒకసారీ, వారికొక్కరికే అధికారం ఇస్తూ 1634లో ఇంకొక సారీ ఫర్మానాలు ఇచ్చారు.

కానీ, ఈ ఫర్మానాలు వారికి పెద్దగా ఉపయోగించలేదు. 1614 నుండి 1648 దాకా బందరు ప్రాంతం తీవ్ర దుర్భిక్ష పరిస్థితుల్ని ఎదుర్కొంది. పూటగడవక తమ పిల్లల్ని ఐదు పణాలకు కూడా అమ్ముకున్నారట! ఇలా బందర్లో పిల్లల్ని అమ్ముకోడానికి “సీసైడ్ సెల్లింగ్” అని పేరుపెట్టి ఐదుపణాలు చెల్లించడం ద్వారా కరువు పాలిట పడ్డ ప్రజల్ని ఆదుకొంటున్నట్టు బ్రిటిష్ వారు లండన్‌కు తెలుపుకున్నారు.

ఆ తర్వాత 1738 దాకా బ్రిటిష్ వారి ఆధిపత్యం అప్రతిహతంగానే సాగింది. ఫ్రెంచి గవర్నర్ తనదైన మార్గంలో బందరు చేరి నాలుగు కాణీలకు 75ఎకరాల భూమిని కొనుగోలు చేసి తమ వ్యాపార కేంద్రాన్ని తెరిచాడు. నెమ్మదిగా డచ్‌వారిని బందరు నుంచి తరిమి సముద్రం ఒడ్డున వాళ్ళ కట్టుకున్న కోటని ఆక్రమించాడు పరమక్రూరుడిగా పేరొందిన ‘బుస్సీ’ అనే బూచాడు. బందరులో డూప్లేకు సహాయకుడిగా వుండేవాడు. బొబ్బిలియుద్ధం 1757 జనవరి 26న మొదలయ్యింది. బుస్సీని అక్కడికి పంపించారు. ఆ తర్వాతి కథంతా మనకి తెల్సిందే!

మరో రెండేళ్ళ తర్వాత 1759లో బందరులో ఫ్రెంచి వారికీ, బ్రిటీష్ వారికీ హోరాహోరీ పోరాటం సాగింది. నడివీధిలో తుపాకీలతో కాల్చు కున్నారు. నెలరోజుల భీకర పోరు తర్వాత అతి కష్టంమీద పైచేయి సాధించి, కోటలోని ఫ్రెంచి వారిని అరెస్ట్ చేసి ఓడమీద లండన్‌కు తరలించేశారు. కోటని పూర్తిగా ఆక్రమించేశారు.

ఆ గెలిచిన ఆనందంలో బ్రిటిష్ సైనికులు మచిలీపట్నంలో భీభత్సాన్ని సృష్టించి, మాన భంగాలకు పాల్పడి అల్లకల్లోలకు కారకులయ్యారు. కొన్ని తరాలపాటు ఆనాటి బందరు పౌరులు ఇంగ్లీషు వాళ్ళు చేసిన ఆ అవమాన భారాన్ని మరిచిపోలేక పోయారు.

1831 లో సి.పి. బ్రౌన్ దొర మేజిస్ట్రేట్‌గా బందరులో పనిచేస్తున్న కాలంలో ఏనుగుల వీరస్వామి గారు కాశీయాత్ర చేసి మద్రాసుకు తిరిగి వెడుతూ బందరు వచ్చారు. ఆయన తన కాశీయాత్ర చరిత్ర గ్రంథంలో అప్పటి బందరు గురించి చాలా వివరాలు రాశారు. ముఖ్యమైన విషయం ఒకటుంది. బందరులో ఇరవై రెండు పేటలున్నాయని, ఒక్కొక్క పేటనీ లక్ష్మీకటాక్షం కల్గిన పురుషులు తామై కలుగ చేశారనీ, కాబట్టి ఆ పేటలో రాబడి - బాడిగెలు (అద్దెలు) రూపంలో వారి వంశీకులకు నెలకు నూట ఆరురూపాయల వంతున, అక్కడ కాపురాలు వుంటున్నవారు చెల్లిస్తున్నారనీ వీరాస్వామిగారు రాశారు. కాలనీలు నిర్మించే ఈనాటి రియల్ ఎస్టేట్స్ బిజినెస్ లాంటిది 200 ఏళ్ళ క్రితమే బందరులో వుండేదని దీన్ని బట్టి అర్థం అవుతోంది.

1859 డిసెంబర్‌లో చార్లెస్ ట్రికెల్యాన్ - మద్రాస్ గవర్నర్- ఒంగోలు నుంచి రాజమండ్రి దాకా వున్న ప్రాంతాన్ని కృష్ణాజిల్లాగా ప్రకటించాడు. 1904లో కృష్ణాజిల్లాలోంచి గుంటూరు వరకూ విడదీసి గుంటూరు జిల్లాగా ప్రకటించారు. 1925 ఏప్రియల్ 16న కృష్ణా జిల్లాలోంచి పశ్చిమ గోదావరి జిల్లాని గూడా విడగొట్టడం జరిగింది.

1841లో నోబుల్, ఫాక్స్, అనే క్రైస్తవ మతాధికారులు మొదటిసారిగా చర్చ్ ఆఫ్ మిషన్‌ని బందరులో స్థాపించి విద్యాలయాల నిర్వహణ ప్రారంభించారు.

1864 లో భయంకరమైన ఉప్పెన వచ్చి బందరుపట్టణాన్ని ముంచెత్తింది. 1977లో వచ్చిన దివిసీమ ఉప్పెన కన్నా ఇది పెద్దదని అంటారు. బ్రిటిష్ వారి అధికార కేంద్రాలన్నీ ధ్వంసం కావడంతో జిల్లా ముఖ్య పట్టణాన్ని బెజవాడకు తరలించాలను కున్నారు.

1882లో కృష్ణానదికి వరదలొచ్చి బందరు కాల్వ పొంగి ఇంకోసారి మచిలీపట్టణం నీటిలో మునిగిపోయింది. అయినా, ఆటుపోట్లు ఎన్ని ఎదురైనా ఈనాటికి చిరునవ్వులు చిందుస్తూనే ఉంటుంది బందరు-

1907లో బిపిన్ చంద్రపాల్ బందరు వచ్చాడు. 1921 ఏప్రియల్ 4న, 1929 ఏప్రియల్ 15న, 1933 డిసెంబర్ 17న మొత్తం 3 సార్లు గాంధీజీ మచిలీపట్నాన్ని సందర్శించారు. 1936 అక్టోబర్ 20న జవహర్‌లాల్ నెహ్రూ కూడా బందరు వచ్చారు.

క్రీస్తుశకం 1466లో బందరులో నివసించిన 'పోతురాయుడు' అనే కవి గురించి "హిస్టరీ ఆఫ్ మెడీవల్ డెక్కన్"లో వుంది. ఈయనకి "పుట్టుభట్టు" అని బిరుదుండేదట! అంటే 'సహజకవి' అని అర్థం కావచ్చు. ఈయన విక్రమాదిత్యుడి నుంచీ పిఠాపురం రాజా సింహ భూపతి వరకూ తెలుగునేలనేలిన రాజవంశాల చరిత్రని ప్రసంగ రత్నావళి పేరుతో రచించాడట.

ఆధునిక యుగంలో అడవి బాపిరాజు, తిరుపతి వేంకటరావు, కమలాకర కామేశ్వరావు, పింగళినాగేంద్రరావు, స్వరచక్రవర్తి సుసర్ల దక్షిణమూర్తి, మొదటి ఆస్థానకవి కాశీ కృష్ణాచార్యులు, విశ్వనాథ సత్యనారాయణ, జరుక్‌శాస్త్రి, పింగళి లక్ష్మీకాంతం, మునిమాణిక్యం నరసింహారావు, మల్లాది రామకృష్ణశాస్త్రి, ముట్నూరి కృష్ణారావు వంటి పుణ్యమూర్తులు నడిచిన నేల బందరు.

నవీన కాలంలో విహారి, శాలివాహన, మల్లాది వెంకటకృష్ణమూర్తి, ఆదివిష్ణు, సింగరాజు రామచంద్రమూర్తి, గుత్తికొండ సుబ్బారావు, రావిరంగారావు, స్వర్ణరాజ హనుమంతరావు, రాళ్ళబండి కవితా ప్రసాద్, బోయిన వెంకటేశ్వరరావు, డా॥మాదిరాజు రామలింగేశ్వరరావు వంటి ప్రముఖులు బందరులో సాహితీ స్పందనకు కారకులయ్యారు.

ఆంధ్ర సారస్వత సమితి, స్పందన సాహితీ సమాఖ్య, సాహితీమిత్రులు వంటి సంస్థలు రచయితలకు ప్రోత్సాహకరమైన వేదికలుగా నిలిచాయి.

దేశభక్త కొండా వెంకటప్పయ్య, విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, డా॥ భోగరాజు పట్టాభిసీతారామయ్య, అయ్యదేవర కాళేశ్వరరావు, కాశీనాథుని పూర్ణమల్లిభానుడు- వంటి స్వాతంత్ర యోధులు తమ రాజకీయ జీవితాలను బందరు నుంచే ప్రారంభించారు.

వస్త్ర పరిశ్రమతోనే బందరు కథ మొదలయ్యింది. పెదన కాలంకారీ పరిశ్రమ ఈనాటికి బందరు ప్రశస్తిని నిలుపుకొస్తోంది.

# "అమరావతి"

అద్భుతాలు జరిగే క్షేత్రాలు కొన్ని వుంటాయి. చరిత్రకు నిలిచిపోయే నిర్మాణాలో, చారిత్రక ఘట్టాలో, చారిత్రక సన్నివేశాలో ఆ క్షేత్రానికి ప్రాముఖ్యతనిస్తూనే వుంటాయి. అమరావతి అలాంటి అద్భుతక్షేత్రాలలో ఒకటి.

ఒకసారి మహోన్నత నాగరకతా వైభవం... ఇంకోసారి శిధిలీభూతమైన అలనాటి వైభోగం... అంతలోనే ఉప్పెనలో అదృష్టపు శకలం... మళ్ళీ శిధిలాలు... అమరావతి... ఆ విధంగా అలనాటి శైధిల్యపు గోడల మధ్య పంచారామాలలో మొదటి ఆరామంగా, ప్రసిద్ధ శైవ క్షేత్రంగా వెలుగుతోంది... ఈనాటికీ!

భవిష్యత్తులో ఇది మళ్ళీ తెలుగువారి రాజధాని నగరం అయినా ఆశ్చర్యపోనవసరం లేదు.... ఆ క్షేత్రానికి అలాంటి మహాత్మ్యం వుంది కూడా!

ధాన్య కటకం, ధరణికోట పక్కపక్కని వూళ్ళు!. క్రీస్తుకు చాలా పూర్వం ధరణికోట జైనుల సామ్రాజ్యంగా వుండేదనీ, ఆ జైనక్షేత్రానికి శివార్లలో బౌద్ధులు ధాన్యకటకం పేరుతో బౌద్ధక్షేత్రాన్ని నిర్మించుకున్నారనీ పండితులు చెప్తారు.

తర్వాతి కాలంలో శాతవాహనులు, ఆ తర్వాత  పల్లవులు కూడా కొంతకాలం తమ రాజధాని నగరంగా ధరణికోటని కొనసాగించారు.

త్రిలోచన పల్లవుడు అనే పల్లవరాజు ధరణికోటని రాజధానిగా శైవమత ప్రచారమే ధ్యేయంగా పాలన చేశాడు. ఈయనకే "ముక్కంటి కడివెట్టు" అనే పేరుండేది.

శైవ మత ప్రాబల్యం పెరిగిన తర్వాత ధరణికోటలోని అమరేశ్వరాలయం పంచారామాలలో మొదటిదిగా గణనకెక్కింది. శైవ క్షేత్రంలో "ఆరామం" అనే పదమే 'జైన' లేక 'బౌద్ధ' క్షేత్రాన్ని శివాలయంగా మార్చి వుంటారనడానికి సాక్ష్యంగా చెప్తారు. అయితే, అలా బౌద్ధులు (లేదా) జైనులగుడిని శివాలయంగా మార్చారనడానికి అంతకు మించిన ప్రబలమైన సాక్షాలేమి లేవు. కనిపించిన ప్రతి శివాలయాన్ని జైనుల దేవాలయం అనో, బౌద్ధుల దేవాలయం అనో అనడం కూడా పరిశోధకుని లక్షణం కాదు.

"శ్రీగిరీశాన్య దిగ్భాగే, కృష్ణాయా దక్షిణే తటే, అమరేశామితి ఖ్యాతం తీర్థం త్రైలోక్య విశృతమ్–" అనే శ్లోకం ఆధారంగా, ఈ అమరేశ్వరాలయం గురించి స్కాంద, బ్రహ్మాండ, పద్మపురాణాలలో వుందని ఇది అతి ప్రాచీన దేవాలయం అనీ, చెప్తారు.

అయితే, ఇదే దేవాలయంలో క్రీస్తుశకం 1182 నాటి కోట కేతరాజు అనే జైనుడికి సంబంధించిన ఒక శాసనం వుందనీ, గోర్డాన్ మెకెంజీ కృష్ణాడిస్ట్రిక్ట్ మేన్యువల్‌లో రాశాడు. ఈ మాన్యువల్ రచనాకాలం 1883, ఇప్పుడు మనం అక్కడకు వెళ్ళిచూస్తే ఇవేమీ కన్పించవు. వాటిగురించి వివరించి చెప్పగలవారు కూడా కన్పించరు.

క్రీ.శ. 13వ శతాబ్దంలో కాకతీయ ప్రతాపరుద్రుడి ఏలుబడిలో ధరణికోట వున్నప్పుడు కొంతకాలంపాటు ఆయన ఇక్కడ వున్నాడు. ఆ సందర్భంలో కాశీలో క్షామ పరిస్థితులు ఏర్పడిన కారణంగా ఆరువేలమంది బ్రాహ్మణులు కృష్ణని దాటి ధరణికోట చేరి ప్రతాపరుద్రుణ్ణి ఆశ్రయించారట.

అప్పటికి జైనుల ప్రాబల్యం ఇంకా అక్కడవుంది. పాల్కురికి సోమనాథుడు ప్రతాపరుద్రుణ్ణి శైవుడిగా మార్చాడని చెప్తారు. కాశీ నుంచి వచ్చిన ఈ శైవ బ్రాహ్మణులకీ, జైనులకీ మధ్య పోటీని పెట్టి, ప్రతాపరుద్రుడు ఎవరి గొప్పతనం ఎంతో పరీక్షించదలిచాడనీ, కాశీపండితులు మోసపూరితంగా గెలిచి, జైనుల గ్రంథాల్ని తగలబెట్టారనీ, అంతా తెలిసినా ప్రతాపరుద్రుడు మౌనంగా చూస్తూ వూరుకున్నాడనీ-కథ- గుంటూరు కైఫీయత్తులో వుంది. అప్పుడే జైనుల్ని నూనె గానుగలోకి తోసి ఆడించి చంపారనీ భయంకరమైన సంఘటన జరిగినట్లు ఈ కైఫీయత్తు చెప్తుంది.

కాకతీయుల తర్వాత రెడ్డిరాజులు మొదటగా ఈ అమరేశ్వరాలయాన్నీ పునర్నిర్మించారు. 1361లో అనవేమారెడ్డి వేయించిన శాసనం, 1515లో కృష్ణదేవరాయలు ఈ దేవాలయంలో చేసిన తులాప్రదోషదానం చరిత్రకు దొరికిన ఆధారాలు.

ఈ తర్వాత మరో రెండువందల ఎనభై ఏళ్ళ స్తబ్ధత... 1797లో చింతపల్లి జమీందారు రాజా వెంకటాద్రినాయుడు ప్రాభవం వెలిగిపోతున్న కాలంలో ఒకరోజు, బ్రిటిష్‌వాళ్ళు చింతపల్లి కోటని ముట్టడించి జమీందారీని ఆక్రమించారు. అదృష్టవశాత్తు ఆ సమయానికి వెంకటాద్రినాయుడు కోటలో లేరు. దాడి విషయం తెల్సుకుని, ఆయన చింతపల్లి వెళ్ళకుండా నేరుగా ధరణికోటవచ్చి, అమరేశ్వరుణ్ణి దర్శించుకొని, అక్కడ ఓ పెద్ద నగరాన్ని కట్టేందుకు సంకల్పించుకున్నాడు. ఆ కొత్త నగరానికి అమరేశ్వరుడి పేరున 'అమరావతి' అని పేరుపెట్టాడు. దానినే ఇంక తన రాజధాని నగరంగా ప్రకటించాడు.

రాజధానిని పట్టుకుంటే రాజ్యాన్ని జయించినట్టేననుకున్న బ్రిటిష్ వారిని ఇలా రాజావెంకటాద్రినాయుడు యుక్తిగా దెబ్బతీశాడు.

అమరావతి నగరానికి విశాలమైన వీధులతో ఒక ప్లానును తయారుచేయించాడు.

వివిధ వ్యాపారుల్ని ఆహ్వానించి అక్కడ దుకాణాలు తెరిపించాడు. తన జమీందారీలోని ప్రముఖుల్ని పిలిపించి వారికి అక్కడ స్థావరాలు కల్పించుకొనే అవకాశం ఇచ్చాడు, సుందరమైన నగరంగా దాన్ని రూపొందించాలనుకున్నాడు. ఉద్యానవనాలు కూడా ఏర్పాటు చేశాడు. రాగిరేకుతో తాపడం చేసిన అందమైన కోటని నిర్మించాడు.

అప్పట్లో అమరావతిలోని ప్రాచీన బౌద్ధస్తూపాలన్నీ దీపాలదిన్నె అని పిలిచే ఎత్తయిన మట్టి దిబ్బలో పూడుకుపోయి వున్నాయి. 'దీపాలదిన్నె' అని పిలవడానికి కారణం, స్తూపాన్ని ప్రజలు ఆరాధించే రోజుల్లో దీపం వెలిగించి ఆరాధించే అలవాటు వుండేది కావచ్చునీ, అలా స్తూపం నిండా ప్రజలు వెలిగించిన దీపాలతో బౌద్ధస్తూపం వెలిగిపోతూండేదనీ,

కొందరు పరిశోధకులు ఊహిస్తున్నారు. ఇప్పుడక్కడ స్తూపం లేదు. అది నేలమట్టం అయిపోయి మట్టి పేరుకుని మట్టిదిబ్బ అయ్యింది! కోటని నిర్మించేప్పుడు ఆ మట్టిదిబ్బని తవ్వి మట్టిని వాడు కోవాలనుకొన్నాడు వెంకటాద్రి నాయుడుగారు.

జనంలో ప్రచారంగా వున్న కథ ఏమిటంటే, ఈ దీపాలదిన్నె అనే మట్టి దిబ్బ అడుగున లంకెల బిందెలున్నాయని, పూర్వరాజులు దాచిన నిధినిక్షేపాలు చాలా దొరుకుతాయనీ! కానీ, ఇన్నాళ్ళు ఈ మట్టిదిబ్బని తవ్వే సాహసం ఎవరు చేయలేదు. రక్తం కక్కుకు చచ్చిపోతారని భయం వుండేది.

1797లో వెంకటాద్రినాయిదు తన మనుషుల్ని పెట్టి దీపాలదిన్నెని తవ్వించడం మొదలుపెట్టాడు. కుప్పకూలిపోయిన భవంతుల తాలూకు పెద్ద పెద్ద పాలరాతి పలకలు (MARBLE SLABS), శిలాశాసనాలు. విగ్రహాలు, విరిగిపోయిన శిల్పాలూ ఏవేవో దొరకడం మొదలు పెట్టాయి. కొన్ని కోటగోడల్లోకి పోయాయి. కొన్నింటిని దేవాలయంలోనికి మెట్లుగా పడేశారు. అవన్నీ ఒకనాటి బౌద్ధస్తూపం అవశేషాలన్న సంగతి ఎవరికీ తెలియదు-ఆనాడు!

అప్పట్లో కోలిన్ మెకెంజీ కైఫీయత్తులు తయారు చేయించే కార్యక్రమంలో సర్వేయర్ జనరల్‌గా వున్నాడు. 1797లో ఈయన ఈ వార్త తెలుసుకొని హుటాహుటిన అమరావతి చేరుకున్నాడు. ఫలకాల్ని పరిశీలించి ఇది బౌద్ధ శిల్ప కళాసంపద అనీ, ఇక్కడ బహుశా బౌద్ధ స్తూపం వంటిది ఏదైనా వుండివుంటుందనీ ఊహించాడు. ప్రభుత్వానికి దీనిగురించి ఒక రిపోర్ట్ పంపాడు కూడా.

కానీ, పాలరాతి ఫలకాల్ని ఎత్తుకు పోవడం అనేది ఆగలేదు. ధననిక్షేపాలు వుండి వుంటాయన్న ఆశ చావకపోవడాన ప్రైవేట్ తవ్వకాలు ఆపలేదు.

1816లో కోలిన్ మెకంజీ రెండోసారి అమరావతి వచ్చాడు. వస్తూ కొందరు సహాయకుల్ని వెంట తెచ్చుకువచ్చాడు. శాస్త్రబద్ధంగా తవ్వకాలు జరిపించాడు అనేక పలకలు బైటకొచ్చాయి. ఎనిమిది పలకల్ని బందరుకీ, ఏడింటిని కలకత్తాకీ, నాల్గింటిని లండన్‌కీ తరలించారు. ఆ తర్వాత కొలీన్ మెకంజీ మరణించాడు.

1830లో రాబర్ట్సన్ మచిలీప్పటం కలెక్టరుగా వచ్చి మరో ముప్పయి మూడు పాలరాతి పలకల్ని అమరావతి నుంచి తెప్పించి బందరు కోనేరు సెంటర్లో అందంగా అలంకరింప చేశాడట!

1835లో ఫ్రెడరిక్ ఆదామ్, మద్రాస్ గవర్నర్, బందరును సందర్శించడానికి వచ్చాడు. కోనేరు సెంటర్లో ఈ రాతి పలకల మీద చెక్కిన అందమైన శిల్పాల్ని చూసి, ముగ్ధుడై పోయాడట. ఆయనతో వచ్చిన డాక్టర్ బెంజా అనే సర్జన్, గవర్నర్ చెవిలో నెమ్మదిగా "మన మిత్రుడూ, శిల్పకారుడూ, "గాగినో"కి వీటిని అందిస్తే, ఈ శిల్పాలన్నీ తను చెక్కిన శిల్పాలుగా చెప్పుకొంటాండు గదా.... ఎవడు చూడొచ్చాడు... ఇది ఇక్కడిదని!" అని!

వెంటనే గవర్నర్ గారు కలెక్టర్‌ని పిలిచి, ఈ శిల్పాలు ఇక్కడుంటే ఎత్తుకుపోతారు. వీటిని భద్రంగా వుండే చోటుకి తరలించండి...." అని ఆదేశించాడు.

కానీ, రాబర్ట్సన్ తర్వాత ఆరు సంవత్సరాల్లో ఎనిమిది మంది కలెక్టర్లు మారారు. ఎవరూ ఇక్కడి నుంచి ఈ శిలాఫలకాల్ని తరలించాలని ప్రయత్నించలేదు.

1836లో "గోల్డింఘూర్" బందరుకు కలెక్టర్‌గా వచ్చాడు. ఆయన ఈ శిలాఫలకాల్ని భద్రం చేసే నెపంతో అలెగ్జాండర్ అనే ఆంగ్లేయ అధికారికి వాటిని ధారాదత్తం చేశాడు. ఆయన వీటిని తన తోటలోకి తరలించి అలంకరించుకున్నాడు.

కొన్నాళ్ళకు వీటి ఆరావచ్చి, అవి ఏమయ్యాయని ప్రభుత్వం వెదికితే ఫలానావారి తోటలో వున్నాయని తెల్సింది. బ్రిటిష్ ప్రభుత్వం అలెగ్జాండర్‌గారికి ఎదురు డబ్బులిచ్చి కొనుగోలు చేసి వాటిని లండన్‌కి తరలించిందట... గోర్డాన్ మెకంజీయే స్వయంగా రికార్డు చేసిన అమరావతి శిల్పాల కైంకర్యం కథ ఇదీ!

1840లో వాల్టర్ ఎలియట్ అనే అధికారి ఈ దీపాల దిన్నెను పూర్తిగా తవ్వించి, 90 పాలరాతి ఫలకాలముక్కల్ని మద్రాసు మ్యూజియంకు, 30 పలకల్ని మచిలీపట్నానికీ తరలించాడు. 1855లో ఎలియట్ గారి పాలరాతి పలకలు" అనే పేరుతో ఈ 129 పలకలమీద రెవరెండ్ టేలర్ అనే పరిశోధకుడు సమగ్రమైన రిపోర్టు రాశాడట!

ఆ తర్వాత ఇంచుమించుగా ఈ శిల్ప కళాసంపదనంతా లండన్‌కు తరలించారు. 1867లో ఫెర్గుసన్- వృక్షాల్ని సర్పాల్ని పూజించే ఆచారం మీద పుస్తకం రాసేప్పుడు వాటిని ప్రస్తావించడంతో బైట ప్రపంచానికి అమరావతి బౌద్ధస్థూపం విషయం కొంత తెలిసింది.

1877లో రాబర్ట్‌స్యూయల్ అనే మహా పండితుడు, పరిశోధకుడు కృష్ణాతీరానికి వచ్చి పరిశీలించిన తర్వాత- తెలుగువారికి బౌద్ధ మతంతో గల సంబంధం వివరాలు బైటకొచ్చాయి. 1880లో బ్రిటిష్ రాజ ప్రతినిధి అమరావతికి వచ్చి ఈ ప్రాంతాన్ని సందర్శించి వెళ్ళాడు.

అమరావతిలోని బౌద్ధ స్థావరాల్ని ప్రజలు అనాగరకంగా, అమాయకంగా అపురూపమైన శిలా సంపదని ధ్వంసం చేశారని మెకంజీతో సహా చాలా మంది పాశ్చాత్య రచయితలు రాశారు. నిజమే! వీళ్ళు అమాయకులే! కానీ, ఈ అమూల్య సంపదని తస్కరించుకుపోయి స్వంత తోటల్లో అలంకరించుకున్న వాళ్ళనీ, తమదేశాలకు తరిలించుకుపోయిన వాళ్ళని పల్లెత్తుమాట అనలేదెవరూ....!!

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చాక, మన సాంస్కృతిక వారసత్వ సంపదని బ్రిటిష్ ప్రభుత్వంవారో- లండన్ మ్యూజియం వారో మరెవరో ఎందుకు వుంచుకోవాలి? మా సంపదని మాకివ్వమని మన తెలుగు ప్రభుత్వాలు లండన్‌ను ఎందుకు అడగలేక పోతున్నాయి...???

పోగొట్టుకున్న పాలరాతి ఫలకాల్ని మిగిలి వున్నంత వరకైనా తెచ్చి బౌద్ధస్థూపాన్నీ యథాతథంతా నిలపగలిగితే అమరావతి- ఈజిప్ట్ పిరిమిడ్లని మించిన పర్యాటక కేంద్రం అవుతుంది!... అని 1883లోనే గోర్డాన్ మెకంజీ రాశాడు!

అదీ అమరావతి ప్రశస్తి!

# గుడివాడ

కృష్ణాజిల్లాలో బౌద్ధ క్షేత్రమో జైనక్షేత్రమో కాని ప్రాచీన గ్రామం లేదనడం అతిశయోక్తికాదు. అది వాస్తవం. బెజవాడ మాదిరే, గుడివాడ కూడా క్రీస్తుపూర్వం కనీసం ఐదువందల ఏళ్ళనుంచీ ప్రాచీన వైభవం కలిగి, జైన బౌద్ధమతాలకు ఆలవాలంగా నిలిచిన ప్రదేశం.

1883లో కృష్ణాడిస్ట్రిక్ట్ మాన్యువల్‌ను తయారు చేస్తూ గోర్డాన్ మెకంజీ గుడివాడ మధ్యలో బౌద్ధస్తూపం, గుడివాడకు పశ్చిమంగా ఒక జైన శిల్పమూ వున్నట్టు రాశాడు. ఇప్పుడు ఇవేవీ లేవు. ఇంకా పశ్చిమంగా వెడితే, ఒకప్పటి ప్రాచీన గుడివాడ పట్టణం శిధిలాలు కన్పిస్తాయి. అంటే, ఇప్పుడున్న గుడివాడ కొత్తగా విస్తరించిన ప్రాంతం కావచ్చునన్న మాట!

భోగందిబ్బ లేక దీపాల దిబ్బగా పిలవబడిన మట్టిగుట్ట లోపల బౌద్ధుల కట్టడాల శిధిలాలుండేవి. 1840లో బెజవాడ నుంచి బందరుకు ఒక రోడ్డుని గుడివాడ మీదుగా వేస్తున్నప్పుడు బ్రిటిష్ పబ్లిక్ వర్క్సు డిపార్ట్‌మెంట్ వారు ఈ మట్టి దిబ్బని తవ్వి రోడ్డు అడుగున వేసేశారు. రోడ్డు నిర్మాణంలో నలిగిందంతా నలిగిపోగా, మిగిలిన దాంట్లోంచి పురావస్తుశాఖవారు కొంత చరిత్రని పదిలపరచగలిగారు. అప్పుడు దొరికిన వాటిల్లో ఆంధ్ర శాతవాహనుల నాణాలు ఎక్కువగా వున్నాయి. వాటిలో ఒక విదేశీ నాణెం కూడా వుంది. అది గ్రీసు లేదా రోమ్‌ది అయివుండవచ్చు. తెడ్ల పడవ పైతట్టు అర్ధచంద్రాకారంగా వుండి, రెండు తెరచాప కొయ్యలున్న పడవ బొమ్మనాణెం ఇది. నాలుగు శిలాపేటికలు కూడా దొరికాయి. అలెగ్జాండర్ ఈ నాణాలను వెలుగులోకి తెచ్చి గుడివాడ ప్రశస్తిని లోకానికి చాటాడు.

ప్రాచీన శిలాశాసనాలలో కుద్రవారం, గుద్రవారం గుద్రహారం, గుద్ధవాడ నాడు ఇలాంటి పేర్లతో వ్యవహరించబడిన వూరు ఈ గుడివాడే కావచ్చు. గృధ్రరాజు అంటే జటాయువు. గృధ్రః అంటే గ్రద్ద. బహుశా కృష్ణాముఖద్వారం దివిసీమ నుంచి అమరావతి దాకా వ్యాపించిన నాగులకు వ్యతిరేకులైన జాతి ప్రజలెవరైనా ఈ పేరు ఈ ఊరికి గృధ్రవాడ అని పెట్టుకొని వుండొచ్చు. శ్రీకాకుళం నుంచి నాగాయలంక దాకా నాగుల ఆధీనంలోని ప్రాంతం అయితే, గుడివాడ నాగుల వ్యతిరేకులైన యక్షుల ప్రాంతం కావచ్చు. ఇందుకు తగిన సాక్ష్యాధారాలు ఏమీలేవు. ఇది ఊహ మాత్రమే!

శాలంకాయన రెండవ నందివర్మ కంతేరు శాసనంలో "కుద్రహార్ విషయే కురువాడ గ్రామే-" అంటే, కుద్రహార గ్రామంలో గురువాడ గ్రామం గురించి పేర్కొన్నాడు. విషయం అంటే "పరగణాలాంటిది. షుమారు 15 శాసనాలు బందరు, కోరుమిల్లి, పిఠాపురం, ద్రాక్షారామం, కంతేరుల్లో గృధ్రవార విషయ ప్రస్తావన వున్నవి దొరికాయి. ఈ శాసనాల ననుసరించి ఒక పట్టికని తయారు చేస్తే, బందరు నుంచి రాజోలు రామచంద్రపురం పిఠాపురం దాకా ఒకప్పుడు ఈ గుడివాడ పరగణా విస్తరించి వుండేదని అర్థం అవుతోంది.

బృహత్ఫలాయనులు కూడూరు రాజధానిగా క్రీ.పూ. 2.3 శతాబ్దాల కాలంలో తెలుగునేలని ఏలారనీ ఈ కూడూరు టోలమీ చెప్పిన 'కోడ్డూర' ఒకటేనని, కూడూహారం లేక కుద్రహారం, లేక గుధ్రవారం ఇదేనని, బందరుకు నాలుగుమైళ్ళ దూరంలో వున్న గూడూర్ కూడూరనీ కొందరు శాసన పరిశోధకుల భావన. గూడూరు కేంద్రంగా వున్న పరగణాలో గుడివాడ వుండేదని వీరి అభిప్రాయం.

1424లో ఓఢ్ర గజపతుల ఏలుబడిలో కొల్లేరు వరకూ విస్తరించిన రాజ్యం వుండేది. రెడ్డిరాజులు పతనావస్థకు చేరుకున్న దశలో లాంగూల గజపతి ఈ ప్రాంతాల్ని జయించాడు. ఆ తర్వాత కపిలేశ్వర గజపతి, వరంగల్ దాకా జయించి మొగల్ సైన్యాన్ని అవతలికి తరిమాడు. పురుషోత్తమ గజపతి ప్రతాపరుద్ర గజపతి, వీరభద్ర గజపతి వాళ్ళంతా ప్రముఖంగా పాలించారు. వీరిలో మొదటగా సాగారాంధ్ర జిల్లాల మీదకు దాడి వచ్చిన లాంగూల గజపతి కొల్లేటికి తూర్పు దిశన ఒక కోటని నిర్మించాడు.

గుడివాడకు దగ్గరగా వున్న కానుకల్లులో రెడ్డిరాజుల కాలంనాటి కోట ఒకటి వుండేది. కెప్టెన్ మెకరీన్ 1750లో ఈ కోటని ఆక్రమించినట్లు ఒక రికార్డు తెలుపుతోంది-

నాల్గవ విష్ణువర్ధనుడి శాసనం ఒకటి ఎనిమిదవ శతాబ్దం కాలం నాటిది గుడివాడలో దొరికింది. ఇందులో రెండుబల్లి అనే గ్రామానికి తూర్పున కాల్పట్టనం, దక్షిణాన తార్కుటూరు పశ్చిమాన నిడుగాడు, ఉత్తరాన జక్కన చెరువూ వున్నట్లుంది.

కాల్పట్టనం, తార్కుటూరు బందరు గుడివాడల మధ్య రెండు గ్రామాలు- కల్పటం, తరుకుటూరుగా పిలువబడ్తున్నాయి. శ్రీనాథుడు పుట్టిన కాల్పట్టనమే ఈ కల్పటం కావచ్చు ననడానికి ఈ శాసనం ఒక ఆధారం. శ్రీనాథుడు 14 వశతాబ్దకి చెందిన వాడు. ఆయన అత్తవారిల్లు గుడివాడ తాలూకా దగ్గుపల్లి. దగ్గుపల్లి దుగ్గన్న కవి శ్రీనాథుడి బావమరిది.

1757లో కమదన సోదరులుగా ప్రసిద్ధులైన ఇద్దరు మంత్రులు నూజివీడు ప్రభువులకు ఆపత్కాలంలో సాయపడి గుడివాడ, కలిదిండి, విన్నకోట, భట్రాజుపల్లె, బాహర్జల్లి ఈ

నాలుగు పరగణాలనీ బహుమానంగా పొందారు! "చార్‌మహల్ హవేలీ" అని పిలిచే వాళ్ళు ఈ జమీందారీని! కొల్లేటికి వెలుపల ప్రాంతాన్ని బాహర్జల్లి అంటారు-

రాజా వెంకటాద్రి అప్పారావు, 1759లో ఫ్రెంచివారు, దక్కన్ సబేదారు సలాబత్ జంగ్ కూడా ఈ జమీందారీని కమదన వంశీకులకి ఖాయపరిచారు. మొగల్తూరు జమీందారు రాజా కలిదిండి తిరుపతిరాజు ఈ చార్‌మాహల్ హవేలికి మధ్యవర్తి హామీగా వుండి, 80వేలు నష్టపోయారు. ఆ నష్టాన్ని భర్తీ చేసుకోడానికి ఆరేళ్ళపాటు చార్మహల్ హవేలీని పాలించుకోడానికి తిరుపతి రాజు గారికి అప్పగించారు.

1773-79 మధ్యకాలంలో ఈ జమీందారీ వారసులు ఒక్కరొక్కరు మరణించారు. మధ్యలో కాంద్రేగుల వెంకట్రాయులు అనే దుబాసీకి కొన్నాళ్ళు పాలనని అప్పగించింది బ్రిటిష్ కంపెనీ ప్రభుత్వం.

1813లో బెజవాడ జమీందార్లు కలిదిండినీ, మైలవరం జమీందార్లు భట్రాజు పల్లినీ కొనుక్కున్నారు- చివరికి గుడివాడ కలిదిండి మాత్రమే మిగిలాయి. కమదన పాపయ్యారావుకి ఈ రెండు పరగణాల పాలన అప్పగించారు. అతని తర్వాత ఆ జమీందారీ పూర్తిగా అంతరించి పోయింది!. మిగిలిన వారసులకి నెలకు తలా ఒక వందరూపాయలూ భరణంగా ఇచ్చి గుడివాడ, కలిదిండి జమీందారీని జేబులో వేసుకొంది కంపెనీ ప్రభుత్వం. అలా ముగిసిపోయింది గుడివాడ జమీందారీ కథ.

1860లో బ్రిటిష్ అధికారులు తయారు చేసిన ఒక రిపోర్టు ప్రకారం కొల్లేరు నీటిని ఎత్తిపోతల ద్వారా పంట పొలాల్లోకి మళ్ళించే ప్రయత్నాలు బాగా జరిగినట్లు తెలుస్తోంది. ఆనకట్టు పద్ధతిలో కొల్లేరు భూముల్ని సాగులోకి తెచ్చారు. సంవత్సరానికి ఒక సారి అద్దె చెల్లించే విధంగా రైతుల్ని ప్రోత్సహించారు కూడా! శిస్తు ఎక్కువ వసూలు చేసుకోవడమే ధ్యేయం అయినప్పటికీ, వ్యవసాయానికి పెద్దపీట వేయడం వలన గుడివాడ డెల్టా అభివృద్ధికి నోచుకోగల్గింది.

19వ శతాబ్దం తొలినాటికి కృష్ణాజిల్లా గ్రామీణ వ్యవస్థలో రాజకీయ చైతన్యానికి గుడివాడ కేంద్ర స్థానంగా నిలిచింది. హరిజనోద్ధరణ కార్యక్రమాన్ని జీవిత ధ్యేయంగా పెట్టుకున్న గూడూరు రామచంద్రుడు తెలుగు వారిలో స్వాతంత్రోద్యమ దీప్తిని కల్గించిన తొలితరం యోధుల్లో ముఖ్యుడు. 1921 మార్చి 30న బెజవాడలో జరిగిన కాంగ్రెస్ కార్యవర్గ సమావేశంలో గాంధీకి హరిజనుల సమస్యల్ని వివరించి, అస్పృశ్యతా నివారణ

వైపు స్వాతంత్రోద్యమం నడిచేలా గాంధీని ప్రేరేపించడంలో ఈ గూడూరు రామచంద్రుడు విశేష కృషిచేశారు. ఇది గుడివాడకు గర్వకారణమైన విషయం.

రామచంద్రుడిగారి స్ఫూర్తిని గుడివాడ సమీపంలో గల అంగలూరు గ్రామం తరుణం అందుకుంది. అనేక మంది స్త్రీ పురుషులు ఉప్పు సత్యాగ్రహం సమయంలో ఈ అంగలూరు నుంచి జైలుకు వెళ్ళారు. గాంధీ గారితో కలిసి సబర్మతి ఆశ్రమం నుంచి సముద్రం దాకా పాదయాత్రలో పాల్గొన్న తెలుగువారి ఏకైక ప్రతినిధి ఎర్నేని సుబ్రహ్మణ్యం ఈ అంగలూరు వాడే!

దుగ్గిరాల బలరామకృష్ణయ్య, త్రిపురనేని రామస్వామి చౌదరి వంటి ప్రముఖులు అంగలూరు గుడివాడకూ పేరు తెచ్చి పెట్టిన ప్రసిద్ధులు. "మానవుని వెలిబెట్టిన దేవుని వెలిబెట్టినట్టే" అనే నినాదాన్ని మొదటిసారిగా అందించి, హరిజనుల చేత దేవాలయ ప్రవేశం చేయించిన ఘనత ఈ ఊరికే దక్కుతుంది.

రాజకీయంగానూ, సాంస్కృతికం గానూ ఎంతో చైతన్యవంతమైన గుడివాడ అలనాటి వైభవానికి సాక్షిగా నిలిచిన ప్రాచీన పట్టణం. ఈనాటికి కాంతి వంతంగానే కన్పిస్తోంది.!!

# జుజ్జూరు

ప్రతిభ, అదృష్టం రెండూ కలిసొస్తేనే, జమీందారు అన్పించుకోగలుగుతాడు. ఏనుగు ఎవరిమెడలో దండవేస్తే వాడు రాజు కాగలడేమో గానీ, రాజ్యాన్ని ఎన్నిరోజులు నిలుపుకోగలడనేది సందేహం...!

అధికారాన్ని సాధించుకోవాలన్నా, దాన్ని నిలుపుకోవాలన్నా, నిలిపి తన వాళ్ళకు పంచుకోవాలన్నా అదృష్టం, ప్రతిభ రెండూ కావాలి.

అదృష్టాన్ని మాత్రమే నమ్ముకున్న ప్రతిభా శూన్యులు కొందరు! అదృష్టహీనులైన ప్రతిభావంతులు ఇంకొందరు!!

నైజాం నవాబు దగ్గర ముఖ్యమంత్రి పదవి దాకా ఎదిగిన ఓ కృష్ణాజిల్లా జమీందారు కథ కూడా ఇలానే ముగిసిపోయింది.

కొండపల్లి పర్వత శ్రేణుల్లో కృష్ణానది ఒడ్డున జుజ్జూరు గ్రామం నిజాం పాలనలోనే వుండేది. ఉత్తర సర్కారు జిల్లాల్ని బ్రిటిష్ వారికి ధారాదత్తం చేసేప్పుడు 1766లో నిజాంప్రభువు కొండపల్లె సర్కారులో వున్న పరిటాలతో సహా పరగణాలన్నీ తన ఆధీనంలోనే వుంచుకుని, తక్కిన కృష్ణాజిల్లా ప్రాంతాన్ని ఈస్టిండియా కంపెనీకి ఇచ్చేశాడు! పరిటాల చుట్టుపక్కల ప్రాంతంలో వజ్రాల రాళ్ళు దొరకడంతో నవాబు ఈ ప్రాంతాల్ని బ్రిటిష్ వారికి ఇవ్వకుండా తానే నిలబెట్టుకున్నాడు.

బెజవాడ నుంచి హైదారాబాద్ వెళ్ళడానికి నూటపాతిక ఏళ్ళక్రితం వేసిన రోడ్డు మార్గాన్నే ఈనాటికి మనం ఉపయోగిస్తున్నాం. బెజవాడ తర్వాత మొదటి మజలీ కంచికచర్ల. టోలమీ అనే గ్రీకు యాత్రికుడు క్రీస్తు పూర్వం ఒకటో శతాబ్దిలో కృష్ణాతీరాన్ని సందర్శించినప్పుడు కొంటకోసిల అనే వూరు గురించి రాశాడు. కంచకచర్ల అనే పేరుకి ఇది గ్రీకు భ్రష్ట రూపం అని కొందరు పండితులంటారు.

కంచికచర్లకు ఉత్తరంగా నాలుగు మైళ్ళదూరంలో జుజ్జూరు వుంది. బెజవాడనీ మధిరనీ కూడా ఏలిన కలువకొలను ఇంటి పేరుగల జమీందార్లు ఈ జజ్జూరులో ఒక కోటని కట్టుకుని ఇక్కడినించి పాలన చేసేవాళ్ళు. కలువ కొలను వారికి జుజ్జూరు జమీందారీ దక్కడం వెనక ఒక కథ వుంది.

క్రీస్తుశకం 980 సంవత్సరంలో అమ్మరాజు విష్ణువర్ధనుడు తన సేనాపతి చాళుక్య భీముడికి ఈ వూరుని జాగీరుగా ఇచ్చాడు. ఆ తర్వాత ఈ ప్రాంతం అంతా, మొగలాయి

చక్రవర్తుల ఆధీనంలోకి, కుతుబ్‌షాహీల ఆధీనంలోకీ, చివరగా ఆసఫ్ జాహీ వంశీకుల ఏలుబడిలోకీ వచ్చాయి.

క్రీస్తుశకం 1698లో మాదిరాజు వంశీకులైన ఇద్దరు అన్నదమ్ములు కూర్మరాజును దేశముఖిగానూ, కోదండుదు అనే ఆయన్ని దేశ పాండే గానూ నియమిస్తూ గోల్కొండ సుల్తానుల నుంచి ఒక సనదు సంపాదించారు.

జుజ్జూరుకు పక్కన నందిగామని వాసిరెడ్డి వంశీకులు, అవతల మధిరని కలువకొలను వారూ పరిపాలించేవారు. వీళ్ళలో వీళ్ళకి స్నేహాలూ, సరిహద్దు తగాదాలూ నడుస్తూ వుండేవి. జుజ్జూరు మాదిరాజు వారికీ, మధిర కలువకొలను వారికీ మధ్య తీవ్రమైన శతృత్వమే వుండేది. ఈ తగాదాల మధ్య ఒకసారి మధిర జమీందార్లు మాదిరాజు వాళ్ళని చంపి జుజ్జూరుని ఆక్రమించారని కథ. క్రీ.శ. 1750–ఆ ప్రాంతాల్లో జరిగినదిగా భావించబడ్తున్న కథ ఇది. ప్రజల్లో వ్యాపించివున్న గాథకి డాక్యుమెంటరీ ఆధారాలేమీ లేవు.

జమీందారీ పోయిన తర్వాత వీరి కుటుంబీకుడు మాదిరాజు వెంకటనర్సయ్య పొట్ట చేత్తో పట్టుకుని, జుజ్జూరు వదిలి ఖమ్మం చేరుకున్నాడు– ఉద్యోగాన్వేషణ కోసం!

హైదరాబాదు నవాబులు పాలనా విధానంలో, ఆబ్కారీ పన్ను వసూలు చేసేందుకు కాంట్రాక్టర్లను వేలంపాటద్వారా నిర్ణయించే విధానం అమలులో వుండేది. ఈ కాంట్రాక్టుని 'కరోడ్గిరి' అనే వాళ్ళు– పూర్తిగా పన్ను వసూలు చేయగలిగితే, ఒక కోటి వరకూ కమీషనుగా మిగుల్తుంది. కాబట్టి దాన్ని కరోడ్గిరీ అన్నారు.

వెంకట నర్సు అలాంటి కరోడ్గిరి కాంట్రాక్టరు కరీంఖాన్ దగ్గర పనికి కుదిరాడు. ఆయన పెద్దకొడుకు వెంకటకృష్ణమ్మ తండ్రికి సహాయపడుతూ తన అసమానమైన ప్రతిభతో కాంట్రాక్టర్‌ని ఆకట్టుకుని, ఆయన ప్రాపకం సంపాదించి, ఒక దశలో కాంట్రాక్ట్ వ్యవహారం అంతా తానొక్కడే నిర్వహించగల స్థితికి ఎదిగాడు.

సహజంగానే వెంకటకృష్ణమ్మ చిన్నవయసులోనే ఇతరుల అసూయద్వేషాలకు గురయ్యాడు. కరీంఖాన్ మనసు విరిచేయడంతో కన్న కొడుకులా పెంచిన వెంకటకృష్ణమ్మని కసితీరా చంపమని కరీంఖాన్ ఆజ్ఞాపించే పరిస్థితి వచ్చింది.!

వెంకటకృష్ణమ్మని చీకటి కొట్లో బంధించారు. చావు తప్పదనుకుంటున్న స్థితిలో అతని భార్య కరీంఖాన్ రాజుల్లో ఒకరిని ఆశ్రయించి, వేడుకొని, ఆమె ద్వారా భర్తని విడిపింప చేసుకుంది.

బయట కొచ్చిన వెంకటకృష్ణమ్మ నేరుగా హైదరాబాద్ చేరాడు. అప్పుడు కరోడ్గిరీకి రానున్న సంవత్సరాల కోసం వేలంపాట పెడ్తున్నారు. తన పూర్వ పరిచయాల్ని, పలుకుబడిని వినియోగించి, ఆ వేలంపాట తన పరం అయ్యేలా చేసుకోగలిగాడు వెంకటకృష్ణమ్మ!

ఆ తర్వాత వెంకటకృష్ణమ్మకి ఎదురు లేకుండా పోయింది. అత్యంత సమర్ధవంతంగా పనిచేసి, నిజాం ప్రాపకం కూడా సంపాదించగలిగాడు. మంత్రులతో పరిచయాలు పెంచుకున్నాడు. దివాన్ గారి ఆశీస్సులు సాధించుకున్నాడు.

నిజాం ప్రభువు ఆ సమయంలో టిప్పు సుల్తాన్ తోనూ, మరాఠా యోధులతోనూ ఒకేసారి యుద్ధం చేసే స్థితిలో ఉక్కిరి బిక్కిరిగా వున్నాడు. పరిపాలనా వ్యవహారాలు చూడటానికి మరో సమర్ధుడైన వ్యక్తి అవసరం ఏర్పడింది. కరోడ్గిరి చేస్తున్న వెంకటకృష్ణమ్మ ఆయన మనసులో మెదిలాడు. అతని పేరు ప్రస్తావించగానే, దివాన్ గారూ, ఇతర మంత్రులూ వెంకటకృష్ణమ్మని సమర్ధించారు. నిజాం ప్రభువు స్వయంగా అత్తరు రాసి, తాంబూలం ఇచ్చి నైజాం రాజ్యానికి తాత్కాలిక దివాన్‌గా వెంకటకృష్ణమ్మని నియమిస్తున్నట్లు ప్రకటించాడు.!

హైదరాబాద్ రాజ్యానికి దివాన్‌గా వెంకటకృష్ణమ్మ సమర్ధవంతమైన పాలన అందించి, రాజా వెంకట కృష్ణ వంతు బహద్దరుగా ప్రసిద్ధుడయ్యాడు. మంచి పాలకుడని పేరు తెచ్చుకొన్నాడు.

వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు కొత్తగా చింతపల్లి జమిందారుగా వచ్చిన కాలం అది! ఆ రోజుల్లో సరిబస్తా కవుళ్ళు అనే పద్ధతి వుండేది. ఒక నిర్ణీత సంఖ్యలో సరిబస్తా కవుళ్ళున్న వారికే 'రాజా' అనే బిరుదు ఇచ్చేవారు బ్రిటిష్‌పాలకులు.

వెంకటాద్రినాయుడు ఈ వెంకటకృష్ణమ్మ బహద్దరు సహాయంతో కొన్ని సరిబస్తాకవుళ్ళు సంపాదించుకొని రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు అయినట్లు, ప్రముఖ స్వాతంత్ర యోధుడు మాదిరాజు రామకోటేశ్వర రావు తన స్వీయచరిత్రలో పేర్కొన్నాడు.

హైదరాబాద్ రాజ్య ప్రధానిగా వున్నప్పుడే వెంకట కృష్ణ వంతు బహద్దుర్ దివాన్ తమకోసం పరిటాలలో ఒక పెద్దకోటని నిర్మించాడు. తెలంగాణా "గడీ" ల ఆకారంలో వుంటుంది ఈ కోట. కానీ, అందులో గృహప్రవేశం చేయకమునుపే 1739లో ఆయన అకాలమృత్యువాత పడ్డాడు.

నైజాం ప్రభువు తన సంతాపం తెలియజేసేందుకు కృష్ణవంతుబహద్దర్ గారి కొడుకు తిరుమలరావుని తన దేవిడీకి పిలిపించి, సంతాపం తెలిపి, సాంప్రదాయం ప్రకారం ఏం కావాలో కోరుకోమన్నాడట.

తిరుమలరావు 'తమదయ' అని వుంటే, మాదిరాజు కుటుంబీకులు కృష్ణాజిల్లాలో కోటీశ్వరుల్లో ఒకరుగా వుండి వుండేవారెమో... కానీ, తిరుమలరావు అతి తెలివికి పోయి, మా నాన్న సంపాదించిన కోట్లాది ధనం మా బాబాయిలు తినేస్తున్నారు. దాన్ని నాకే ఇప్పించండీ-" అని అడిగాడట.

ఈ తిరుమలరావుని ఒక పనికి మాలిన వెధవగా భావించాడట నిజాం. వెంటనే సైనికుల్ని పిలిచి, జుజ్జూరులోని వెంకటకృష్ణవంతు బహద్దూర్ సంపదనంతా దోచుకురమ్మని ఆదేశించిండాడట.

ఏనుగుల మీద, ఒంటెల మీద ఎత్తించుకొని హైదరాబాద్‌కు కృష్ణవంతుగారి సంపాదనంతా తన ఖజానాకు తరలించేశారు.

మాదిరాజు కుటుంబీకులు మళ్ళీ పొట్టచేత్తో పట్టుకొని వీధినపడ్డారు. మిద్దెలు మేడలు అన్నీ పోయాయి. పరిటాలలో కోట శిధిలం అయిపోయింది.

బ్రిటిష్ వారు 1846లో బెజవాడ జమిందారీని మూడువేల రూపాయిలను వేలం పాటలో కొట్టేసినప్పుడు, ఈ జుజ్జూరు కూడా బ్రిటిష్‌వారి జేబులోకి చేరిపోయింది.

అలా మునిగిపోయింది జజ్జూరు ఒకనాటి వైభవం. ఇప్పుడది ఒక కుగ్రామం.... అంతే!!

# రేపల్లె

"…..అమరె మూర్తుజాన్నగర సింహాసనమున
చామరచ్ఛత్ర వేణు నిస్సాజ వణవ
ముఖనిఖిల రాజ చిహ్నముల్ మ్రోలదనర!
ప్రధన జయశాలి మానిక రాయమౌళి"

కొండవీటి పరగణాలో హుజూరు నాయకుడు, జిల్లాదారు హోదాలో మానిక రాయుడిగా కీర్తించబడిన మాణిక్యరావు దేశముఖ్ గురించిన విశేషాలు ఈ పద్యంలో వున్నాయి.

కొండవీటి సీమని మూర్తుజానగర్ అనీ, కొండపల్లిసీమని ముస్తఫానగర్ అనీ అనే అనేవాళ్ళు.

ఈ మాణిక్యరావు పద్మనాయిక సామాజిక వర్గానికి చెందినవాడు. ఇతని ఇంటిపేరు కృష్ణానేని. వీళ్ళు తెలంగాణా నుంచి ఈ కృష్ణాతీరానికి వచ్చారనీ మాణిక్య ప్రభు అనే యోగేంద్రుడి పేరుతో ఈ మాణిక్యరావు నామం ఏర్పడిందనీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు రాశారు.

కుతుబ్‌షాహీ గోల్కొండ నవాబుకు ఈ మాణిక్యరావు కుడిభుజం. కొండవీడు, కోవెలకొండ పెదకొండపల్లి దుర్గాలు శత్రువుల బారిన పడకుండా కాపాడినందుకు కుతుబ్‌షాహి ఈయనకు మాణిక్యరాయ బిరుదునామం ఇచ్చాడనీ ధనుర్విద్యావిలాసం కావ్యం అవతారికలో ఉంది. మూర్తుజాన్నగర సామ్రాజ్యంపు మన్నెర్కమున్ రాజా మానిక రావటంచు నభిదానంబిచ్చినన్…" అని వివరిస్తుందీ గ్రంథం.

కొండవీటి సీమని అంటే, ఇంచుమించుగా గుంటూరుజిల్లా మొత్తాన్ని ఇతను కొంతకాలం పాలించాడు. ఆయన అనంతరం ఆయన వంశీకులు ఈ వంశకర్త పేరుతో మాణిక్యరావు వంశంగా ప్రసిద్ధి చెందారు. "కుతుపశా పాచ్చా హితా పాదుకై అంటూ కుతుబ్‌షా పాద్షాకు విధేయులై వర్ధిల్లారని అంటారు.

క్రీస్తుశకం, 1690లో గుంటూరు జిల్లా పాలన విషయంలో తమకూ నియామక పత్రాలున్నాయంటూ అమరావతి జమీందార్లు వాసిరెడ్డి వారూ, సత్తెనపల్లి జమీందార్లు మానూరువారూ వివాదాలు పడినప్పుడు ఆర్కాటునవాబు కొండవీడుని మానూరి వారికీ- రేపల్లె, రాచూరు ప్రాంతాల్ని తెనాలి, పొన్నూరు దాకా మాణిక్యరావు వంశీకులకీ, మిగిలింది వాసిరెడ్డి వారికీ ముగ్గురి మధ్యా సమంగా విభజించి పంచాడు.

మాణిక్య రాయుడి తర్వాత కొండలరాయుడు, తిరుమల ప్రభు, అప్పప్రభు..ఇలా వరుసగా రేపల్లెకు అధికారంలోకి వచ్చారు. 1705లో అప్పప్రభు ఔరంగజేబుని మెప్పించి చాలా ధనం సంపాదించగలిగాడు. అప్పుడే రేపల్లెలో పెద్దకోటని కట్టించాడు కూడా! 1737లో మాణిక్యరావు సీతన్నరావు అధికారంలోకి వచ్చాడు. 1778 వరకూ ఆయన నిరాఘాటంగా పాలించాడు. ఇంతవరకూ మాణిక్యరావు గారి కుటుంబానికి పట్టింది బంగారంగానే సాగింది.

ఈ సీతన్నగారి కొడుకులు వారసత్వం కోసం వ్యాజ్యాలు నడుపుకోవడం ప్రారంభించి, చివరికి జమీని రేపల్లె, రాచూర్లుగా రెండుగా విడగొట్టుకున్నారు. అక్కణ్ణించి ఈ వంశీకులకి కష్టాలు ప్రారంభమైనాయి.

క్రీ.శ.1770లో మూర్తుజానగర్‌ని అంటే గుంటూరు జిల్లాని ఫ్రెంచివాళ్ళు ధారాదత్తం చేశారు హైదరాబాదు నవాబులు. మాణిక్యరావు వంశీకులకు కష్టాలు మరింత అయ్యాయి. ఏడేళ్ళ తర్వాత 30-11-1778లో ఫ్రెంచి వాళ్ళని వెళ్ళగొట్టి తిరిగి బ్రిటిష్ వారికి అప్పగించారు. ఆ తర్వాత కష్టాలు ఇబ్బడిముబ్బడి అయ్యాయి.

ఈలోగా రాచూరును విడగొట్టిన తిరుపతిరాయుడు మరణించాడు. వారసులు లేని కారణంగా రాచూరుని రేపల్లెలో తిరిగి కలిపారు గానీ, దాన్ని నిలబెట్టుకోగలిగే స్తోమత రేపల్లె జమీందార్లకు లేకుండా పోయింది.

పొన్నూరుతో సహా 22 గ్రామాల్ని రాజావాసిరెడ్డి వెంకటాద్రినాయుడు, అలాగే రాచూరు జమీందారీ మొత్తాన్ని నరసరావుపేట జమీందారు మల్రాజు పెదగుండారాయుడు కొనుక్కొన్నారు. కొండవీడుని ఈ రేపల్లె జమీందార్లు కొనుక్కున్నట్లు ఈస్టిండియా కంపెనీ రికార్డుల్లో వుంది. ఇంక రేపల్లె ఒక్కటే ఈ కుటుంబీకులకి మిగిలింది!

1846 నాటికి అప్పుల ఊబిలో కూరుకుపోయి శిస్తు బకాయిలు తీర్చలేకపోవడంతో రేపల్లె జమీందారీని వేలంపాటలో బ్రిటిష్ వారు కొనుకున్నట్లు ప్రకటించారు. ఒకనాడు గుంటూరు జిల్లా మొత్తాన్నీ పాలించిన రేపల్లె జమీందార్ల కథ అలా ముగిసింది.

నిజానికి, 16-17 శతాబ్దాల కాలంలో వాణిజ్యకేంద్రంగా రేపల్లె ప్రభావం గొప్పగా వుండేది. ఇప్పుడు నిజాం పట్నంగా పిలువబడ్తున్న ఓడరేవుని ఆ రోజుల్లో పోర్చుగీసులు "పెట్టిపోలి" అని పిలిచారు. క్రీ.శ.1679లో స్ట్రేన్‌ష్యమ్ మాస్టర్ అనే బ్రిటిష్ అధికారి ఈ పెట్టిపోలి ఓడరేవులో తన అనుభవాల్ని రికార్డు చేశాడు. కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్‌లో ఆ వివరాలున్నాయి.

1621లో బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ ఒక ఫ్యాక్టరీని- అంటే, వాణిజ్య కేంద్రాన్ని ఇక్కడ తెరిచింది. 1750లో ఫ్రెంచ్ వారికి, 1778లో తిరిగి బ్రిటిష్ వారికి రేపల్లె తాలూకు ధారాదత్తం అయ్యింది. 1780లో టిప్పుసుల్తాన్ తండ్రి హైదరాలీ రేపల్లెని కొల్లగొట్టాడు. వూరువూరంతా దోపిడీకి గురయ్యింది. చాలాకాలానికి గానీ జనం కోలుకోలేకపోయారు.

ఆ తర్వాత నిజాంపట్నం ఓడరేవుని అభివృద్ధి చేయడం ప్రారంభించారు. దాంతో రేపల్లెకు పురాతన వైభవం ప్రాప్తించింది. ఒక కష్టమ్స్ ఆఫీస్‌ని తెరిచి ఓడరేవులో సుంకం వసూలు చేయడం ప్రారంభించారు. దేశదేశాల వాణిజ్యవేత్తలు బ్రిటిష్ అధికారుల రాకతో రేపల్లె తిరిగి కళకళలాడసాగింది.

18వ శతాబ్ది మొదలయ్యేసరికి ప్రకృతి వైపరీత్యాలు ఏర్పడ్డాయి. నిజాంపట్నం ఓడరేవులో సముద్రం మెరక వేసి లోతు తగ్గి పోయి ఓడలు రావడం కష్టం అయ్యింది. ఓడలు రాకపోవడంతో క్రమేణా నిజాంపట్నం ఓడరేవు మూసివేతకు గురయ్యింది.

1859లో రేపల్లెని ఒక తాలూకా చేసి కృష్ణాజిల్లాలో చేర్చారు. 1904లో కృష్ణాజిల్లాని విడగొట్టినప్పుడు గుంటూరు జిల్లా తెనాలి తాలూకాలో రేపల్లెని కలిపేశారు. 1909లో తెనాలి తాలూకాని మళ్ళీ విడగొట్టి రేపల్లె తాలూకాని పునరుద్ధరించారు.

1915 లో రేపల్లెకు రైలొచ్చింది. జిల్లా బోర్డు ఈ రైలుని నడిపేది. తర్వాత ఇండియన్ రైల్వేస్‌కు అప్పగించారు. భట్టిప్రోలు, రేపల్లె, పేటేరు గ్రామాల్లో నేసిన చేనేత చీరలకు ఈ నాటికీ మంచి గిరాకీ వుంది. సాంస్కృతికంగా కూడా రేపల్లె సంస్థానం ఆ రోజుల్లో వాసికెక్కిందనే చెప్పాలి.

మాణిక్యరావు వంశీకుల్లో రాచూరు జమీందారుగా ప్రసిద్ధుడైన తిరుపతి రాయుడు మంచి ధనుర్విద్యా పారంగతుడట! ఈయన జాఫర్ అనే శరాసన గురువు దగ్గర విలువిద్య నేర్చుకుని, అకలంకం కృష్ణకవికి ఆ విద్యారహస్యాలు చెప్పి, ఆయన చేత ధనుర్విద్యా విలాసం అనే పేరుతో ఒక శాస్త్ర గ్రంధాన్ని రాయించాడు. ఇది పద్య కావ్యరూపంలో వుంటుంది. ఇందులోనే మాణిక్యరావు వంశీకుల వివరాలున్నాయి.

ఉరుటూరి వేంకట కృష్ణ కవిని ప్రేరేపించి ఈ తిరుపతి రాయుడు గారే ఆకాశరావణ సంహారం కావ్యం కూడా రాయించి నట్లుంది.

రేపల్లె దగ్గర ఉల్లిపాలెంలోనూ, రాచూరులోనూ మాణిక్యరావు వంశీకులు కట్టించిన కోటల శిధిలావస్థలో వున్నాయి.

బటావియా నుంచి బెంగాల్ వెడ్తున్న డచ్‌వారి ఓడ 1769లో నిజాంపట్నం ఓడరేవులో లంగర్ వేసినప్పుడు, జరిగిన దోపిడీ గురించి మచిలీపట్నం రికార్డుల్లో వున్నట్లు గోర్డాన్ మెకంజీ కృష్ణాడిస్ట్రిక్ట్ మాన్యువల్‌లో రాశాడు. అప్పట్లో అది పెద్ద దోపిడీగానే భావించ బడింది!

1538లో విజయనగర ప్రభువు అచ్యుతదేవరాయలు రేపల్లెకు దగ్గరగా వున్న "ఓలేరు" గ్రామంలో మదనగోపాలస్వామి దేవాలయంలో వేయించిన శాసనం ఒకటి దొరికింది.

కృష్ణాడిస్ట్రిక్ట్ మాన్యువల్‌లో 16వ శతాబ్దిలో ఈ ఓలేరులో జరిగిన ఒక సంఘటన ప్రస్తావన కన్పిస్తుంది. ఓలేరు గ్రామస్థులంతా ఒక్కుమ్మడిగా క్రైస్తవ మతం స్వీకరించారట! ఆ సంఘటనకు గుర్తుగా అక్కడ పెద్ద చర్చిని నిర్మించారట! 1864 తుఫాను వరకూ ఈ చర్చి భద్రంగా వుందని మెకంజీ రాశాడు. 1787లో దుర్భర కరువు పరిస్థితి ఏర్పడినప్పుడు "ఫాదర్ మానెంటీ" ఈ గ్రామంలోని ఓ యాభై కుటుంబాల వారిని తన పలుకుబడి మీద చెంగల్పట్టు జిల్లాకు తరలించాడట! అక్కడ తెలుగు క్రిష్టియన్ కాలనీని కట్టుకుని సుఖంగా జీవించారట ఈ ప్రజలు.

చెంగల్పట్టు, తంజావూరు, రామనాధపురం ప్రాంతాలకు కృష్ణా గుంటూరు జిల్లాల నుంచి తెలుగువారు గుంపులుగా తరలి వెళ్ళిన ఇలాంటి సంఘటనలు చాలా కన్పిస్తాయి. క్రైస్తవ మతం అందుకు దోహద పడింది కూడా!

చరిత్ర పుటలు తవ్వితే రేపల్లె గురించి అనేక విశేషాలు బయట పడతాయి!!

# ముక్త్యాల

ముక్తికి ఆలవాలమైన పవిత్రక్షేత్రంగా, ముక్తినేలగా కృష్ణాతీరానికి వన్నె తెచ్చింది ముక్త్యాల. ముక్త్యాల సంస్థానం మౌలికంగా సాహితీ పోషణ చేసి ఖ్యాతి గడిచింది.

నిజానికి ముక్త్యాల సంస్థానం అత్యంత చిన్న సంస్థానమే గానీ, సంస్కారంలో పెద్దది! పెద్దమనసుతో, విశాలహృదయంతో ఈ సంస్థాన పాలకులు సమర్ధవంతమైన పాలన అందించారు. మౌలికంగా సాహితీ పోషకులు సౌమ్యులు. వివాదాలకు దూరంగా వుండే స్వభావం కారణంగా ఆటుపోట్లు ఎదురైనా సంస్థానం- అభివృద్ధి కావడానికి అవకాశాలు ఏర్పడ్డాయి.

ముక్త్యాల సంస్థానంలో 23 గ్రామాలున్నాయి. పంటపొలాల్లోకి కాలువలు తవ్వించి, నదీజలాల్ని మళ్ళించి ఈ గ్రామాల రైతులు మరింత ఉత్పత్తికి ప్రయత్నించారు. అభ్యుదయ మార్గాన ఈ రైతుల్ని నడిపించడంలో వాసిరెడ్డి వంశీకులైన భవానీ ముక్తేశ్వర ప్రసాద్ జమీందార్ ప్రముఖంగా చెప్పుకోదగిన వ్యక్తి.

కృష్ణానది మహారాష్ట్ర నుంచి పలనాడు తాలూకా గని కొండ పర్వత శ్రేణుల దాకా వచ్చిన తర్వాత, ఈ పర్వత శ్రేణులు నదిని ఉత్తర దిశగా మళ్ళించాయి. అలా ఉత్తరానికి పులిచింతల పర్వత శ్రేణిదాక ప్రవహించి ముక్త్యాల సమీపంలో మెలిక తిరిగి, దక్షిణ దిశగా మళ్ళి సముద్రం వైపు తూర్పుకు నడిచింది.

నిజానికి పలనాటి గనికొండ నుంచి సముద్రం కేవలం 80మైళ్ళ దూరంలోనే వుంది. పులిచింతల వైపుకు తిరిగి బెజవాడ మీదుగా రావడం వలన నది 200 మైళ్ళ దూరం అదనంగా ప్రవహించింది. ముక్త్యాల లేకపోతే, కృష్ణానది ఈనాటి కృష్ణా జిల్లాకి దక్కి వుండేది కాదేమో!

బెజవాడ దగ్గర ఆనకట్ట కట్టేప్పుడు 1850లో మొదట పులిచింతల దగ్గరే కట్టాలనే విషయాన్ని తీవ్రంగా పరిశీలించారు బ్రిటిష్ ఇంజనీర్లు. రాజా వాసిరెడ్డి భవానీ ముక్తేశ్వర ప్రసాద్, ముక్త్యాల జమీందారు ఇందుకు సహకరించేందుకు ముందుకు వచ్చారట కూడా! కానీ, ఆనకట్ట కట్టిన తర్వాత పులిచింతల నుంచి అవనిగడ్డ అవతలి దాకా కాలువ ద్వారా నీటిని మళ్ళించడం ఎక్కువ ఖర్చుతో కూడుకున్నదని అప్పట్లో ఆ ప్రతిపాదనని విరమించుకున్నాడు.

అమరావతి పట్టణాన్ని నిర్మించిన రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు గారి తాతగార్లు ముగ్గురు అన్నదమ్ములు. పెద్దాయన రాఘవయ్య. రెండో తమ్ముడు రామన్నగారి కుదురుకు చెందిన వాడు రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు. మూడోతమ్ముడు చంద్రమౌళి గారి కుటుంబీకులు ముక్త్యాల సంస్థానం పాలకులు.

ఇలా మొదలయ్యింది ముక్త్యాల సంస్థానాధీశుల కథ.

ఈ ముగ్గురన్నదమ్ముల్ని నందిగామ పరగణాకి అధిపతులుగా ఢిల్లీ పాదుషా షాజహాను నియమించాడని అంటారు. జమీందారు, మిరాసి మన్నె, చౌదరి, రాజా బహద్దూరు దేశాయి, సర్దేశముఖి.... ఇలాంటి బిరుదులు షాజహాన్ని మెప్పించి ఈ ముగ్గురు పొందారని వీరి చరిత్ర చెప్తోంది.

చివరికి ఈ ముగ్గురు అన్నదమ్ములు తమ ఆస్తిని వంతులు వేసుకోగా, చింతలపాడు జమీందారీ మూడో తమ్ముడు చంద్రమౌళికి దక్కింది. అందుకని వీళ్ళని "చింతలపాడు వంతు జమీందారీ" అని కూడా పిలిచేవారు. ఈ చింతలపాడు సంస్థానంలోనే ముక్త్యాల వుంది. రాజా వాసిరెడ్డి రామలింగన్న 1760లో ముక్త్యాల కోటని నిర్మించి ముక్త్యాలను తమ రాజధానిగా ప్రకటించుకున్నాడు. ఈ రామలింగన్నగారు, ఆయన తండ్రి రాజమౌళి గారు మొదటగా కాలువలు తవ్వి పంట పొలాలకు నదీ జలాలను మళ్ళింపచేసిన ఘనులు.

1792లో మేజర్ బీట్సన్ ముక్త్యాల జమీందార్లు చేసిన ప్రయోగాన్ని ఆదర్శంగా తీసుకొని, పంటలు బాగా పండించేలా రైతులకు చేయూతనిస్తే తప్ప ప్రభుత్వ మనుగడ సాధ్యం కాదని కంపెనీ పాలకులకు ఉత్తరం రాశాడు.

నది, నిండుగా ప్రవహిస్తున్నా కృష్ణాతీరాల వైపు పంట భూములు ఎండిపోయి ప్రజలు వరుస కరువులకు గురి కావడంతో నీటి పారుదల సౌకర్యాల కల్పన గురించి తీవ్రంగా ఆలోచించవలసి వచ్చింది బ్రిటిష్ అధికారులకి!

ముక్త్యాల రాజావారి ముందు చూపు ఆ సంస్థానంలోని ప్రజల్ని కొంతవరకూ కరువు బారిన పడకుండా కాపాడగల్గిందనే చెప్పాలి!

సరే, మళ్ళీ మనం రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడుగారి దగ్గరకు వద్దాం.

1778లో వెంకటాద్రినాయుడు అమరావతి జమీందారుగా వచ్చాడు. ఆయన వస్తూనే, వాసిరెడ్డి కుటుంబీకుల మధ్య వార సత్వపు పోరులేకుండా చెయ్యాలని కంకణం కట్టుకున్నాడు. అందుకు ఆయన ఎంచుకున్న మార్గం, దాయాదుల్ని సమూలంగా నిర్మూలించడమే!

ఆ క్రమంలోనే, వెంకటాద్రిగారు మొదట తన పెత్తండ్రీ, పిన్న తండ్రి గార్ల పిల్లల్ని ఖైదు చేయించాడు. రాత్రికి రాత్రి కృష్ణానదిని దాటి ముక్త్యాల మీద విరుచుకు పడి, ముక్త్యాల కోటలో, వున్న జమీందారీ కుటుంబాన్ని పట్టి బంధించాడు. ఆయన దూకుడు కొంచెం అణిగే దాకా సహనం వహించి, ఆ తర్వాత ముక్త్యాల జమీందారీని ఆయన చెఱనుంచి విడిపింపచేసింది కంపెనీ ప్రభుత్వం. కానీ, ఇక్కడో పొరబాటు జరిగింది.

వెంకటాద్రినాయుడు, ముక్త్యాల సంస్థానాన్ని ఆక్రమించినప్పుడు, ఆ సంస్థానం వెంకటాద్రిగారి పేరుతో బ్రిటిష్‌వారి రికార్డులో నమోదయ్యింది. కానీ, చెఱ విడిపించిన తర్వాత ఈ రికార్డును మార్పించలేదు. ఆ విషయాన్ని అప్పట్లో ఎవరూ పట్టించుకోలేదు కూడా!

ఈలోగా, వెంకటాద్రి నాయుడుగారు మరణించడం ఆయన వారసులు బలహీనులు కావడం, దావా పేరుతో ఆస్తుల్ని కరిగించుకోవడం జరిగిపోయాయి. చివరికి ఈస్టిండియా కంపెనీ పాలకులు వెంకటాద్రినాయుడు గారి పేరుతో వున్న జమీందారీలు అన్నింటినీ రద్దుచేసేశారు. ఆ వరుస క్రమంలో ముక్త్యాలకూడా రద్దయిపోయింది. ఇది 1848లో జరిగిన సంఘటన.

తర్వాత 15 సంవత్సరాలపాటు రాజా వాసిరెడ్డి భవానీ ముక్తేశ్వర ప్రసాద్ బహద్దూరు ఎన్నో విజ్ఞాపనలు, విన్నపాలు చేసి, లండన్ స్థాయిలో కౌన్సిల్ సభ్యుల్ని కలిసి, వాళ్ళకి అసలు సంగతి వివరించిన తర్వాత 1863లో తిరిగి ముక్త్యాల జమీందారిని ప్రతిష్టింపచేశారు.

ఈ వంశీకుల్లో 1824 నుండీ సంస్థాన పాలనా బాధ్యతలు స్వీకరించిన భవానీ ముక్తేశ్వర ప్రసాద్ గారు, ఆయన తర్వాత ఉమామహేశ్వర ప్రసాద్, వారి తర్వాత దత్తపుత్రుడు చంద్రమౌళీశ్వర ప్రసాద్ అధికారంలోకి వచ్చారు. ఈయన తమ్ముడు దుర్గాసదాశివేశ్వర ప్రసాద్ జయంతిపురం రాజాగా ప్రసిద్ధులు. స్వాతంత్ర యోధులు. కళాపోషకులు.

ఈ చంద్రమౌళీశ్వర ప్రసాద్‌గారికి చల్లపల్లి జమీందారు రాజా యార్లగడ్డ మల్లికార్జున ప్రసాదనాయుడు బహద్దరుగారి అమ్మాయి వెంకట దుర్గమాంబనిచ్చారు. ఆమెకు సంతానం కలిగే అవకాశం లేదని తెలిసి, శాకమూరి వారి అమ్మాయిని రెండో పెళ్ళిచేసుకున్నాడు.

దత్తత తీసుకున్న పుత్రుడికి రాజ్యాధికారం లేదనే చట్టం రావడంతో జమీందారీల న్నింటిలోనూ ఈ రెండో వివాహాలు శాస్త్రోక్తంగానే జరిగాయి అప్పట్లో. ఈ రెండో భార్య ద్వారా కల్గిన రామగోపాలకృష్ణ మహేశ్వర ప్రసాద్‌కి మళ్ళీ చల్లపల్లి రాజా అంకినీడు ప్రసాద్ బహద్దరుగారి అమ్మాయి రాజ్యలక్ష్మినిచ్చి పెళ్ళిచేశారు. ఈమె శాసన సభ్యురాలిగా కూడా చేశారు. నాగార్జున సాగర్ ప్రాజెక్ట్ రావడానికి ఈ రాజదంపతుల కృషి ఎనలేనిది!

రాజ్యలక్ష్మీగారి కుమార్తె ఇందిర కెసిపి లిమిటెడ్ యాజమాన్యానికి చెందిన వెలగపూడి దత్తుగారిని వివాహమాడారు.

జమీందార్ల ప్రభావం తగ్గి, స్వాతంత్రోద్యమం వేగం పుంజుకున్నకాలంలో ముక్త్యాల జమీందార్లు పంచములు దేవాలయ ప్రవేశం, హరిజనోద్ధరణ వంటి కార్యక్రమాలకు చేయూతనిచ్చారు. అనేక మంది స్వాతంత్ర సమరయోధులకు, అజ్ఞాత యోధులకు రక్షణ నిచ్చి ఆదుకునేవారు.

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, పిశుపాటి చిదంబరశాస్త్రి, తిరుపతి వెంకటకవులతో మొదలు పెట్టి విశ్వనాథ సత్యనారాయణ గారి వరకు ఎందరో కవుల్ని వీరు పోషించారు.

"ముక్తి నేలయవని పాలుదు చంద్రమౌళి నృపతి వినిన లీలగానూ..." అంటూ రాజా చంద్రమౌళీశ్వర ప్రసాద్ ఒక శ్రోతగా వింటున్నప్పుడు తాను రామాయణ కల్పవృక్షం రాసినట్లు చెప్పుకున్నారు విశ్వనాధవారు.

అభినవ భోజుడనీ, అర్థిజన కల్ప భూజుడనీ చెళ్ళపిళ్ళవారు కూడా ఈ చంద్రమౌళీశ్వర ప్రసాద్‌గార్ని కీర్తించారు. వెళ్ళి అడిగేటంత ఓపికలేక చిన్నకాయితం ముక్కమీద రాసి పంపిస్తే చాలు దబ్బిచ్చి ఆదుకొనే కొందరు శ్రేయాభిలాషులున్నారు నాకు వారిలో...." ఘనుడల వాసిరెడ్డి కులకాంతుడు శ్రీ శశిమౌళి యొక్కడైనను నటు వ్రాసి పుచ్చుటకు నామది సిగ్గిలు..." అని చెళ్ళపిళ్ళవారు చంద్రమౌళీశ్వర ప్రసాద్ గారి వదాన్యతను ప్రస్తుతించారు.

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు తన కృష్ణ భారతాన్ని రాజా చంద్రమౌళీశ్వర బహద్దూరుగారికి అంకితం చేశారు. ఈ ఆంధ్రీకరణ సంధర్భంగా ముక్త్యాల ప్రభువులు శ్రీపాద వారికి నెలకు 116 రూపాయిల చొప్పున పన్నెండేళ్ళ పాటు పంపించారట! కృష్ణుడిగా, మిత్రుడిగా గురూత్తముడిగా, బంధువుగా రాజావారు ఆయన్ని గౌరవించేవారట!!

ముక్త్యాల రాజావారికి ఆయుర్వేద వైద్యం పట్ల మక్కువ ఎక్కువ. ఆర్షరసాయనశాలని నెలకొల్పి స్వయంగా ఆయుర్వేద ఔషధాలను తయారుచేయించి పంపిణీ చేశారు. మాహిష్మతీ ముద్రాక్షర శాలని నెలకొల్పి అనేక గ్రంథాలను వెలువరించారు.

వేటూరి శంకరశాస్త్రిగారు ఆయుర్వేద వైద్యాలుగా, అనేక గ్రంధాల పరిష్కర్తగా, పరిశోధకుడిగా ఈ సంస్థానంలో పండితుడిగా ఎంతో సారస్వత సేవచేశారు.

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ముక్త్యాల పరిసర ప్రాంతాలలో లభించిన ప్రాచీన శిధిల శిలాశిల్ప ఖండాల్ని, తదితర పురాతన విషయక సామాగ్రిని పోగుచేసి ఒక ప్రదర్శనశాల ఏర్పాటు చేయాలని తొలుత కొంత కృషి చేశారు. ఆ తర్వాత రాజావారి వునికితో, ప్రభాకర శాస్త్రిగారి తమ్ములు శ్రీ వేటూరి శంకరశాస్త్రి భోగాలపాటి దిబ్బని తవ్వించి అందులోని బౌద్ధ శిలా సంపద వెలికి తీయించారు.

కృష్ణాతీరంలో బౌద్ధక్షేత్రాల ఉనికిని ఆధునిక ప్రపంచానికి చాటిచెప్పడంలో వాసిరెడ్డి వంశీకుల పాత్ర గణనీయమైంది. అమరావతి, నాగార్జున కొండ, జగ్గయ్యపేట, నందిగామలో ఒకనాటి బౌద్ధమత వైభవాన్ని వీరు వెలుగులోకి తెచ్చి ధన్యత పొందారు.

# వినుకొండ

వినుకొండని శృతపర్వతం అని క్రీడాభిరామం రాసిన వల్లభరాయుడు పిలిచాడు. 'విను' అనేది వినడానికి సంబంధించిన పదంగా ఆయన భావించాడు. ఎవరు విన్నారు...? ఏం విన్నారు??

రెక్కలు విరిగి పడివున్న జటాయువు రాముడికి సీతాపహరణం వృత్తాంతం చెప్పినప్పుడు రాముడు విన్న కొండ ఇదేనని వినుకొండ వల్లభరాయుడి భావన. ఇప్పటికీ జనశృతి కూడా ఇదే!

వినుకొండ వల్లభరాయకవి క్రీడాభిరామం అనే కావ్యాన్ని రాశాడు. ఇది శ్రీనాథుడు రాసిందనీ, కాదు వల్లభరాయుడే రాసిందనీ పండితుల మధ్య అభిప్రాయ భేదాలున్నాయి. మానవల్లి రామకృష్ణకవి వల్లభరాయుడి కృతిగా దీన్ని ప్రకటించారు. విజయనగర సామ్రాజ్యాన్ని పాలిస్తున్న ప్రౌఢదేవరాయల కాలంవాడు ఈ వినుకొండ వల్లభరాయుడు- అంటే, 1423-1445 ప్రాంతం వాడన్నమాట! ఇతను వినుకొండ సంస్థానాధీశుడిగా వున్న కాలంలో ఈ కావ్య రచన జరిగింది. 1420 తర్వాతి కాలపు వాడిగా పరిశోధకులు నిర్ణయించారితన్ని. ఆ కాలం నాటి వరంగల్లు, పలనాడు, కృష్ణాజిల్లా శ్రీకాకుళం ప్రాంతాలలోని సమకాలీన ప్రజా జీవనం ఈ కావ్యంలో కన్పిస్తుంది.

విజయనగరం రాజులకు రాజప్రతినిధిగా ఈ వల్లభరాయుడు వినుకొండని పాలిస్తూ వుండి వుండవచ్చు. వినుకొండ కీర్తి చిరస్థాయిగా నిలిచేందుకు ఈ వల్లభరాయుడు ఆ విధంగా కారకుడయ్యాడు.

వినుకొండ పట్టణం కథ క్రీస్తుశకం తొలిశతాబ్దాల నుంచే చరిత్ర బద్ధమయ్యింది. విష్ణు కుండినుడు అనే పల్లవ వంశరాజు ఈ పట్టణాన్ని రాజధానిగా చేసుకొని పాలించాడనీ విష్ణుకుండిన రాజ్యమే వినుకొండ రాజ్యంగా మారిందనీ కొందరు పరిశోధకులంటారు. వినుకొండ రాజులే వేంగిని రాజధానిగా చేసుకుని తెలుగునేలను ఏలారనీ ఈ వినుకొండ రాజుల్నే సంస్కృతీకరించి విష్ణుకుండినులన్నారనీ ఇంకొందరి భావన. రెండు సిద్ధాంతాలూ బలమైనవే!

వినుకొండ కరణం గారు జబ్బు పడి మరణశయ్యపైన వున్నాడని తెలిసి, కొండపల్లికి కరణంగా వున్న "రాయన మంత్రి భాస్కరుడు" ప్రౌఢ దేవరాయల్ని మెప్పించి వినుకొండ కరణీకాన్ని పొందాడని అంటారు.

ఈ "రాయన భాస్కరుడు" శ్రీనాథుని సమకాలికుడు. లేదా చాలా ముందరికాలం వాడు. మహాదాతగా పేరొందినవాడు. "కలౌ రాయన భాస్కరః" అనే చాటూక్తికి

నోచుకున్నవాడు. అతని జీవితంలో 'లేదు' అనడమే లేదట! కానీ, అలాంటి 'భాస్కరుఁడు మున్నె దేవుని పాలి కరిగెఁ' అంటూ తనకు అవసాన కాలంలో సాయపడే వాడే లేదని బాధపడ్డాడు... శ్రీనాథ మహాకవి!

చాటు పద్యాలలో కన్పించే వ్యక్తులకు చరిత్రకాధారాలు దొరకడం కష్టమే అయినప్పటికీ, వినుకొండకి శాశ్వత కీర్తిని తెచ్చిన వారిలో రాయన భాస్కరుడు కూడా వున్నాడనేదే ఇక్కడి ముఖ్య విషయం!

విజయనగర సామ్రాజ్య పతనం తర్వాత ముత్తరాజయ్య అనే ఆయనకి గోల్కొండ సుల్తానులు కొండవీడు, వినుకొండ, బెల్లంకొండలతో పాటు కొండపల్లి సీమలపైన అధికారాన్ని ప్రసాదించారు. ఒకదశలో ఈ "ముత్తరాజయ్య" "దూస్రాపాదుషా" అనిపించుకున్నాడంటే, ఆనాటి ఆయన వైభవాన్ని వూహించవచ్చు! రాజుల చరిత్రలు ఇలానే వుంటాయి. ఆనాటి జన జీవనానికి సంబంధించిన కథలు మాత్రం తక్కువగా దొరుకుతాయి. ఈ ముత్తరాజయ్య శ్రీశైలం, త్రిపురాంతకం సహా అనేక పలనాటి దేవాలయాలకు గోపురాలు కట్టించాడు.

ఆయన తర్వాత వినుకొండ జమీందారీ చితికిపోతే, మల్రాజు నరసారావు అనే జమీందారు వినుకొండని కొనుగోలు చేశాడని రికార్డులు చెప్తున్నాయి. ఈ నరసారావు గారి పేరుతోనే నరసరావు పేట పట్టణాన్ని నిర్మించినట్లు పరిశోధకులు చెప్తారు.

1803లో నరసారావు మరణం తర్వాత కొడుకు వెంకట గుండూరావు జమీందారుగా వచ్చాడు. కొండవీడు, బెల్లంకొండ, వినుకొండ ప్రాంతాల్ని కలిపి వెలనాటి ప్రాంతం అంటారు. ఈ వెలనాడులో అత్యధిక భాగం వెంకట గుండూరావు ఆధీనంలో వుంది.

వినుకొండకి నైరుతిగా వున్న కొండల వెనక కమ్మల చెరువు, మూలపాడు, బిర్జుపల్లె, గన్నవరం, గిరకిపాడు ఇలా కొన్ని చెంచు గ్రామాలున్నాయి. బ్రిటీష్ వారు ఈ చెంచువారిని మొదటి నుంచీ దోపిడీ దొంగలుగా ముద్ర వేసి, సమకాలీన సమాజానికి దూరంగా వుంచడం చేశారు. పదిసార్లు దొంగ అంటే, ఎవడైనా దొంగే అయ్యే ప్రమాదం వుంది కదా. చెంచుల్ని అలా తయారుచేశారు బ్రిటీషర్లు.

ఈ చెంచులనాయకుడు "పాలెగార్ రామ్ నాయక్" చెంచుల దృష్టిలో గొప్ప హీరో! జమిాందారులపైన, బ్రిటిష్ వాళ్ళపైన తిరుగుబాటు చేసిన విప్లవ నాయకుడు. సహజంగానే ఈ అధికార వర్గం అతనిపైన దోపిడి దొంగగా ముద్ర వేశారు.

ఎలాగైనా సరే రామ్‌నాయక్‌ని అంతం చెయ్యాలని ఆనాటి గుంటూరు జిల్లా కలెక్టర్ డానియల్ క్రోఫర్డ్ వినుకొండ అమరావతి జమీందార్లని గట్టిగా ఆదేశించాడు.

1804లో, వినుకొండ జమీందారు రాజా మల్రాజు వెంకట గుండూరావు. అమరావతి జమీందారు రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు, గుంటూరు కలెక్టరు, క్రోఫర్డ్, మరికొంతమందీ కలిసి, రామ్‌నాయక్‌ని చర్చలకు ఆహ్వానించారు. రామ్‌నాయక్ వందమంది అనుచరులతో ఈ విందు దౌత్యానికి బయల్దేరాడు. వందమందిమి ఉన్నాం కదా... అనే ధైర్యంతో వెళ్ళాడు రామ్‌నాయక్.

జమీందార్లు ఒక్కొక్కరినీ పక్కకు తీసుకెళ్ళి మాట్లాడే వంకతో వంటరి వాళ్ళను చేసి నిలువునా నరికేసారు. అలా రామ్‌నాయక్‌తో సహా నూరుమందినీ చంపించి వంద "నరబలు"లిచ్చిన మాంత్రికుడిలా గర్వంగా నిలబడ్డాడు గుంటూరు కలెక్టర్.

ఈ నరమేధానికి సహకరించినందుకు వెంకటాద్రి నాయుడుకు కమ్మలచెరువు, గుండూరావుకి తక్కిన గ్రామాలూ దక్కాయిట!!

క్రీస్తుశకం 1145లో వినుకొండ కొండపైన విశ్వంభర దేవుడనే రాజు మొదటగా కోట కట్టాడనీ, ప్రోలయ వేమారెడ్డి ఈ కోటని బాగు చేయించాడనీ చెప్తారు. 1462లో వీరప్రతాప పురుషోత్తమ గజపతి ఇదే కొండపైన మరో కోటని కట్టించాడట. కొండ కింద నాగుల కోట అని ఇంకో పురాతనమైన కోట వుంది. 1605లో ముత్తరాజయ్య ఈ కోటని మరమ్మత్తు చేయించి అందులో వున్నాడని అంటారు. గుంటుపల్లి భాస్కరయ్య కట్టించిన కోట కూడా వినుకొండ శివార్లలో వుండేదని పరిశోధకుల భావన.

కాకతీయుల కాలం అంతరించి, ప్రోలయ వేమారెడ్డి స్వాతంత్ర్యం ప్రకటించుకోవడం, విజయనగర వైభవానికి రెడ్డిరాజులు తలవంచడం, కాలవైపరీత్యానికి విజయనగర మహా సామ్రాజ్యమే తలను వంచడంతో పలనాటి రాజుల వైభవాలు పూర్తిగా అంతరించాయి. అయినా, వినుకొండని రక్షించుకోవడానికి మాలిక్ ఇబ్రహీం సేనతో ముగ్గురు మహావీరులు హోరాహోరీ పోరాడారు.

కస్తూరి రంగయ్య, ముద్దు చిన్నయ్య, కందితిమ్మన్న ఈ ముగ్గురు సేనానుల నాయకత్వంలో 20 వేలమంది సైనికులు కొండవీటి పరిగణాన్ని రక్షించే ప్రయత్నం చేశారు.

హైదర్-ఉల్-ముల్క్‌ని వినుకొండ దాటనీకుండా చాలాకాలం వీళ్ళు ముగ్గురూ నిలువరించగలిగారు. దాంతో గోల్కొండ సుల్తాన్ కొంతమంది మొగల్ యోధుల్నీ, పర్షియన్ యోధుల్నీ ఇచ్చి, మీర్ షా మీర్ అనే అతి క్రూరుడైన సేనానిని నాయకుడిగా పంపవలసి వచ్చింది.

వినుకొండ పౌరుషానికి ఇలాంటి దాఖలాలు చాలా వున్నాయి.

ఢిల్లీలోని జుమ్మా మసీదు డిజైన్‌తో అల్లి రజఖాన్ అనే దళవాయి 1585లో ఇక్కడ పెద్ద మశీదు నిర్మించాడని పర్షియన్ భాషలో వ్రాసి వున్న ఒక శాసనం చెప్తోంది.

వినుకొండలో "నిమ్మలబావి" అనే మంచినీటి బావి గురించి అందమైన కథలున్నాయి. నిమ్మసాని అనే వేశ్య ఈ బావిని త్రవ్వించిందట! ఈ "సానులు" నలుగురు అక్కచెల్లెళ్ళు

దొండసాని దొండపాడు దగ్గర, కొప్పుసాని కొప్పుకొండ దగ్గర, సింగిసాని సింగరకొండ దగ్గరా తలా ఒక బావిని ప్రజల ఉపయోగార్థం తవ్వించారని జనశృతి.

నిమ్మసాని వినుకొండలో బావిని తవ్వించేప్పుడు పెద్ద చట్టు పడి, నీరు రాకపోతే, నిమ్మసాని ఆ చట్టుపైన కూర్చుని గంగాభవాని కోసం తపస్సు చేసిందని, అప్పుడు నీటి జల తగిలిందనీ అంటారు.

రాజావాసిరెడ్డి వెంకటాద్రినాయుడు గారికి జబ్బు చేసినప్పుడు, ఈ నిమ్మలబావి నుంచి నీటిని ప్రతిరోజూ అమరావతికి తెప్పించుకు తాగేవాడని చెప్తారు.

ఇదంతా అంతో ఇంతో చరిత్ర కందిన కథ.

కానీ, వినుకొండ ఈ కథలతో మొదలయిన వూరు కాదు. ఇది ఆదిమ మానవుడు సంచరించిన నేలగా నిరూపించే అనేక సాక్ష్యాలు ఇక్కడ దొరికాయి. వినుకొండ చుట్టూ వున్న కొండలూ లోయలూ అవతల పారే గుండ్లకమ్మ నది ఇవన్నీ తొలినాటి మానవుడు విహరించిన స్థలాలని 'బ్రూస్‌ఫూట్' అనే బ్రిటిష్ జియోలాజికల్ సర్వే అధికారి మొదటిసారిగా ప్రకటించాడు. ఇంకా విశేషంగా చెప్పాలంటే, ఫ్రాన్స్ ఉత్తరభాగంలో జీవించిన ఆదిమ మానవులు వినియోగించిన వస్తు సామ్రాగితో పోలినవి వినుకొండ పరిసరాలలో నివసించిన అలనాటి ఆదిమ ప్రజలూ వినియోగించినట్లు కూడా ఫూట్ దొర ప్రకటించాడు. 1883 నాటి కృష్ణాజిల్లా మాన్యువల్‌లో గోర్డాన్ మెకంజీ ఈ సంగతి రికార్డు చేశాడు.

వర్షాలు కురిపించడానికి మహాపర్వతాలు, వరదల నుంచి రక్షించడానికి కారడవులు ఉపయోగపడినట్లే, సమాజ రక్షణకు బలదారుఢ్యాలు కల్గిన ప్రజలు ఉపయోగపడతారు. అలా ఉపయోగపడిన చెంచుల్ని దొంగలుగా ముద్ర వేసి చెప్పుకింద నలిపినట్లు నలిపివేసిన తర్వాత 1516లో వినుకొండ మీద 'పిండారీ' మూక విరుచుకుపడి ఒక పగలు, ఒక రాత్రి వూళ్ళో వున్న ప్రతి ఇంటినీ నిలువునా దోచుకున్నారు. దొంగల్ని అదుపు చేయగల మొనగాడు ఒక్కడూ లేక, ప్రజలు వినుకొండ కొండ మీదకు ఎగబాకి ప్రాణాలు రక్షించుకున్నారట!

ఉప్పరపాలెం, పాకపాలెం, భారతపురం, దొండపాడు గ్రామాల్ని పూర్తిగా ధ్వంసం చేశారు పిండారీలు.

ఈ పిండారీలు ఆ రోజుల్లో రాజులకీ, జమీందార్లకీ, బ్రిటీష్ వాళ్ళకీ కిరాయి సైనికులుగా ఉపయోగపడిన జాతి! కిరాయికి యుద్ధాలు దొరకనప్పుడు ఇలా వూళ్ళ మీద పడి దోచుకునే వాళ్ళు. అడ్డుకునే ధైర్యం ప్రభుత్వాలకుండదు... ఎందుకంటే, వీళ్ళని పోషించేది ప్రభువులే కాబట్టి! పిండారీలు నేటి రాజకీయ గూండాలకు నకళ్ళు! గుంటూరుని, నరసరావు పేటనీ కూడా ఘోరంగా ఈ పిండారీలు దోచుకున్నట్లు మెకంజీ రికార్డు చేశాడు.

ఇలాంటి ఆటుపోట్లు అనేకం ఎదుర్కొంది వినుకొండ! అయినా, సామాజిక చైతన్యానికి, ఈనాటికీ వినుకొండ గనికొండే!!

# చేబ్రోలు

చేబ్రోలు బెజవాడతో సమానమైన ప్రాచీనమైన పట్టణమే! ప్రముఖమైన పట్టణం కూడా!

1957లో చేబ్రోలు గ్రామంలో భీమేశ్వరాలయానికి దక్షిణ భాగంలో తవ్వకాలు జరిపినప్పుడు బౌద్ధ మహాయుగం నాటి రెండు పూర్ణకుంభాలు దొరికాయి. ఈ పూర్ణకుంభాలు తెల్లపాలరాతి మీద లతలతో చెక్కినవి- ఇటుకలతో బిగించబడి వున్నాయి. ఈ యిటుక రాయి భట్టిప్రోలు గ్రామంలో కన్పించిన స్థూపానికి ఉపయోగించిన యిటుకల్ని పోలి వున్నాయని శాస్త్రవేత్తలు భావించారు.

క్రీస్తు పూర్వం రెండవ మూడవ శతాబ్దాల కాలంలోనే తెలుగు ప్రాంతాల్లో బౌద్ధం విస్తరించింది. అశోకుడు కళింగయుద్ధంతో యుద్ధకాండను ముగించి బౌద్ధ ప్రచారానికి పూనుకున్నప్పుడు తెలుగు బౌద్ధులు లెక్కకు మించిన సంఖ్యలో ఇక్కడ కన్పించారు. అశోకుడి పక్షాన మహాదేవుడనే బౌద్ధ భిక్షువు తెలుగు నేల మీదకు మొదటగా వచ్చింది. "పల్లవభోగ్గము" అనే ప్రాంతానికి. ఈ భిక్షువు రాకతో పల్లవభోగ్గంలో శిల్పకళతో అలరారిన బౌద్ధ మహాచైత్యాలు అనేకం వెలిశాయి.

పల్లవభోగం లేక పల్లవబొగ్గాన్ని పల్లవరాజులు పాలిస్తున్నారు. వారు శైవమత అనుయాయులు. ఆంధ్ర విష్ణువు ఎన్నో సంవత్సరాలు పోరాడి నిశుంభుడనే రాజుని జయించి, శ్రీశైలం, కాళేశ్వరం, భీమేశ్వరం ఎల్లలుగా త్రిలింగదేశాన్ని ఏర్పరచి, దీన్ని ప్రసిద్ధ శైవక్షేత్రంగా తీర్చిదిద్దిన కాలం నాటి విషయాలివి! అలా శైవం బౌద్ధం పోటాపోటీగా అభివృద్ధి చెందిన పల్లవబొగ్గం, పల్లవనాడుగానూ, పల్నాడుగానూ జన వ్యవహారంలో మారిందని చరిత్రకారుల భావన.

భట్టిప్రోలు, అమరావతితో పాటు చేబ్రోలు కూడా ఈ ప్రాంతంలో ఆనాటి చైత్య విహారాలు కల్గిన ఒక ప్రముఖ ప్రాంతంగా భావించడానికి ఇక్కడ దొరికిన తెల్ల పాలరాతి బౌద్ధ కలశాలు చెక్కడం ఒక సాక్ష్యం.

పూజలూ వ్రతాలూ పేరుతో శైవం జనబాహుళ్యంలో విస్తరిస్తుంటే- ధర్మము, సంఘమూ, సామాజిక బాధ్యతలు లక్ష్యంగా బౌద్ధం ప్రజల్ని ఆకట్టుకోవాలని ప్రయత్నించిన కాలం అది.

'చైత్యం' అనే మాట 'చితి'కి సంబంధించిన పదం. బుద్ధుని శరీరాన్ని దహనం చేశాక లభించిన ఎముకల్ని భూమిలో నిక్షిప్తం చేసి వాటిపైన కట్టిన స్థూపాన్ని చైత్యం అన్నారు. సాంచి స్థూపం ఇలాంటి స్థూపాలలో మొదటిదనీ, అమరావతి రెండవది కావచ్చునీ అంటారు.

బౌద్ధులు ఈ చైత్యాలకు దగ్గరగా గానీ, పర్వత సీమల్లో గుహలు నిర్మించుకొని గానీ నివసించారు. ధాతు చైత్యాల నిర్మాణం అయిపోయాక, బుద్ధుని శరీర ధాతువులు ఇంకా దొరకపోవడం వలన, స్మారక చైత్యాలు నిర్మించారు.

బుద్ధుడి ఎముకలు మొదలైన ధాతువులు లేకపోయినా 'కలశం' అనేది ఒక పవిత్రమైన అంశంగా మారింది. ధాతువు వుంటే అది ధాతు భరిణ. ధాతువు లేకపోతే పూర్ణకుంభం. చేబ్రోలులో శిల్పరూపంలో దొరికిన పూర్ణకుంభం బౌద్ధుల పవిత్ర కుంభమేననడానికి ఇవి తార్కాణాలు.

చారిత్రకంగా, "తామ్రపురి" అనే పేరుతో చేబ్రోలు వ్యవహరించబడింది చాలా సందర్భాల్లో. అనేక పురాతన ఆలయాలు, చౌడేశ్వర దేవాలయం, నాగేశ్వర దేవాలయం, భీమేశ్వర ఆలయం వంటివి ఎంతో చరిత్రని ఇముడ్చుకున్నాయి. వాటిని వెలికి తీస్తే తెలుగువారి ప్రాచీన వైభవానికి సాక్ష్యాలు లభించవచ్చు.

ఇప్పటికీ కొన్ని చలువరాతి దిబ్బలు బౌద్ధయుగపు విహారాల పునాదులు లభించే అవకాశాలు లేకపోలేదు.

ఇంక, కొన్ని చారిత్రక సంఘటనలు చేబ్రోలు కేంద్రంగా జరిగినవి పరిశీలిద్దాం.

చేబ్రోలుకూ బెజవాడకూ ముడిపెట్టిన బెజవాడ యుద్ధమల్లుడి శాసనం క్రీస్తుశకం 766-810 మధ్య రాజ్యం ఏలిన గుణగ విజయాదిత్యుడి తమ్ముడు యుద్ధమల్లుడికి సంబంధించింది. ఇది ఆనాటి చేబ్రోలు ప్రశస్తిని తెలియజేస్తుంది.

చేబ్రోలులో వున్న కుమారస్వామి విగ్రహాన్ని తెచ్చి బెజవాడలో ప్రతిష్ఠించినట్లు ఈ యుద్ధమల్లుడి శాసనాన్ని బట్టి చరిత్రకారులు భావిస్తున్నారు.

1185 సంవత్సరం కాకతి గణపతి దేవుడి పాలనాకాలం వరకూ, చేబ్రోలులో షణ్ముఖేశ్వరుడి గుడి వుండేదని ఒక శాసనాధారంగా తెలుస్తోంది. ఆ రోజుల్లో చేబ్రోలు కుమారస్వామిని ప్రసిద్ధ దైవంగా ప్రజలు కొలుస్తూ వుండి వుంటారు. ఆ దేవతామూర్తి అంశనే బెజవాడకు యుద్ధమల్లుడు తెచ్చి వుంటాడని నిడుదవోలు వెంకటరావు గారు తెనుగుకవుల చరిత్ర గ్రంథంలో వివరించారు.

మరో ప్రముఖుడు చేబ్రోలుకు వన్నె తెచ్చినవాడు జాయపసేనాని. ఈయన 1213లో తండ్రి పేర చోడేశ్వర లింగాన్ని ప్రతిష్ఠించాడు. దేవదాసీల నివాసం కోసం రెండస్థుల మేడలున్న ఇళ్ళని గుడికెదురుగా, ఇరువరసల్లోనూ నిర్మించాడు. దేవుడి అంగరంగ వైభోగం కోసం మెంతుకూరు అంటే, ఈనాటి మోదుకూరు గ్రామాన్ని దానం ఇచ్చాడు. అప్పటి చేబ్రోలు పేరు తామ్రపురి. ఈ ప్రాంతానికి కాకతి గణపతిదేవుడు జాయపసేనానిని పాలకుడిగా నియమించాడు. దాచనప్రగడ గణపయ్య జాయప సేనానికి సహాయకుడిగా వుండేవాడు. ఈ పల్నాటి ప్రాంతం నుంచి చాలామంది ఓరుగల్లులో ప్రభుత్వోద్యోగాలు

సంపాదించుకున్నారు. గణపతిదేవుడు వెలనాటిని జయించాక చాలామందితో బంధుత్వం కలుపుకున్నాడు కూడా!

1145 నాటిది, చేబ్రోలులో దొరికిన మరొక శాసనంలో "భీమయ్య పందు" అనే వీరుడి గురించి చెబుతూ, వంశమున దేశటి పండుడు పుట్టి షట్సహస్రానిని ఏలినట్లు రాశారు. ఈ వీరుడు ప్రశస్తకవి అన్ని కూడా ఈ శాసనం ద్వారా మనకు తెలుస్తుంది.

కృష్ణా డిస్ట్రిక్ట్ మేన్యువల్‌లో ఈ చేబ్రోలుని కుండలు చేసే వృత్తిలో వున్నవారికి ఈ నాముగా ఇవ్వబడిన ప్రాంతంగా రికార్డుల్లో వున్నట్లు గోర్డన్ మెకంజీ పేర్కొన్నాడు.

నిజానికి పల్లవులు, చోళుల కాలం నాటికే ప్రసిద్ధ పట్టణం కావడంతో భూగర్భంలో ఎక్కడో ఒక చోట నిధి నిక్షేపాలు దొరుకుతాయనే నమ్మకం ప్రజల్లో వుండి, ప్రాచీన స్థలాలన్నింటినీ తవ్వేశారు. అక్కడక్కడా అప్పుడప్పుడూ కొన్ని బంగారు నాణాలూ, వెండి నాణాలూ దొరకకపోలేదు. కానీ, వాటికోసం భూగర్భంలో వున్న అలాంటి తెలుగువారి చరిత్ర అంతా ధ్వంసం అయిపోయింది. అనేక దేవాలయాలు కాలగర్భంలో కలిసిపోయాయి.

అమరావతి జమీందారు రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు శిథిలమైన దేవాలయాల్ని చాలావరకూ పునర్నిర్మించాడు. చేబ్రోలుకి "చతుర్ముఖ పురం" అని పేరు పెట్టి అక్కడ తనకోసం ఒక నివాసాన్ని ఏర్పరచుకొని కొంత కాలం నివసించాడు కూడా!

కృష్ణానది ఒడ్డున 15 మైళ్ళ పొడవునా, రెండు మైళ్ళ వెడల్పున ఒండ్రుమట్టి మేట వేసుకున్న ప్రాంతంలో కొలకలూరు, తంగెళ్ళమూడి, చేబ్రోలు, ముట్లూరు గ్రామాలు వెలిశాయంటారు శాస్త్రవేత్తలు.

గోర్డాన్ మెకంజీ డిస్ట్రిక్ట్ మేన్యువల్‌లో ఈ విషయం రాస్తూ, ఇక్కడ భూగర్భంలో అసాధారణమైన ఇసుకరాళ్ళ గనులున్నాయనీ, ఇవి ఇతర ప్రాంతాలలో దొరికిన వాటికన్నా భిన్నంగానూ, ప్రత్యేకంగానూ, మృదువుగానూ వున్నాయని రాశాడు.

1780లోనే ఇక్కడ ఫ్రెంచి మిషనరీలకు సంబంధించిన క్రైస్తవ మతాన్ని చాలామంది స్వీకరించడం జరిగింది. రెడ్డిపాలెం, బ్రాహ్మణ కోడూరుల్లో ఫ్రెంచి క్రైస్తవులు ఎక్కువ మంది వుండేవారని కూడా మెకంజీ ఒక రికార్డులో తెలిపాడు.

తెలుగువారి ప్రాచీనతకు సజీవ సాక్ష్యంగా నిలిచిన చేబ్రోలుపైన పురావస్తుశాఖ వారు పరిశీలన చేయవలసింది చాలా వుంది!!

# వేంగి

యూనివర్శిటీ తరహా విద్యావిధానాన్ని కలిగిన ఒక గొప్ప విద్యాసంస్థ బౌద్ధ మహాయుగంలో ఏలూరు పక్కన పెదవేగి అనేక కుగ్రామంలో వుండేదని తెలిశాక చరిత్రకారుల దృష్టి ఈ వూరు మీదకు మళ్ళింది. ఏలూరుకు షుమారు 10 కి.మీ.ల దూరంలో ఈ పెదవేగి వుంది.

1878లో హెన్రీ మోరిస్ గోదావరి డిస్ట్రిక్ట్ మాన్యువల్‌లో ఈ వేంగి గురించి రాసినప్పుడు అదొక పురాతన శైవక్షేత్రంగా మాత్రమే చరిత్రకారులకు తెలుసు. ఒకప్పుడు తూర్పుచాళుక్యులు రాజధానిగా పాలించిన వేంగి రాజ్యం ఇదేనని కూడా కొంత తెలుసు. అయితే, పెదవేగిలో "భీమలింగం దిబ్బ" వుండేదని మోరిస్ రికార్డు చేశాడు. ఆ తర్వాతి కాలంలో జరిపిన తవ్వకాలలో ఈ దిబ్బ లోంచి బౌద్ధస్థూపం అవశేషాలు బయల్పడ్డాయి.

క్రీస్తు పూర్వం ఒకటవ శతాబ్ది నాటికి వేంగి విద్యాపీఠం అనేక అంతస్తుల హర్మ్యం అనీ, అద్భుతమైన శిల్పాలతో, స్తంభాలతో అలంకరించబడి, కళలూరేదనీ, నూరడుగుల ఎత్తయిన ఒక గొప్ప బౌద్ధ స్థూపానికి ఎదురుగా ఈ విద్యాపీఠం భవంతులు వుండేవనీ బౌద్ధ గ్రంథాల్లో వర్ణించిన విశేషాలు ఈ వేంగి విశ్వవిద్యాలయానికి సంబంధించినవేనని తర్వాత కాలంలో చరిత్రకారులు కనుక్కోగలిగారు. చైనా యాత్రికుడు హ్యూన్‌త్సాంగ్ 'పింగ్ చీ' అనే పేరుతో వర్ణించింది, ఈ వేంగి విద్యాపీఠాన్నేననీ, వేంగినీ, బెజవాడనీ, అమరావతినీ క్రీ.శ.7వ శతాబ్ది కాలంలో తాను సందర్శించినట్టు ఆయన స్వయంగా రాసుకున్న రికార్డుల ఆధారంగానే తెలుస్తోంది. "ఆం-టో-లో" అంటే "ఆంధ్ర" దేశానికి దక్షిణ కోసల నుంచి కృష్ణాతీరం వెంబడే బెజవాడకు చేరుకుని అటు వేంగికీ, ఇటు అమరావతికి వెళ్ళాడట.

పెదవేగికి ఆరేడు కి.మీ.ల దూరంలో చినవేగి అనే మరో గ్రామం వుంది. అది దాటిన తర్వాత దెందులూరు, గంగనగూడెం, సేనగూడెం ఇలాంటి గ్రామాలున్నాయి. ఇవన్నీ కలిసి ఈ ప్రాంతంలో ఒక మహానగరం వుండేదనీ అది ఆనాటి ఆంధ్రులకు రాజధాని నగరం అనీ పరిశోధకులు తేల్చగలిగారు.

వేంగి మహానగరం చరిత్రతో తొలినాటి తెలుగువారి చరిత్ర ముడిపడి నడిచింది. క్రీస్తుశకం 130లో ఆనాటి కృష్ణాతీరం విశేషాల్ని టోలెమీ అనే గ్రీకు యాత్రికుడు కొంత రికార్డు చేశాడు. అందులో సాలకేనోయ్ అనే రాజవంశీకుల ప్రస్తావన వుంది. 'సాలి' గోత్రీకులైన సాలంకాయన బ్రాహ్మణులు వేంగి రాజధానిగా క్రీ.శ.3వ శతాబ్దిలో కొంతకాలం పాటు తెలుగునేలను పాలించారు. దేవవర్మ, హస్తివర్మలు ఈ వంశీకుల్లో

ప్రముఖులు. అప్పటికే వేంగి శైవక్షేత్రంగానూ, బౌద్ధక్షేత్రంగానూ గొప్ప వాణిజ్య కేంద్రంగా కూడా ప్రసిద్ధిచెందిన నగరం.

సాలంకాయనులు తమని పరమ మహేశ్వరులుగా చెప్పుకున్నారు. చిత్రరథస్వామి అంటే సూర్యుడి ఆరాధకులుగా కూడా ప్రకటించుకున్నారు. వీళ్ళకి పాలించే అవకాశం వచ్చినప్పుడు, తమ శైవానికి పుణ్యక్షేత్రం అయిన వేంగిని రాజధానిగా ప్రకటించుకుని తమ శివభక్తిని చాటుకున్నారు. అది సురక్షిత ప్రాంతం కూడా.

ఈ సాలంకాయనులే కృష్ణాతీరంలో వస్త్ర పరిశ్రమకు కారకులు. సింహళ దేశంలో వస్త్ర పరిశ్రమని కూడా కృష్ణాతీరం నుంచే ఈ సాలంకాయనులు వ్యాప్తి చేసినట్టు చారిత్రకాధారాలున్నాయి. తమగోత్రం 'సాలి'పేరుతో మహాసాలిపట్నం కట్టుకున్నారనీ, అదే మచిలీపట్నానికి పూర్వరూపం కావచ్చని, చేనేత వృత్తిని చేపట్టిన కులానికి 'సాలి' శబ్దం వీరి వలనే ఏర్పడిందనీ చరిత్రకారుల భావన.

క్రీ.శ. 350లో సాలంకాయన హస్తివర్మని సముద్రగుప్తుడు ఓడించాడు. ఆ తర్వాత విష్ణు కుండినులు వేంగి రాజ్యాన్ని పాలించారు. వీరు తమ రాజధానిని బెజవాడకు తరలించినట్లు కన్పిస్తుంది. వారి తర్వాత కుబ్జ విష్ణువర్ధనుడి శౌర్యంతో తూర్పు చాళుక్యులు వేంగిని జయించి అక్కడ తమ పాలనని ప్రవేశపెట్టారు. తొండమండలం చివరిదాకా అంటే, కాంచిపురం సముద్రతీరం దాకా ఈ తూర్పు చాళుక్యులు వేంగి రాజ్యాన్ని విస్తరించారు.

తర్వాత చాళుక్య చోడులవశం అయ్యింది వేంగిరాజ్యం. కుళోత్తుంగుడనే బిరుదు పొందిన రాజేంద్రచోడుడు తండ్రి తరఫున తెలుగు వేంగి చాళుక్య రాజ్యానికి, తల్లి తరఫున తమిళ చోళ రాజ్యానికి ప్రభువై చాళుక్య చోడ వంశ పాలనకి కారకుడయ్యాడు.

కులోత్తుంగుడి కాలంలోనే వేంగి అనేక యుద్ధాలకు ఆట పట్టయ్యింది. బెజవాడ వద్ద అతను జరిపిన యుద్ధాల్ని చరిత్రకారులు BATTLE OF BEZWADA అని పిలుస్తారు.

కుళోత్తుంగుడి తర్వాత అతని కొడుకు విక్రమచోడుడు వేంగి నుంచి రాజధానిని గోదావరి డెల్టాకు తరలించక తప్పని పరిస్థితులు ఏర్పడ్డాయి.

ఈ చాళుక్య ప్రభువులకు మొదట బిరుద నాయకాపురం (ఈనాటి బిక్కవోలు)లో ఒక స్థావరం వుండేది! విజయాదిత్య మహేంద్రుడు అనే చోళరాజు. ఈనాటి ధవళేశ్వరం దగ్గర 'యోమగిరిదుర్గం' పేరుతో బలమైన కోటని నిర్మించాడనీ, ఈ యోమగిరి దుర్గం కేంద్రంగా అభివృద్ధి చెందిన నగరమే ఈనాటి రాజమహేంద్రవరం అనీ మెకంజీ సేకరించిన కైఫీయతుల్లో ఒక ఆధారం కన్పిస్తుంది. రాజా విజయాదిత్య మహేంద్రుడి

పేరుతోనే రాజమహేంద్రవరం ఏర్పడిందని ఈ గ్రామ క్షైఫీయత్తు చెప్తోంది. విక్రమచోడుడు వేంగి నుంచి రాజధానిని ఇక్కడకు తరలించాడు.

రాజధానిని తరలించిన తర్వాత వేంగి నగరాన్ని అనంతపాలయ్య అనే పశ్చిమ చాళుక్యుడు పాలించాడు. ఇతను పశ్చిమ చాళుక్య రాజవంశ పాలన కోసం ప్రయత్నించడంతో 12వ శతాబ్దం దాకా వేంగి రాజ్యంలో చోళులకీ చాళుక్యులకీ మధ్య అధికారమార్పిడి కోసం అనేక యుద్ధాలు సాగాయి.

నన్నయ భారతాన్ని అంకితం పుచ్చుకున్న రాజరాజు కాలంలో రాజ్యాన్ని లేక రాష్ట్రాన్ని "విషయం"గా వ్యవహరించారు. వేంగి విషయానికి రాజమహేంద్రవరం రాజధానిగా వుందన్నమాట.

నన్నయగారు రాజరాజు కొలువు కూటాన్ని వర్ణిస్తూ, "అఖిల జలధి వేలా వలయ వలయిత వసుమతీ వనితా భూషణంబైన వేంగి దేశానికి నాయక రత్నంబునుంబోలి రాజమహేంద్రపురంబు నందు...." అంటూ, వేంగి దేశంలో ఒక పట్టణమే ఈ రాజమహేంద్రవరం అన్నాడు. రాజరాజుని వేంగీ విషయాధీశుడనీ, వేగీశనాథుడనీ, వేగీ భూవల్లభుడనీ సంబోధించాడు. దీన్ని బట్టి రాజ్యం వేగి (లేక) వేంగి రాజ్యమేననీ, రాజు తన నివాసాన్ని మాత్రమే రాజమహేంద్ర పురానికి మార్చుకున్నాడనీ అర్థం అవుతోంది.

ఇక్కడో గమ్మత్తయిన అంశం వుంది. ఆంధ్ర మహాభారత రచనలో అర్జునుడు తీర్థయాత్రలు చేసిన సందర్భాన్ని తెలుగు చేస్తున్నప్పుడు కొంచెం స్వతంత్రించి, వేంగిదేశాన్ని కూడా అర్జునుడు సందర్శించినట్లు రాసి, నన్నయ గారు తన దేశభక్తిని చాటుకున్నాడు.

దక్షిణ గంగ అనదగిన గోదావరి ఒడ్డున భీమేశ్వరాలయాన్ని చూసిన తర్వాత... "ఉర్విలోన ననఘమై శిష్టాగ్రహార భూయిష్ఠమై ధరణీ సురోత్త మాధ్వర విధాన పుణ్య సమృద్ధమై పొలుచు వేగీదేశ విభవంబు జూచుచూ" అర్జునుడు వేంగి దేశం నుంచి కావేరీ తీరానికి వెళ్ళినట్లు నన్నయ వర్ణించాడు. దండిదశకుమార చరిత్రలో కూడా వేంగిదేశం వర్ణనలు, ఇక్కడి పాలకులు, ప్రజలు, కొల్లేరు సరస్సు మనకు కన్పిస్తాయి.

ఉదయగిరిలో దొరికిన ఒక శాసనంలో తిరుపతిని 'వేంగడం' గానూ, వేంకటేశ్వరుని వేంగడనాథుడిగానూ పేర్కొనడం కన్పిస్తుంది. ఆర్కాటుజిల్లా దాకా విస్తరించిన ఈ తెలుగు రాజ్యంలో, వేంగికి సంబంధించిన దేవుడు కాబట్టి వేంగడ నాథుడన్నారని, వేంకటేశ్వరుడనే పేరు ఇలా వేంగి కారణంగానే వచ్చిందని కొందరు పండితుల ఊహ.

షుమారు వెయ్యి సంవత్సరాల పాటు, కాకతీయులు వేంగిని జయించే వరకూ రాజధాని నగరంగా వున్న ఈ వేంగి మహానగరం ఛాయలు కూడా ఇప్పుడు అక్కడ మనకు కన్పించవు. భూగర్భంలో ఏమైనా వున్నాయేమో వెతికి వెలికి తీస్తే ఇంకా అనేక విశేషాలతో పాటు తెలుగు భాషా ప్రాచీనతకు సంబంధించిన అవశేషాలు కూడా దొరికే అవకాశం వుంది.

# ఏలూరు

ఏలూరు పట్టణం చరిత్రకు ఆంధ్రుల చరిత్రతో సమానమైన ప్రాచీనత వుంది. ఈ నగరం ప్రాచీనతని నిరూపించడానికి శాలంకాయన రాజవంశీకులు ఏలూరులో వేయించిన ఒక ప్రాకృత శాసనం ఆధారంగా కన్పిస్తుంది. ఇది 3వ శతాబ్దికన్నా పూర్వపు కాలానికి చెందిన శాలంకాయన దేవవర్మ వేయించిన శాసనం.

"సిరివిజయ వేంగిపురా భగవతొ చిత్తరథసామి పాదాను జాతస్య బప్ప బట్టారక పాద బట్టస్య సాలంకానస్య అస్సవేధయాళినో మహరాజ సిరీ విజయదేవ వమ్మస్య వయణేన ఎలూరె ముళుదపముఖే గావో భాణితవ్వో." ఇలా ప్రాకృత భాషలో దానిమీద కొన్ని విషయాలు రాసి వున్నాయి. శ్రీ విజయ వేంగీపురం నుంచి చిత్రరథ స్వామి పాదానురక్తుదును, బప్ప భట్టారక పాదసేవకుడును సాలంకాయనుడును అశ్వమేధ యాజియు అయిన మహారాజశ్రీ విజయ దేవవర్మ- గ్రామనాయకుల పురస్సరంగా ఏలూరు గ్రామ నివాసుల్ని ఈవిధంగా ఆజ్ఞాపిస్తున్నాను..." అంటూ సాగుతుంది ఈ శాసనం.

ఇందులో "ఎలూరే"గా ఏలూరు గ్రామాన్ని ప్రాకృత భాషలో పేర్కొనడం జరిగింది. బహుశా 'ఎలూరే' ఆనాటికి ఈ పట్టణం వ్యవహారనామం అయివుండవచ్చు.

వైదిక దేవతల్ని ఆరాధించిన ఆర్య జాతులు కృష్ణా గోదావరి తీరాల్లోకి ప్రవేశించకమునుపు- యక్ష, నాగ, రాక్షస పిశాచాది జాతి ప్రజలు ఇక్కడ నివశించేవారని చరిత్రకారులు భావిస్తున్నారు. ఎల, ఎహువల, కొట్టి, చాత... ఇలాంటి పేర్లున్న దేవతల్ని ఆనాటి స్థానిక ప్రజలు ఆరాధించి వుంటారు. తొలితరం శాతవాహనుల్లో ఈ దేవతానామాలు కల్గిన రాజులు కన్పిస్తూ వుంటారు కూడా. "ఏల" దేవత పేరునే 'ఏల ఊరు' ఏలూరుగా పిలవబడి వుండవచ్చు.

16వ శతాబ్ది ప్రారంభంలో బ్రిటిషర్ల రాక తర్వాత ఏలూరుకీ తమిళదేశంలోని వెల్లూరుకీ తేడా తెలియకపోవడంతో, మన ఏలూరుని "ఉప్పు ఏలూరు" లేక "సాల్ట్ ఎల్లోర్" అని కొంతకాలం పిలిచారు.

కృష్ణా గోదావరి మధ్యప్రదేశం అంతా ఆ రోజుల్లో కొండపల్లి సర్కార్, ఏలూరు సర్కార్‌ల మధ్య విస్తరించి వుండేది. 17వ శతాబ్ది వరకూ దివిసీమ నుంచి నిడదవోలు దాకా నూజివీడు జమీందార్ల ఆధీనంలోనే 18 పరగణాలలో ఈ ప్రాంతం వుండేది.

5 పరగణాలు ఏలూరు సర్కార్‌లోనూ, 13 పరగణాలు కొండపల్లి సర్కార్‌లోనూ వుండేవి. ఏలూరు, గుండుగొల్లు, పెంటపాడు, నిడదవోలు, బహర్జల్లీ ఇవి ఏలూరు సర్కారులో నూజివీడు జమీందారుకు చెందిన ప్రాంతాలు.

1738లో డెక్కన్ సుబేదార్‌గా వున్న అసఫ్‌జా- పన్నుబకాయి చెల్లించలేదని నూజివీడు జమీందారు రామచంద్ర అప్పారావుని 3 నెలల పాటు నూజివీడు కోటలోనే బంధించాడు. అప్పటికీ అప్పు తీర్చలేకపోవడంతో ఆ జమీందారు గారి తలకాయి నరికి ఏలూరు కోట గుమ్మానికి వ్రేలాడదీశాడట అసఫ్‌జా. అక్కడ ఇలాంటి అనేకమంది జమీందార్ల తలలు వ్రేలాడుతున్నాయి. రామచంద్ర అప్పారావు తల కూడా వాటిలో కలిసిపోయింది... అని పేర్కొన్నాడు కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్‌లో గోర్డాన్ మెకంజీ.

1679 మార్చి 18న స్ట్రేన్‌షమ్ మాష్టర్ అనే ఏజెంట్ "కోస్ట్ 4 బే" కంపెనీ తరఫున మద్రాసు- మచిలీపట్నంల మధ్య వ్యాపారానుకూలతలు పరిశీలిస్తూ ఏలూరు వచ్చాడు. ఏలూరులో పర్షియన్ తరహా కార్పెట్లు తయారవటం చూసి ఆశ్చర్యపోయాడు. ఈ కార్పెట్లను తయారుచేస్తున్న మహమ్మదీయులు తాము వంద ఏళ్ళ క్రితం పర్షియా నుంచి వచ్చి ఇక్కడ స్థిరపడి, కార్పెట్ల తయారీ ఎగుమతులు చేస్తున్నట్లు చెప్పారట. ఈస్టిండియా కంపెనీ అడుగు పెట్టిన తర్వాత బందరు కలంకారీ, ఏలూరు కార్పెట్ల పరిశ్రమ రెండూ చావుదెబ్బ తిన్నాయి.

1724లో కృష్ణా గోదావరి తీరాలు నిజాం ఏలుబడిలోకి వచ్చాయి. 1765లో రాబర్ట్ క్లైవ్ బెంగాల్ గవర్నర్‌గా వున్నప్పుడు, మొఘల్ చక్రవర్తి షా ఆలం ద్వారా, గంజాం, విశాఖపట్నం, గోదావరి, కృష్ణా జిల్లాల్ని పరిపాలించుకోవడానికి ఒక ఫర్మానా పొందాడు. ఈ ఫర్మానా ప్రకారం 1766లో అయిష్టంగానే ఈ జిల్లాల్ని ఈస్టిండియా కంపెనీకి అప్పగించక తప్పలేదు. నిజాం సర్కార్‌కు చెందిన భూములు కాబట్టి ఈ జిల్లాల్ని సర్కార్ జిల్లాలనీ, ఉత్తర సర్కార్ జిల్లాలనీ అన్నారు. అప్పుడు ఏలూరుని మచిలీపట్నం జిల్లాలో చేర్చారు. ఆంధ్రప్రాంతం అంతా తమ స్వాధీనం అయిన తర్వాత పాలనా సౌలభ్యం కోసం గుంటూరు, రాజమండ్రి, మచిలీపట్నం జిల్లాల్ని ఏర్పరిచారు. అప్పుడు ఏలూరు రాజమండ్రి జిల్లాలో కలిసింది. ఏలూరులో హెడ్ అసిస్టెంట్ కలెక్టర్‌ని నియమించి, ఏలూరు, యార్నగూడెం, తణుకు ప్రాంతాల్ని ఏలూరు డివిజన్‌లో చేర్చారు.

1875లో ఏలూరు మున్సిపాలిటీ ఏర్పడింది. శానిటేషన్ విషయంలో ఏలూరుని చాలా పరిశుద్ధమైన నగరంగా హెన్రీ మోరిస్ గోదావరి డిస్ట్రిక్ట్ మాన్యువల్‌లో ప్రశంసించాడు.

1854లో 40 మైళ్ళ పొడవున బెజవాడ నుంచి ఏలూరు వరకూ కాలువని తవ్వి దాన్ని ధవళేశ్వరం నుంచి తవ్విన కాలువతో ఏలూరులో అనుసంధానం చేశారు. ఏలూరులో ఒకే ఒక్క "లాకులు" వుండడంతో, బెజవాడ నుంచి జలమార్గాన రాజమండ్రి చేరడానికి చక్కని రవాణా సౌకర్యం ఏర్పడినట్లయింది. ఈ అతి పెద్ద కాలువ కాటన్ దొరగారి 'కల' అని చెప్పాలి. గోదావరి ఆనకట్ట కట్టేప్పుడే బెజవాడ దాకా ఏలూరు మీదుగా ఈ కాలువని తవ్వి రెండు నదుల్ని అనుసంధానం చేయడం గురించి కంపెనీ అధికారులకు కాటన్ దొర వివరించినట్లు హెన్రీమోరీస్ పేర్కొన్నాడు.

1854లో ఏలూరు కోట దగ్గర చర్చి మిషినరీ సొసైటీ ఒక ఆంగ్లో వెర్నాక్యులర్ స్కూల్ని పెట్టింది. బందరు నోబుల్ స్కూల్ తరహాలో ఈ స్కూల్ని ప్రారంభించారు. దాని తర్వాత గవర్నమెంట్ జిల్లా స్కూల్ ఏర్పడి, ఏలూరుని విద్యాకేంద్రం చేసింది. అనతికాలంలోనే ఈ స్కూల్కి ఏలూరులో రెండు బ్రాంచీలు కూడా తెరిచారు.

ఇంగ్లీషు, తెలుగు, హిందీ, పర్షియన్ భాషలు కూడా నేర్పేవాళ్ళు. ఉత్తర సర్కార్ జిల్లాలో ఎక్కువమంది విద్యార్థులు చేరి, ఎక్కువ ఉత్తీర్ణత సాధించిన స్కూల్ ఇదొకటనేనని 1878లో హెన్రీమోరిస్ గోదావరి డిస్ట్రిక్ట్ మాన్యువల్లో పేర్కొన్నాడు. అంతేకాదు, మహమ్మదీయులు, దళితులు అత్యధిక సంఖ్యలో చేరిన స్కూలు కూడా ఇదొక్కటేనన్నాడు. అయితే, ఏలూరులో ఈ స్కూల్లో చదువుకున్న పిల్లలు ఎక్కువమంది ఇంగ్లీషువారి సర్వీసుల్లో చేరకుండా హైదరాబాద్ వెళ్ళి నిజాం కొలువులో కుదుర్తు న్నారని కొంచెం బాధపడ్డాడు కూడా మెరిస్.

స్థోమత కల్గిన విద్యార్థులకి నాలుగు అణాలు, మధ్యతరగతి వాళ్ళు రెండు అణాలు, ఫీజు వసూలు చేసే వాళ్ళు మిగిలినవాళ్ళు ఉచితంగా చదువుకునే వాళ్ళు.

'రెవరెండ్ జార్జి ఇంగ్లీషు' అనే మత ప్రచారకుడు ఏలూరుకు 1854లో వచ్చిన మొదటి రెసిడెంట్ మిషనరీ! ఆయన తర్వాత 1857లో వచ్చిన "ఫాదర్ అలెగ్జాండర్" ఇక్కడ దళితుల్లో విద్యావ్యాప్తి కోసం బాగా కృషి చేశాడు. 1878 నాటికి ఏలూరు డివిజన్లో 20 గ్రామాల్లో స్కూళ్ళు నడుస్తుంటే, వాటిలో 400 మంది దళితులు చదువుకొంటున్నారని మోరిస్ వివరించాడు. ఈ విజయానికి ఫాదర్ అలెగ్జాండర్ కారణం అన్నాడు.

నగర పరిశుభ్రతకు, విద్యావ్యాప్తికి, రాజకీయ చైతన్యానికి, సామాజిక సంస్కరణలకు, స్వాతంత్రోద్యమానికీ ఏలూరు పట్టణం అందించిన సేవలు చిరస్మరణీయం.

# పరిటాల

విలువైన వజ్రాలు దొరికిన స్థావరంగా, "గని పరిటాల"గా చరిత్ర ప్రసిద్ధి నొందిన 'పరిటాల' అలనాటి పట్టణ వైభవాన్ని చవిచూసిన ప్రదేశం.

1640 వరకూ వున్న రికార్డుల్లో పరిటాల పట్టణం పర్తియాలగా కన్పిస్తుంది. బ్రిటిష్ పాలనా కాలంలోనే పర్తియాల పరిటాలగా మారింది.

ప్రాచీన జూపల్లి వారి సంస్థానం ఇది. ఈ వంశీకుల్లో జూపల్లి వెంకటాద్రి సాహిత్య పోషకుడిగా వెలుగులోకి వచ్చాడు. మహామహోపాధ్యాయ ఎలకూచి బాలసరస్వతి రచించిన చంద్రికా పరిణయ ప్రబంధాన్ని ఈ జూపల్లి వెంకటాద్రికి కృతినొసంగడం జరిగింది. కాశీరాజు కూతురు చంద్రికని భీముడు పెళ్ళాడిన కథని ఈ ప్రబంధంగా రాశాడు బాలసరస్వతి కవి.

జూపల్లి వెంకటాద్రి వదాన్యతకు మారుపేరు. కానీ, ఈయన తండ్రికి అంతమంచి పేరు వున్నట్లు కనిపించదు. రంగరాజు లింగకవి అనే ఓ తిట్టుకవి

"రవి కోటి ధామమయమై
నవకాంచన యుతము నగుచు నానాటి కొగిన్
భువిని శివాన్వితమగు నీ
భవనము జూపల్లి లింగ భవగుణ గంగా"

అని నీ వైభవం అంతా నశించిపోతుందని తిట్టినట్లు ఈ పద్యం చెప్తోంది.

కాకతీయులు, బహమనీ సుల్తాన్‌లు, కుతుబ్‌షాహీలు అసఫ్‌జాలు ఎందరు పాలించినా, "పర్తియాల సంస్థానం" ఎప్పుడూ తన ప్రత్యేకతని నిలబెట్టుకొంటూనే వుంది.

1422-35 మధ్యకాలంలో సుల్తాన్ ఫిరోజ్ షా బహమనీ వరంగల్‌ని జయించిన తర్వాత తన తమ్ముడు, అహ్మద్‌షా వల్లీని పరిటాల పైకి పంపించినట్లు కొమర్రాజు వారు మహమ్మదీయ మహాయుగంలో రాశారు.

1650లో గోల్కొండ సుల్తాన్ అబ్దుల్ హుస్సేన్ దగ్గర మంత్రిగా వున్న మీర్ జుమ్లా తన మంత్రి పదవికి రాజీనామా ఇచ్చి పరిటాలలో వజ్రాల వ్యాపారిగా మారాడు.

ఇక్కడ గనులలోంచి తవ్వి, సానబట్టిన కొన్ని మంచి వజ్రాల్ని మీర్‌జుమ్లా గోల్కొండ సుల్తాన్‌కు కానుకగా ఇచ్చాడనీ, అలా కానుకగా ఇచ్చిన వజ్రాల్లో కోహినూర్ వజ్రం కూడా వుందనీ, అది గని పరిటాలలోనే దొరికిందనీ ఒక వాదన ప్రచారంలో వుంది.

గోర్డాన్ మెకెంజీ కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్‌లో పులిచింతలకు దక్షిణంగా వున్న కొల్లూరులో కోహినూర్ వజ్రం 900 కేరట్లున్న ఇది దొరికినట్లు రాశాడు.

అంతే విలువైన మరోపెద్ద వజ్రం పరిటాలలో, కంపెనీ పాలనా కాలంలో దొరికింది. దాన్ని కనుక్కొన్న వ్యక్తి నుంచి అప్పటి మద్రాస్ గవర్నర్ స్వాధీనం చేసుకొని రహస్యంగా యూరప్ తీసుకువెళ్ళి రీజెంట్ ఆర్డియన్స్ కంపెనీకి అమ్ముకొన్నాడనీ అది ఫ్రెంచి రాణిగారి కిరీటాన్ని అలంకరించిందని మెకంజీ రికార్డు చేశాడు. కోహినూరుతో సమానమైన ఈ పరిటాల వజ్రం కథ వెలుగులోకి రాలేదు.

1679లో స్ట్రేన్‌షమ్ మాష్టర్ అనే కంపెనీ ఏజెంటు ఈ ప్రాంతాల్లో వజ్రాలు దొరికే అవకాశాల గురించి సర్వే చేశాడు. 1795లో డా॥ హేనీ అనే సర్వేయర్ రంగుల బొమ్మలతో ఇక్కడ దొరికే వజ్రాల గురించి వివరంగా నివేదికలు పంపాడు. గని పరిటాల ప్రాశస్త్యాన్ని 1880 నాటి "జియోలాజికల్ మెమోయిర్స్" గ్రంథం వివరిస్తుంది! అలాగే "ది డైమండ్స్, కోల్ అండ్ గోల్డ్ ఆఫ్ ఇండియా 1881" అనే గ్రంథం కూడా!

మెకంజీ ఈ రెండింటినీ ఉదహరిస్తూ, పరిటాల, మల్లవల్లి, గొల్లపల్లె... అలాగే, బెజవాడకు ఈశాన్య ప్రాంతాలలో ఎక్కువగా వజ్రాల గని నిక్షేపాలున్న సంగతి రాశాడు.

1850లో లెఫ్టినెంట్ యాపిల్ గాత్ అనే అసిస్టెంట్ సివిల్ ఇంజనీర్ పరిటాల, జగ్గయ్యపేట పరిసరాల్లో వజ్రాలు దొరికే స్థావరాలు వెదుకుతూ ప్రభుత్వానికి అనేక నివేదికలు పంపించాడు. సింగరేణితో సమానమైన బొగ్గు నిక్షేపాలు కూడా ఇక్కడ వున్నట్లు ఆయన పేర్కొన్నాడు.

కమలియార్ జంగ్ బహదూర్ పాలనలో వుండగా, ఆయన పరిటాలని ఒక తాలూకాగా ప్రకటించాడు. ఈ తాలూకాలో వజ్రాల గని నిక్షేపాలున్న ఏడు గ్రామాలు- గని ఆత్కూరు, వెలుసూదూరు, బత్తినపాడు, నందిగామ, కొడవటి కల్లు, ఉస్తేపల్లి, మల్లవల్లి గ్రామాల్ని కలిపి పరిటాల తాలూకాగా ప్రకటించాడు! ఈ ఏడు గ్రామాల్లోనూ గనులున్నాయి కాబట్టి, పరిటాల తాలూకాని కన్నత్ తాలూకా అని పిలిచాడు. పర్షియన్ భాషలో 'కన' అంటే గని అని!

1947లో స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత కూడా ఇంకా ఈ ప్రాంతాలపై పెత్తనం వదలక పోవడంతో, పరిటాల తాలూకాలోని ఏడు గ్రామాల ప్రజలు నిజామ్ మీద తిరుగుబాటు చేసి స్వాతంత్ర్యం ప్రకటించుకుని 'పరిటాల రిపబ్లిక్'గా తమని తాము ప్రకటించుకున్నారు. పరిటాల రిపబ్లిక్‌ని అణచివేసేందుకు నిజాం ఎంతో ప్రయత్నించాడు. కానీ సాధ్యం కాలేదు. చివరికి 26-1-1950న భారత ప్రభుత్వానికి స్వాధీనం చేశాడు. అలా పరిటాల రిపబ్లిక్ భారతదేశంలో కలిసి, కృష్ణాజిల్లాలో భాగం అయ్యింది. ఆనాటి

పరిటాల రిపబ్లిక్‌లోని భాగాలు ఇబ్రహీంపట్నం, కంచికచర్ల, చందర్లపాడు, నందిగామ మండలాల్లో కలిసిపోయాయి.

పరిటాలలో శిథిలమైన కోట ఒకటుంది. 1793లో నిజాం దగ్గర కరోడ్గిరి గానూ, కొంతకాలం పాటు దివానుగానూ పనిచేసిన రాజా కృష్ణవంతుబహద్దుర్ ఈ కోటని కట్టించాడు. ఇది తెలంగాణా 'గడీ'ల ఆకారంలో ఉంటుంది. కానీ, ఈ కోటలో ఆయన గృహప్రవేశం చేయకుండానే మరణించాడు. ఆయన ఆస్తుల్ని నిజాం స్వాధీనం చేసుకోవడంతో వారసులు వీధిన పడ్డారు. కోట శిథిలమై పోయింది. జుజ్జూరు పట్టణం గురించి వివరించినప్పుడు ఇతని కథ విపులంగా ఇచ్చాను చూడండి!

రాజవంశాలు ఏవీ నిలవకపోయినా, ప్రజా విప్లవాలు చైతన్యవంతమైన పాత్రని పోషించాయి ఇక్కడ!

శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మంగారు చెప్పిన భవిష్య పురాణంలో పరిటాలలో దొరికిన పెద్ద వజ్రంతో మళ్ళీ తాను పుట్టి, సింహాసనం ఎక్కి ఈ దేశాన్ని పాలిస్తానని అన్నట్లుంది!

# కలిదిండి

రాజరాజ నరేంద్రుడి తాత్కాలిక రాజధాని నగరంగా కలిదిండి నగరం ఒకప్పటి ప్రసిద్ధి చెందిన చారిత్రక పట్టణమే!

తూర్పు చాళుక్యులు వేంగిని పాలిస్తున్న కాలంలో కలిదిండి నగరం అభివృద్ధి చెందింది. క్రీ.శ.10వ శతాబ్ది చివరి భాగంలో రాజమహేంద్రవరానికి తన రాజధానిని తరలించేముందు, కొంతకాలం ఈ కలిదిండిని రాజకీయ కేంద్రంగా చేసుకొని రాజరాజనరేంద్రుడు ఇక్కడ నివసించినట్లు కొన్ని సాక్ష్యాధారాలున్నాయి.

కలిదిండిలో ఆయన మూడు శివాలయాలు నిర్మించాడు. కర్నాట రాజులతో జరిగిన యుద్ధంలో వీరమరణం పొందిన ముగ్గురు వీరుల జ్ఞాపకార్థం కట్టిన శివాలయాలుగా వీటిని ఒక శాసనంలో పేర్కొనడం జరిగింది. "సమాన యుద్ధం సమబలత్వచ" అంటే, సమానమైన బలం కలిగిన యోధుల మధ్య జరిగిన సమాన యుద్ధంలో వీరోచితంగా పోరి మరణించారని ఆ యోధుల గురించి ప్రశంసించడం జరిగింది ఈ శాసనంలో!

ఈస్టిండియా కంపెనీ పాలన వచ్చేవరకూ, అంటే 17వ శతాబ్ది నడిమిభాగం వరకూ కలిదిండి నగర వైభవం కొనసాగింది. రాజరాజ నరేంద్రుడు కలిదిండిని ఒక వీరుడికి దానంగా ఇచ్చాడు. ఆ ఊరు పేరే అతని ఇంటి పేరుగా మారింది. అప్పటినించీ ఈస్టిండియా కంపెనీ పాలన వచ్చేవరకూ కలిదిండి వంశీకులే పాలకులుగా వున్నారు ఈ నగరానికి! కంపెనీ పాలన వచ్చేనాటికి కలిదిండి తిరుపతి మహారాజు పాలిస్తున్నాడు. నర్సాపురం తాలూకా మొగల్తూరులో ఈ కలిదిండి పాలకులకి ఒక కోట వుండేది. ఎక్కువ కాలం మొగల్తూరులోనే వీళ్ళు గడిపేవాళ్ళట.

అందుకని బ్రిటిష్ వాళ్ళ లెక్కలో వీళ్ళు మొగల్తూరు జమీందార్లుగనే వ్యవహరించ బడినట్లు కన్పిస్తుంది.

హెన్రీ మోరిస్ గోదావరి డిస్ట్రిక్ట్ మేన్యువల్ రాసే సమయానికి కలిదిండి గోదావరి జిల్లాలో భాగంగా వుంది. తర్వాత దాన్ని కైకలూరు తాలూకాలో చేర్చారు.

కలిదిండి రాజవంశీకుల గురించి, కలిదిండి జమిందారీ గురించి హెన్రీమోరిస్ చాలా వివరాలు అందించాడు.

1780లో జమిందార్ల వ్యవస్థను క్రమబద్ధం చేసి, శాశ్వత శిస్తు పద్ధతిని కంపెనీ ప్రభుత్వం అమలులోకి తెచ్చిన నాటికి ఈ కలిదిండి మొగల్తూరు జమీందారు తిమ్మరాజు, ప్రభుత్వానికి శిస్తు బకాయిలుండి జమీందారీని కోల్పోయిన స్థితిలో "రెవిన్యూ డిఫాల్టర్"గా

వుండి అరెస్ట్ తప్పించుకొనేందుకు నిజాం పాలనా ప్రాంతంలోకి పారిపోయాడు. కృష్ణా గోదావరి జిల్లాల్లో శిస్తు బకాయి పడ్డ జమీందార్లు చాలామంది నిజాం ఏలుబడి ప్రాంతాల్లో ఇలా తలదాచుకునేవాళ్ళే. తిమ్మరాజు కూడా అదే చేశాడు.

నిజానికి అప్పో సొప్పో చేసి, శిస్తు బకాయి కట్టి వుంటే పర్మినెంట్ సెటిల్‌మెంట్ జరిగే సమయంలో శాశ్వత హక్కులు దక్కించుకోగలిగి వుండేవాడు. కానీ, తిమ్మరాజు ఆచూకి లేకపోవడంతో కలిదిండినీ, మొగల్తూరుని కంపెనీ ప్రభుత్వం స్వాధీనం చేసుకొంది.

కరువు పరిస్థితులు తాండవిస్తున్న కాలం అది. రైతులు పన్నులు కట్టలేకపోవడం వలన కూడా చాలా మంది జమీందార్లు కంపెనీ వారికి శిస్తు బకాయిలు పడి ఇలా జమీందారీని కోల్పోవలసి వచ్చింది ఆ రోజుల్లో.

బ్రిటిష్ అధికారి 'గాంబియెర్' కొంత ఔదార్యంతో ఉండి, కలిదిండి భూముల్లోకి వచ్చే గోదావరి కాలువని రిపేర్ చేయించి కరువు పరిస్థితిని చక్కదిద్దే ప్రయత్నం చేశాడు. అందుకు కంపెనీకి 900 పగోడాలు ఖర్చయ్యాయి. కానీ, కనీసం ఖర్చు పెట్టిన డబ్బు కూడా పన్ను రూపేణా వసూలు కాలేదు. ఆ తర్వాత ఎంత ప్రయత్నించినా రైతుల స్థితి మెరుగు కాకపోవడంతో ఉండి, కలిదిండి ఆర్థికంగా బాగా దెబ్బతిన్నాయి.

1795లో అకస్మాత్తుగా కలిదిండి తిమ్మిరాజు భద్రాచలం దగ్గర గోదావరి దాటి రెండు మూడు వందల మంది తిరుగుబాటుదారుల్ని తీసుకొని రాత్రికి రాత్రి ఉండి కలెక్టరాఫీస్ మీద దాడి చేసి విధ్వంసం సృష్టించాడు. అర్ధరాత్రిపూట ఠాణేదార్- అంటే పోలీసాఫీసర్‌గా వున్న ముద్దుకృష్ణ ముదలియార్ ఇంటిమీదకి దాడి వెళ్ళాడు. ఠాణేదార్ నిస్సహాయంగా ఓ గదిలో దూరి తలుపులు బిగించుకొన్నాడట. ఠాగేదార్ భార్య తిమ్మరాజు కాళ్ళా వేళ్ళా పడి, తన భర్తని చంపవద్దని, పిల్లలు గల వాళ్ళం అనీ వేడుకొంటే, ఆమె తలమీద చెయ్యి వేసి, నీ భర్తని చంపనని మాట ఇస్తున్నాను- బైటకు తీసుకురా అన్నాడట.

నిరాయుధుడిగా వచ్చిన ఆ ఠాణేదార్ చేతులు కట్టుకొని నిలబడ్డాడు. "ఏందిరా అలా చూస్తున్నావు మా వాళ్ళ వంకా- నా వంకా...??" అంటూ బొడ్లో కత్తి బైటకు తీసి ఒక్క దూకు దూకి ఠాగేదార్ పొట్టలో పొడిచేశాడట తిమ్మరాజు.

హెన్రీ మోరిస్ గోదావరి డిస్ట్రిక్ట్ మేన్యువల్‌లో ఈ సంఘటనని రికార్డు చేశాడు.

ఇది కంపెనీ అధికారుల్లో కలవరం పుట్టించింది. భద్రాచలం జమిందారు దామెర సూర్యనారాయణ రావు ద్వారా తిమ్మరాజుని అదుపు చేయడానికి మచిలీపట్నం కౌన్సిల్

అనేక ప్రయత్నాలు చేసింది. కానీ, పోలవరం జమీందారు మంగపతి దేవుడు తదితరులతో కలిసి తిమ్మరాజు గెరిల్లా పోరాట మార్గాన్నే ఎంచుకొన్నాడు. ఆ తర్వాత ఈ వంశీకులెవరూ కలిదిండి పాలకులుగా కన్పించలేదు.

కలిదిండిలో పటిష్టమైన ఒకనాటి కోటకి ఇప్పుడు ఆనవాళ్ళు కూడా లేవక్కడ! దాని స్థానంలో రైతులు వ్యవసాయం చేసుకొంటున్నారు.

సెన్సస్ ఆఫ్ ఇండియా 1961 కృష్ణాజిల్లా రెండవ వాల్యూమ్‌లో కైకలూరు తాలూకా కలిదిండిలో ఒకనాటి ఒకనాటి కోట గురించిన వివరాలు వున్నాయి. ఈ కోటకు ఎనిమిది వైపులా ఎనిమిది ప్రాకారాలుండేవిట! తూర్పు వైపు ప్రాకారం కోట కలిదిండిగా పిలువబడ్తున్న ప్రాంతం. అది ఆ రోజుల్లో రాచవీధిట. ఏనుగులు, గుర్రాలు, రథాలు తిరుగాడుతుండేవిట ఈ వీధిలో!

ఇప్పుడు గోపాలస్వామి దేవాలయానికి పక్కన తూర్పువైపు ప్రాకారం వుండేదిట. కోటకు పడమర వైపున పేట కలిదిండిలో పుర ప్రముఖులు, రాజ ప్రముఖులు నివసించేవాళ్ళు.

భోగేశ్వర స్వామి దేవాలయం కలిదిండిని భోగేశ్వర పురంగా ప్రసిద్ధిలోకి తెచ్చింది. ఇక్కడున్న కోనేరుని పాతాళ గంగగా భావిస్తారు. పంచబుగ్గలు రూపంలో పాతాళగంగ వుంటుంది. నీటిజల బుడ-బుడమని ధ్వని చేస్తుంటే, అది "హర-హర" అనే ధ్వనిగా విన్పిస్తుందని అంటారు.

ఖరదూషణాది రాక్షసుల్లో ఖరుడు ఈ ప్రాంతానికి పాలకుడిగా వుండే వాడనీ, రాముడు ఖరుడుని చంపిన ప్రాంతం కాబట్టి 'ఖరదిండి' జనవ్యవహారంలో కలిదిండిగా మారిందని స్థలపురాణం చెప్తుంది. ఇక్కడి భోగేశ్వరాలయంలో శివలింగాన్ని స్వయంగా రాముడే ప్రతిష్టించాడని జనశృతి.

రాజరాజనరేంద్రుడి కారణంగా కొంతకాలం వేంగిదేశపు రాజధాని నగరంగా విలసిల్లిన 'కలిదిండి'లో ఈ రోజున అలనాటి పట్టణ వైభవం ఏదీ కన్పించదు. బ్రిటిష్ పాలనా కాలంలో ఇది మామూలు కుగ్రామంగా మిగిలిపోయింది! ఇటీవలి కాలంలో మండల స్థాయికి ఎదిగి పురవైభవం చాటుకోవాలని ప్రయత్నిస్తోంది!

# కొండవీడు

గుంటూరు సీమలో ఫిరంగిపురం సమీపంలో 12 కిలోమీటర్ల పొడవున విస్తరించిన పర్వత శ్రేణుల్లో సన్నకొండ దగ్గర కొండవీడు పట్టణం వుంది.

1144లో విశ్వంభర గజపతి ఈ కొండవీడుని కట్టించాడని ప్రతీతి. బలాఢ్యమైన దుర్గాలలో ఇది ఒకటి. ముప్పయిమైళ్ళ చుట్టుకొలత కల్గిన కొండవీడు దుర్గం రెండున్నర మైళ్ళ ఎత్తున పర్వతాగ్రం వరకూ విస్తరించింది. 20 బురుజులు, 50 శిఖరాలూ వుండేవిట. మూడు మైళ్ళ చదరంగల విశాల సమప్రదేశంలో కొండవీటి నగరం వుండేది.

కొండవీడుని పాలించిన రాచరికాలన్నీ నశించిపోయి, కొండవీడు పట్టణపాలన కూడా నిర్లక్ష్యానికి గురి అయిన దశలో ఈస్టిండియా కంపెనీ స్వాధీనం తర్వాత, ఒకసారి అధికంగా కురిసిన వర్షాలకు కొండవాగులు పొంగి పట్టణం మొత్తం జలసమాధి అయ్యింది. వేలాదిపౌరులు మరణించినట్లు కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్‌లో గోర్డాన్ మెకంజీ పేర్కొన్నాడు.

1323లో కాకతీయుల శకం ముగిసింది. ఢిల్లీ సుల్తాన్ మహమ్మద్ బీన్ తుగ్లక్ ఆధీనంలోకి కొండవీడు చేరింది. కాకతి ప్రతాపరుద్రుడు కృష్ణాతీరంలో వెలమ, కమ్మ, రెడ్డి కులాలకు చెందిన యోధుల్ని నాయకులుగానూ, సైనికాధుకారులుగానూ నియమించి, వాళ్ళతో బంధుత్వాలు కలుపుకొని సుస్థిరపాలన అందించాడు. అతని కాలంలో అధికారాలు పొందిన 75 మంది నాయకుల్ని ముసునూరి ప్రోలయ నాయకుడు కూడగట్టి మహమ్మద్ బీన్ తుగ్లక్ మీద తిరుగుబాటు చేశాడు. 1325లో ఈ నాయకులు విజయం సాధించడంతో రెండేళ్ళకే తుగ్లక్ పాలన అంతం అయ్యింది. ఆ తర్వాత కనీసం వంద సంవత్సరాల వరకూ మహమ్మదీయ పాలకులకు ఇక్కడ పాలనావకాశాలు రాలేదు.

తిరుగుబాటు విజయవంతం అయ్యాక ప్రోలయ వేమారెడ్డి గుంటూరు సీమని పాలించుకోసాగాడు. అద్దంకి అతని రాజధాని నగరంగా వుండేది. రెడ్డిరాజుల పాలనకు ప్రోలయ ఆరంభం పలికాడు.

అతని తర్వాత అనపోతారెడ్డి కాలంలో అల్లావుద్దీన్ బహుమనీషా అనే బహమనీ సుల్తాన్ అనేకసార్లు దండెత్తి అమరావతి దేవాలయాన్ని ధ్వంసం చేసి నానా బీభత్సాలు సృష్టించాడు. కానీ, రెడ్డి రాజ్యాన్ని గెలవలేక పోయాడు. అనపోతారెడ్డి మరింత దక్షిణగా వుండే కొండవీటి పట్టణానికి తన రాజధానిని అద్దంకి నుంచి మార్చాడు.

1340లో అనువేమారెడ్డి అధికారంలోకి వచ్చాడు. కొండవీడులో అతని పాలనా కాలంలో ఒక సంఘటన జరిగింది. పశువుల కాపరి ఒకడికి సన్యాసి ఎవరో కన్పించి ఫలానాచోట తవ్వితే నిధులు దొరుకుతాయని నమ్మించి, పెద్ద గొయ్యి తవ్వించి, అందులో మంట చేయించి ఆ మంటలోకి పశువుల కాపరిని తోసెయ్యాలని ప్రయత్నించాడు. ఆ మాయల సన్యాసితో పెనుగులాడి చివరికి అతన్నే మంటల్లోకి నెట్టగలిగాడు పశువులకాపరి. అది నరబలి కోసం సన్యాసి చేసిన ఎత్తుగడ అని అర్థం అయ్యిందతనికి. ఆ తర్వాత అక్కడ వెదికితే ఒక పెద్ద బంగారపు బొమ్మ దొరికిందిట. బంగారం విలువ తెలీని ఆ పశువుల కాపరి తమలపాకులకు, వక్కలకూ ఇంట్లో సరుకులకీ ఈ బొమ్మని ముక్కలు చేసి ఒక్కో ముక్క అమ్ముకుంటుంటే అను వేమారెడ్డికి తెలిసి, ఆ బంగారపు బొమ్మని స్వాధీనం చేసుకున్నాడని, ఆ సంపదతోనే అతను చుట్టుపక్కల చాలా రాజ్యాల్ని కొనుగోలు చేసి గానీ, జయించి గానీ, తన రాజ్యాన్ని విస్తరించుకోగలిగాడనీ గోర్డాన్ మెకంజీ ఈ ఉదంతాన్ని కృష్ణా డిస్ట్రిక్ట్ మేన్యువల్‌లో రాశాడు.

ఈ రెడ్డి రాజుల పూర్వీకుల్లో అల్లారెడ్డి, "కోమటి వేమయ" అనే జైన సన్యాసి నుంచి బంగారాన్ని గానీ, బంగారం తయారుచేసే విద్యను గానీ ఇలానే సంగ్రహించాడని, మరణించిన కోమటి వేమయ ఆత్మ సంతృప్తి కోసం 'కోమటి' అనే బిరుదు నామం తమ పేర్ల ముందు ధరించారనీ ఇంకో కథ కూడా ప్రచారంలో వుంది.

1370లో కొండవీడు రాజ్యానికి అళివేమారెడ్డి, 1382లో కొమరగిరి రెడ్డి, 1396లో పెదకోమటి వేమారెడ్డి అధికారంలోకి వచ్చారు. కొండవీటి సామ్రాజ్యం శ్రీశైలం నుంచి సింహాచలం దాకా విస్తరించింది. 1424లో రాచవేమారెడ్డి. పాలన వచ్చాక కొండవీడు బాగా కుదించుకుపోసాగింది. దుష్టపాలన కారణంగా ప్రజలు ఆగ్రహోదగ్రులౌతున్నప్పుడు చౌదరి ఎల్లప్ప అనే సేవకుడు రాచవేమారెడ్డిని చంపినట్లు గోర్డాన్ మెకంజీ పేర్కొన్నాడు. 1325 నుంచి 1424 దాకా నూరు సంవత్సరాల పాటు కొండవీటి సామ్రాజ్యం వైభవోపేతంగా వెలిగింది.

రెడ్డిరాజుల తర్వాత కొండవీడు గజపతుల పాలనలోకి వెళ్ళింది. గజపతులు కొండవీడునీ కొండపల్లి వర్గాల్ని మరింత బలోపేతం చేశారు. కపిలేశ్వర గజపతి పేరుతో కృష్ణాతీరంలో కపిలేశ్వరపురం, బెజవాడ దగ్గర విద్యాధర గజపతి పేరుతో విద్యాధరపురం, ఆయన రాణి భవానమ్మ పేరుతో భవానీపురం, కూతుళ్ళు ముత్యాలమ్మ పైడమ్మల పేరుతో ముత్యాలంపాడు, పైడూరుపాడు గ్రామాలు ఏర్పడ్డాయి.

1516లో కృష్ణరాయలు గజపతుల్ని ఓడించాడు. ఆ తర్వాత కొండవీడు వైభవం పూర్తిగా నశించిపోయింది. 1579లో మహమ్మదీయులు, వారి తర్వాత ఫ్రెంచి వ్యాపారులు, ఈస్టిండియా కంపెనీ... వీళ్ళ పాలనా కాలాలలో ఆలనా పాలనా లేక కొండవీటి కోట శిథిలం కాసాగింది.

1531-36లలో గోల్కొండ సుల్తాన్ కులీకుతుబ్‌షా అనేకసార్లు దండెత్తి ఈ కోటని వశం చేసుకున్నాడు. అప్పుడు జరిగిన యుద్ధాల్లో పాల్గొన్న సేనాని ముర్తజాఖాన్ పేరుతో కొండవీడు పట్టణాన్ని ముర్తజానగర్ అని పిలిచారు. 1752లో ఈ ముర్తజానగర్ ఆరేళ్ళపాటు ఫ్రెంచి వారి ఆధీనంలో వుంది. ఆ రోజుల్లో 'బుస్సీ దొర' ఈ కోటలో వుండి, ఆకలికి మాడిన సంగతి గోర్డాన్ మెకంజీ పేర్కొన్నాడు. 1758లో ముర్తజానగర్ అంటే, ఈనాటి గుంటూరుజిల్లా యావత్తూ బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ స్వాధీనం అయ్యింది.

కొండవీటి కోట దగ్గర వేములమ్మ దేవాలయం, విష్ణ్వాలయం వున్నాయి. విష్ణ్వాలయానికి పక్కన ఒక పెద్ద హాలుంది. రెడ్డి రాజుల కాలంలోగానీ, కృష్ణరాయల కాలంలో గానీ, 72 మంది సామంత రాజుల్ని గుడి ఉత్సవం పేరుతో ఆహ్వానించి, ఈ హాలులో సమావేశపరిచి, ఇక్కడినించి తమకు తెలియకుండానే ఒక పెద్ద నూతిలోకి వాళ్ళు పడిపోయే ఏర్పాట్లు చేసినట్లు ఒక కథని మెకంజీ పేర్కొన్నాడు. 18వ శతాబ్దిలో కొండవీడులో జరిగిన పెద్ద నరమేథాలలో ఇది ఒకటి.

1844-55 మధ్య గుంటూరు కలెక్టర్‌గా మిష్టర్ నేవిల్ ఐదుసార్లు పనిచేశాడు. ఆ కాలంలో కొండవీడులో కొందరు మహమ్మదీయులు బ్రౌన్ పేపర్ తయారు చేస్తూ కంపెనీ ఆఫీసులకు సరఫరా చేస్తుండేవాళ్ళు. స్థానికంగా ఏ పరిశ్రమనీ బతకనివ్వకూడదనే ఏకైక లక్ష్యంతో పనిచేసిన కంపెనీ పాలనా విధానంలో భాగంగా కలెక్టర్ నేవిల్, తన ఆఫీసుల్లో కొండవీడు బ్రౌన్ పేపర్‌ని కొనకూడదని నిషేధించాడు. ఆ విధంగా కొండవీడు చేతి పేపరు పరిశ్రమ మూతపడిపోయింది. అత్తరు పరిశ్రమ కూడా కొండవీడుకు ప్రసిద్ధి తెచ్చింది. దాన్ని కూడా మూసేయించారు.

కొండవీటి రెడ్డిరాజుల చరిత్ర ఎర్రన శ్రీనాథుడు వంటి మహాకవుల చరిత్రతో ముడిపడి నడిచింది. అనువేమారెడ్డి వసంతోత్సవాన్ని నిర్వహించి "కర్పూర వసంతరాయలు" బిరుదు పొందాడు. భోజరాజు రాజధాని "ధారానగరం"తో సమానంగా కొండవీడుని తీర్చిదిద్దాడని కవులు ప్రశంసించారు. తేనెబొట్టు కోసం పువ్వు పువ్వు తిరిగే తుమ్మెదలా దేశదేశాలన్నీ

గావించి, విలాసవస్తువులు సేకరించి "అవచి తిప్పయ్య శెట్టి" అనే వర్తకుడు అను వేమారెడ్డి కోసం వసంతోత్సవాన్ని నిర్వహింపచేశాడట.

పరరాజ్య పరదుర్గ పరవైభవ శ్రీల గొనకొని విడనాడు కొండవీడు
ముగురు రాజులకును మోహంబుపుట్టించు కొమరు మించిన వీఁడు కొండవీడు
చటుల విక్రమ కళాసాహసం బొనరించు కుటిలారులకు జోదు కొండవీడు
జన ఘోటక సామంత సరస వీర
భటనటానేక హాటక ప్రకట గంధ
సింధు రార్భట మోహన శ్రీలఁదనరు
కూర్మి నమరావతికి జోఁడు కొండవీఁడు-"

అనే పద్యం కొండవీడు అలనాటి పట్టణ వైభవానికి ససాక్ష్యంగా నిలుస్తుంది.

# కొల్లూరు

కొల్లూరు పేరు తలుచుకోగానే చారిత్రక అవగాహన ఏ కొద్దిపాటిగా వున్న వారికైనా కోహినూర్ వజ్రం గుర్తుకొస్తుంది.

తెలుగు వారి ఖ్యాతిని చిరస్థాయి చేసిన కోహినూరు వజ్రాన్ని ప్రసాదించిన కొల్లూరు కృష్ణాతీరంలో వర్ధిల్లిన ప్రాంతం కావడం గర్వకారణమే!

కృష్ణానదికి ఎగువన వెడితే గుంటూరు జిల్లా వైపున చింతపల్లి, మాదేపాడు, జట్టవల్లి, పులిచింత, కొల్లూరు, చిట్యాల, కేతవరం... ఇలా అనేక ప్రాంతాలు కన్పిస్తాయి.

వాసిరెడ్డి జమీందారీ వంశీకులకు చింతపల్లి తొలి రాజధాని. వెంకటాద్రినాయుడు చింతపల్లి నుంచి ఈనాటి అమరావతికి రాజధాని నగరాన్ని తరలించాడు. కృష్ణానదికి కృష్ణాజిల్లా వైపున నందిగామ, జయంతిపురం, వేదాద్రి, ముక్త్యేశ్వరపురం, పోచంపల్లి, గంద్రాయి, జగ్గయ్యపేట గ్రామాలున్నాయి. ఇంచుమించుగా, కృష్ణానదికి అటువైపు, ఇటువైపూ వున్న ప్రాంతాలన్నీ, వాసిరెడ్డి వంశీకుల ఏలుబడిలో వున్న ప్రాంతాలే! వెంకటాద్రినాయుడు గారి తండ్రి పేరుతో కృష్ణాజిల్లాలో జగ్గయ్యపేటనీ తల్లి పేరుతో గుంటూరు జిల్లాలో అమరావతి సమీపాన అచ్చంపేట పట్టణాలను ఆయన నిర్మింపచేశాడు.

1883లో కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్ తయారుచేసిన గోర్డాన్ మెకంజీ, 1239 నాటి ఒక దాన శాసనం చింతపల్లిలో దొరికినట్లు పేర్కొన్నాడు. ఇది ఈ ప్రాంతం ప్రాచీనతకు ఒక తార్కాణం అంతే!

పలనాడులోని గనికొండ పర్వతశ్రేణుల దాకా వచ్చిన తర్వాత కృష్ణానది ఉత్తరదిశగా మళ్ళింది. తూర్పున బంగాళాఖాతంలో కలిసేందుకు ఉరుకులెత్తుతూ వస్తున్న కృష్ణానది తన గమ్యాన్ని, దిశనూ మార్చుకుని ఉత్తరవాహినిగా మారింది. ఇలా ఉత్తరదిశకి తిరిగి వుండకపోతే, గనికొండనుంచి కేవలం 80 మైళ్ళదూరంలో సముద్రంలోకి వెళ్ళి కలిసిపోయేది. ఉత్తరానికి మళ్ళడం వలన మరికొంత ముందుకు ప్రవహించి, తిరిగి తూర్పుకు మళ్ళి బెజవాడ మీదుగా దివిసీమలోకి కృష్ణానది ప్రవహించింది. ఈ ఉత్తరవాహిని లేకపోయినట్లయితే, కృష్ణాజిల్లా కృష్ణానదికి అటువేపే వుండేది. బెజవాడ కృష్ణానది ఒడ్డున వుండేది కాదు.. అది కృష్ణానది ఈనాటి కృష్ణాజిల్లాకు ప్రసాదించిన వరం.

బెజవాడకు 45 మైళ్ళ ఎగువన ముక్త్యాల వుంది. అక్కడ పులిచింతకొండల్ని చుట్టి కృష్ణానది ముక్త్యాల మీదుగా ముందుకు ప్రవహిస్తోంది.

నదికి అటువైపున చింతపల్లి ముక్త్యాలకు 12 మైళ్ళ దిగువన వుంది.

పులిచింత దాటిన తర్వాత కొల్లూరు వస్తుంది.

కొల్లూరు వజ్రాల గనులకు ప్రసిద్ధి చెందిన ప్రాంతం. ఈ కొల్లూరుకు ఈశాన్యంగా ఒక మైలుకన్నా తక్కువ దూరంలో 'కొల్లూరు పేట' అనే కుగ్రామంలో ఒక పెద్ద రాతి స్తంభం వున్నట్లు మెకంజీ రాశాడు. అప్పటికే శిధిలమైన ఒక పురాతన మశీదు కూడా చాలా పెద్దది వున్నదట. శిధిలమైన రెండు పెద్ద పెద్ద చెరువులు కూడా వున్నట్టు పేర్కొన్నాడు.

కొండలమీంచి వచ్చే వర్షపు నీటిని ఈ చెరువుల్లో నిలవ చేసేవారు. మెకంజీ కాలానికి అంటే 1883లో కొల్లూరు పడమరగా అనేక పురాతన శిధిలాలున్నాయని పేర్కొన్నాడు. ఇప్పుడు వాటి జాడ కూడా తెలియదు.

మార్కోపోలో 13వ శతాబ్దంలో ఈ ప్రాంతానికి వచ్చాడు. కృష్ణానది ముఖద్వారం నుంచి పడవ మీద కృష్ణానదిలో ప్రయాణించి కొల్లూరు చేరాడు. పలనాడులో విస్తారంగా పండిస్తున్న పత్తి తోటల్ని, బందరులో అతి సన్నని నూలు బట్టలు తయారుచేసే వస్త్ర పరిశ్రమల్ని, కృష్ణాతీరంలోని రాగి, వెండి, బంగారం, సీసం వంటి లోహాలకు సంబంధించిన కర్మాగారాల్ని మార్కోపోలో సందర్శించి ఆశ్చర్యపడ్డాడట!

'నికోలో కోంటీ' అనే యాత్రికుడు కూడా, కృష్ణానది మీద ప్రయాణిస్తూ, చింతపల్లి, పులిచింత కొల్లేరు ప్రాంతాల్లో సున్నపురాళ్ళ కొండల్ని చూసి సింద్‌బాద్ సాహసయాత్రలు కథలు గుర్తుకొస్తున్నట్లు రాశాడు.

1679లో స్ట్రేన్షమ్ మాస్టర్ అనే ఈస్టిండియా కంపెనీ ఏజెంట్ ఈ ప్రాంతాల్లో వజ్రాల స్థావరాల్ని సర్వే చేశాడు. 1795లో డా॥ హేనీ, ఈ ప్రాంతాలన్నింటినీ రంగురంగులుగా మ్యాపులు చిత్రించి నివేదికలు పంపించాడు.

కృష్ణానదికి అటు కొల్లూరు, ఇటు పరిటాల వజ్రాల కేంద్రాలుగా విలసిల్లాయి.

ఫ్రెంచి వజ్రాల వర్తకుడు జీన్ బాప్టిస్ట్ టావెర్నియర్ 16, 17వ శతాబ్దాలకాలం నాటివాడు. 1650 తర్వాత ఈయన కనీసం ఆరుసార్లు ఈ కొల్లూరుకు వజ్రాల కోసం వచ్చాడట. వర్తక వాణిజ్య కేంద్రంగా గోల్కొండ వర్ధిల్లుతున్న కాలం ఇది. కోస్తా జిల్లాలన్నీ గోల్కొండ పాలకుల చేతుల్లో వున్నాయి. గోల్కొండలో బయల్దేరి 7 రోజులు ప్రయాణించి, కృష్ణను దాటి గని కొలౌర్‌కు చేర్తున్నట్లు ఆయన రాసుకున్నాడట. ఆయన రికార్డుల్ని ఉటంకిస్తూ గోర్డాన్ మెకంజీ గని కొలౌర్ అంటే, గని కొల్లూరేనన్నాడు. ఇది పులిచింతకు దక్షిణంగా, బెల్లంకొండకు పశ్చిమంగా వుంది. తెనాలి దగ్గర, వెల్లటూరు, కొలకలూరుల మధ్య ఇంకొక కొల్లూరు వుంది. మనం చర్చిస్తున్న వజ్రాల కొల్లూరు వేరు.

మెకంజీ లెక్క ప్రకారం 15వ శతాబ్దిలో ఈ కొల్లూరు గని బైట పడిందని! అది కూడా ఒక సరదా కథే!

కొల్లూరులో ఒక రైతు జొన్నలు పండించడానికి భూమిని దున్నుతున్నప్పుడు, ఒక మెరుగు రాయి కొంచెం పెద్దదే సూది మొనలతో వున్నది దొరికిందట. కనీసం 25 కేరట్ల బరువు వుండి వుంటుంది. అది ఏమిటో ఆ రైతుకు తెలీదు. ఏదో విలువైనదే అనుకొన్నాడు. నేరుగా దాన్ని గోల్కొండకు తీసుకువెళ్ళి అమ్మితే మంచి ధర వస్తుందనుకున్నాడు. దాంతో ఈ ఖరీదైన రాయి కథ బజార్న పడింది. ఆ రైతుకు ఎంత డబ్బు గిట్టు బాటయ్యిందో తెలియదు గానీ, కొల్లూరు భూముల్లోకి జనం మాత్రం విరగబడి వచ్చారు... వజ్రాలు ఇలాంటివి దొరుకుతాయి- ఏరుకోవాలని! ఇప్పటికీ అటు కొల్లూరు ఇటు పరిటాల గ్రామాల మీద ఈ జనం తాకిడి వుంది. రాళ్ళ ఏరుతుంటారు వజ్రాలు' కావచ్చని జనం...

900 కేరట్ల వజ్రపు రాయి ఇలాంటిదే ఇక్కడ ఒకటి దొరికింది. నవంబర్ 2, 1665న ఔరంగజేబు టావెర్నియర్ అనే ఫ్రెంచి వజ్రాల వర్తకుడికి దర్శనం ఇచ్చినప్పుడు, టావెర్నియర్, కొల్లూరులో దొరికిన ఈ వజ్రాన్ని ఔరంగజేబుకి అమ్మడం గానీ, బహూకరించడం గానీ జరిగింది. హార్టెన్సియో బర్గియో అనే పనివాడు ఈ 900 కేరట్ల వజ్రాన్ని చేతకానితనం వలనో, తస్కరించడం వలనో 218 కేరట్ల వజ్రంగా పదును పెట్టి ఇచ్చాడు. 1883లో మెకంజీ కాలానికి ఇది 186 1/2 కేరట్లుంది. ఈ కొల్లూరు వజ్రాన్నే కోహ్-ఇ-నూర్-వజ్రంగా పిలిచినట్లు మెకంజీ రాశాడు.

1650 నాటికి, కొల్లూరులో 60 వేల మంది గని కార్మికులు ఇక్కడ వజ్రాల గనుల్లో పనిచేస్తూ వున్నారట! అదీ, ఆనాటి కొల్లూరు వైభవం.

1680 తర్వాత గోల్కొండ కుతుబ్‌షాహీ రాజవంశీకుల పాలన అంతరించి, ఔరంగజేబు స్వాధీనం కావడంతో గోల్కొండ వ్యాపారం పూర్తిగా తుడిచిపెట్టుకు పోయింది.

కొల్లూరు వజ్రాల వ్యాపారం ఢిల్లీకి మారింది. గోల్కొండ సుల్తాన్‌లను మంచి చేసుకోవడానికి, వ్యాపారాభివృద్ధికోసం టావెర్నియర్ వంటి విదేశీ వజ్రాల వ్యాపారులు తమ దృష్టిని ఢిల్లీకి సారించి వుంటారు.

కోహినూర్ వజ్రాన్ని బహూకరించడం ద్వారా కృష్ణాతీరంలో అటు కొల్లూరు, ఇటు పరిటాల తదితర ప్రాంతాల్లోని వజ్రాలకు గిరాకీ కల్పించి వుంటారని మనం అర్థం చేసుకోవచ్చు.

కొల్లూరు, పులిచింత ప్రాంతాలకు తీవ్రవాద కార్యక్రమాల కారణంగా సామాన్య ప్రజలు పోయి చూసి రాలేని పరిస్థితి ప్రస్తుతం నడుస్తోంది. ప్రభుత్వం పూనుకొని, పులిచింత ప్రాజెక్ట్ పనితో పాటు, చారిత్రక ప్రాధాన్యత కల్గిన ఈ ప్రాంతపు ప్రకృతి రమణీయతను ఉపయోగించి పర్యాటక కేంద్రంగా అభివృద్ధి చేయవలసి వుంది!

# తెట్టు

కొండవీడుతో మొదలుపెట్టి కందుకూరు దగ్గర గుడ్లూరు దాకా విస్తరించిన ప్రాంతం మొత్తం ఒక సంస్థానంగా వుండేది. ఈ సంస్థానానికి "తెట్టు" ముఖ్య పట్టణంగా వుండేది.

తెట్టు సంస్థానాధీశుల్ని 'గుడ్లూరు ప్రభువు'లని పిలిచేవారు. ఈస్టిండియా కంపెనీ ఉత్తర సర్కార్ జిల్లాల్ని స్వాధీనం చేసుకునే నాటికే ఈ తెట్టు సంస్థానం అంతరించిపోయింది.

ప్రసిద్ధ సోదర కవులు మోచెర్ల వెంకన్న, మోచెర్ల దత్తప్పలు ఈ సంస్థానంలో ఆశుకవులుగా రాణించారు. మోచెర్ల వెంకన్న తిట్టుకవిగా ప్రసిద్ధుడు. వీరి చాటువుల్ని దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు వెలుగులోకి తెచ్చారు.

పెన్నా నదీతీరంలో వర్ధిల్లిన అలనాటి పట్టణం ఈ "తెట్టు"... ఒకప్పుడు ప్రసిద్ధ బౌద్ధక్షేత్రం. తొండమండలంగా ఏర్పడిన తర్వాత, పల్లవుల కాలంలో పినాకినీ నది దాకా, ఉత్తరాన తూర్పు కనుమల వరకూ ఈ రాజ్యం ద్రవిడ దేశంలో అంతర్భాగంగానే వుండేది.

ఈ తొండమండలంలో 'పెన్నంబడి' పేరుతో పెన్నానదీ తీర ప్రాంతాన్ని పిలిచారు. పెన్న పరినాడు, పెన్నబడి, హెన్ననాడు అనే పేర్లు వినియోగంలో వుండేవి.

పెన్నానదీ పరివాహక ప్రాంతాల్లో అగ్ని పర్వతాలు వున్నాయని ప్రజల నమ్మకం. పెన్నానది ఒడ్డున నెల్లూరు 'తెట్టు' అనే పట్టణాలు అగ్ని పర్వతాలు పేలి లావా విరజిమ్మిన తర్వాత ఏర్పడిన భూభాగాల్లో నిర్మించినవేనని అంటారు.

షుమారు పదివేల సంవత్సరాల క్రితం నెల్లూరు ఎగువ ప్రాంతం రాయలసీమ దిశగా వున్న ఒక అగ్ని పర్వతం పేలి, లావా ప్రవహించి నేరుగా వచ్చి ఈనాటి 'తెట్టు' గ్రామం దగ్గరగా వున్న సముద్రంలో కలిసింది. 1864 నవంబర్ 1వ తేదీన వచ్చిన ఉప్పెన తరవాత సముద్రం తెట్టు గ్రామం నుంచి 3 మైళ్ళు వెనక్కి వెళ్ళిందని ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా ఆధారంగా శ్రీ మోచర్ల వెంకటేశ్వరరావు ఒక వ్యాసం రాశారు. అప్పటివరకూ 'తెట్టు' సముద్రతీర గ్రామమే!

క్రీస్తు పూర్వం 1వ శతాబ్దం నుంచీ 9వ శతాబ్దం వరకూ ఇక్కడ రెండస్తుల బౌద్ధ చైత్యారామం వుండేదని అంటారు. ఐదడుగుల బుద్ధ విగ్రహం కూడా వుండేదనీ, ఆకుపచ్చని గ్రానేట్ శిలతో చెక్కిన విగ్రహం అనీ, బౌద్ధమతం తెలుగునాట పూర్తిగా అంతరించి పోయాక శైవులు ఈ మఠాన్ని ఆక్రమించారనీ పరిశోధకుల భావన.

శైవులు ఇక్కడ ఒక శైవ విద్యాలయం నడిపి వేదాల అభ్యున్నతికి కృషి చేశారు. కృష్ణరాయల కాలానికి పెన్నానది దక్షిణ తీరం విజయనగర సామ్రాజ్యంలో భాగంగానే వుంది. కృష్ణరాయలు తిమ్మరసు వేయించిన అనేక దానశాసనాలున్నాయి. ఈ కాలంలో వైష్ణవం బాగా విస్తరించింది. విష్ణ్వాలయాలకు రాయలు, ఆయన పరివారం భూరివిరాళాలు అందించారు. వైష్ణవాన్ని ఇతోధికంగా ప్రోత్సహించారు.

ఈ క్రమంలో భాగంగా ఈ తెట్టు శైవపీఠం విష్ణ్వాలయంగా మార్పు చెందింది. 1538 సంవత్సరంలో 'మోచర్ల రామయ్య' అనే భక్తుడు విళంబినామ సంవత్సర శ్రావణ శుద్ధ నవమి నాడు ఇక్కడ శ్రీ లక్ష్మీనృసింహస్వామి శిలా విగ్రహాన్ని ప్రతిష్ఠించాడు. అప్పటినించీ 'తెట్టు' ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రంగా మారింది. కృష్ణాతీరంలో దక్షిణాన మంగళగిరి, ఉత్తరాన వేదాద్రి పెన్నాతీరంలో తెట్టు పట్టణాలలో లక్ష్మీ నరసింహ స్వామి దేవాలయాలు అగ్నిపర్వతాలకు శాంతిని ఉపశమనాన్ని కల్గించేవిగా రూపుదిద్దుకున్నాయి.

1450 సంవత్సరంలో వేజెళ్ళ పోలమరాజు ఈ సంస్థానాన్ని వ్యవస్థాపించాడు. 1750 వరకూ వేజెళ్ళ రాజవంశీకులే పాలించారు. ఆ తర్వాత వారసులు లేని స్థితి ఏర్పడడంతో అప్పటి మంత్రి వెన్నెలకంటి వెంగన, జమీందారు గారి దూరపు బంధువుల్లో ఒకరికి అధికారాన్ని కట్టపెట్టి రాజ్యసంరక్షణ చేశాడు.

ఈ ప్రాంతంలో దొరికిన అనేక చాటువులలో వేజెళ్ళవారు, వెన్నెలకంటి వారు చాలా సందర్భాల్లో కన్పిస్తారు. కర్నాట సుల్తాన్‌కు కప్పం చెల్లించలేకపోవడాన ఈ జమీందారీ రద్దయ్యిందని అంటారు.

"కవిత పుట్టిల్లు వెన్నెలకంటి యిల్లు, వచ్చి చొచ్చెను మోచెర్ల వారి ఇల్లు-" అనే నానుడి ఈ సంస్థానానికి సంబంధించినదే! తెట్టు సంస్థానం మంత్రులు వెన్నెలకంటి వారు. వీరికి మోచెర్ల వారితో వియ్యం ఏర్పడిన తరువాత, మోచెర్ల వంశీకులక్కూడా కవిత్వం అబ్బిందని దీని భావం.

మోచెర్ల వెంకన్న ఈ కవివరేణ్యుల్లో ప్రసిద్ధుడు. వెంకటగిరి రాజావారి ఆస్థానంలో ఒక కవి పండితుడికి తగు రీతిలో సత్కారాలు జరగలేదని ఆగ్రహించి, ఈ కవి, గంటకు వంద సమస్యా పూరణాలు పూర్తిచేసి తన పాండిత్యాన్ని ప్రదర్శించాడట. రాజా విద్వత్ కుమార కృష్ణయాచ భూపతి విలువైన బట్టలు పెడితే, ఈ మోచర్ల వెంకన్నకవి ఆ బట్టల్ని చిన్న పీలికలుగా చింపి, "యాచమ నాయని త్యాగము గోచులకే కాక కట్టుకోకల కౌనా? రేచర్ల గోత్ర మందున నీచుండుదయించి కులము నీరుగ జేసెన్" అని తిట్టిపోశాడట.

"రాజా! విద్యారసికుడని నిన్ను దర్శించడానికి వచ్చిన ఈ మహావిద్వాంసుని అవమానించావు. అలాంటి నీ సంస్థానంలో సన్మానం స్వీకరించడం ఇష్టంలేక ఇలా చించిపోశాను" అన్నాడట వెంకన్నకవి. రాజు తన పొరబాటును ఒప్పుకొని ఆ పండితుడిని, వెంకన్ననీ సమానంగా సత్కరించాడట!

"తెట్టు కుమార కృష్ణ జగతిపర నందన! రాజ్యలక్ష్మి కింబట్టు, ధరాంగనా మణికి బాపటబొట్టు, రిపూరగాళి వాకట్టు, సముజ్జ్వల ద్యుతికి గట్టు, బుధాళికి వేల్పుజట్టు వాగ్దెట్టుల కునికి పట్టును మదీయ నివాసము యాచ భూపతీ..." అని మోచెర్ల వెంకన్నకవి వెంకటగిరి రాజాకు తనని పరిచయం చేసుకున్నట్టు ఒకచాటు పద్యం దొరుకుతోంది.

కృష్ణయాచ భూపతి 1719వ సంవత్సరంలో మరణించాడు. మోచర్ల వెంకన్న చాటు పద్యాలలో ఈ రాజా సజీవంగా జీవించే వున్నాడు. "తెట్టు" పట్టణ వైభవం, వెంకటగిరి రాజా పాలనా వైభవాలు మోచెర్ల వెంకన్న కవి వలన చిరస్థాయిగా నిలిచాయి!!

# మునగాల

బెజవాడ నుంచి హైదరాబాదు బస్సురూటులో మునగాల కన్పిస్తుంది. దీనికి రెండు మైళ్ళ దూరంలో తడవాయి అనే గ్రామం వుంది. అక్కడ మల్లికార్జున స్వామి దేవాలయంలో ప్రతాపరుద్రుడి కాలం నాటి 1300 సంవత్సరానికి చెందిన శాసనం, 1306కు చెందిన అన్నయ్యరెడ్డి శాసనం వున్నాయి.

కృష్ణా డిస్ట్రిక్ట్ మేన్యువల్‌లో ఈ రెండు శాసనాలు ప్రస్తావిస్తూ అన్నయ్యరెడ్డి మునగాల రాజ్య పాలకుడయి వుంటాడనీ, ప్రతాపరుద్రుని కాలానికే మునగాల రాజ్యాన్ని రెడ్డి వంశీకులు పాలిస్తున్నారనీ వూహించాడు.

కొండవీటి రెడ్డి రాజుల పాలనా కాలంలో మునగాల పరగణా మొఘల్ పాదుషాల ఆధీనంలోనే వుంది. స్థానిక పాలకులు రెడ్డిరాజులే అయినప్పటికీ, మునగాల పాలన నిరాటంకంగానే సాగిందనడానికి అదే హిందూరాజ వంశీకుల పాలన కొనసాగగలగడమే సాక్ష్యం.

1686లో గోల్కొండ పతనం తర్వాతే మునగాలకు ఎక్కువ కష్టాలొచ్చాయి. 1692 ఏప్రియల్ నెలలో మరాఠాసేనని తీసుకొని శివాజీ కొడుకు రామరాజు కృష్ణాతీరానికి దండు వచ్చి మచిలీపట్నాన్ని ముట్టడించాడు. ఈ మరాఠా దండుతో పిడియా నాయక్ అనే బిడారు నాయకుడు చేతులు కలిపి స్థానిక ప్రజల్ని ఇష్టారాజ్యంగా దోచుకున్నారనీ, దారిలో కన్పించిన దుకాణాల్ని కొల్లగొట్టారనీ, జమీందార్లు భూస్వాముల నుంచి పెద్దమొత్తంలో డబ్బు వసూలు చేశారనీ, డచ్ వాళ్ళు తమపై అధికారులకు పంపిన రిపోర్టు సారాంశం ఇది.

ఈ పరిస్థితుల్లో గార్లపాటి అయ్యపురెడ్డి మునగాల పాలకుడిగా వున్నాడు. ఇతనే సిద్దలూరు జమీందారీని కొనుగోలు చేసి రాజ్య విస్తరణ చేసుకున్నాడు. కీసర జమీందార్ల అమ్మాయిని తన కోడలిగా చేసుకొని ప్రశాంత వాతావరణం తన చుట్టూ నెలకొల్పుకున్నాడు.

1693లో అయ్యపురెడ్డి, అంతకుమునుపే అతని కొడుకూ మరణించడంతో కోడలు సుభద్రమ్మ మునగాల పాలనా బాధ్యతలు చేపట్టింది. మునగాల పాలకులుగా ఈమెతో ప్రారంభించి ముగ్గురు ప్రముఖ నారీమణులు మునగాల ప్రతిష్ఠను ఇనుమడింపచేశారు. స్త్రీ పాలకులు ఇతర సంస్థానులకన్నా మునగాలను భిన్నమైనదిగా తీర్చిదిద్దారు.

కీసర ముకుందప్ప సాయంగా వుండేవాడు. సుభద్రమ్మ నిస్సంతుగా మరణించడంతో ఆమె తదనంతరం కీసర ముకుందప్పే మునగాల పాలకుడిగా వచ్చాడు. కీసర హవేలీ, సిద్దలూరు మునగాల మూడింటికి పాలకుడిగా కీసర ముకుందప్ప ఔరంగజేబు నుంచి ఒక సనదు సాధించుకున్నాడు. 1723 వరకూ అతని పాలన నిరాటంకంగా సాగింది. మునగాల అప్పటినించీ కీసర వంశీకుల చేతుల్లోకి మారింది.

తలకుందప్ప తర్వాత అతని తమ్ముడు సూరన్న, సూరన్న తర్వాత పెద్దకొడుకు నరసన్నలు 1743 వరకూ పాలించారు. నరసన్న అకాల మరణం పొందడంతో అతని భార్య లక్ష్మమ్మ అధికారం స్వీకరించింది: ఈ రాణీ కీసర లచ్చమ్మారావు గొప్ప రాజనీతిజ్ఞురాలిగా బ్రిటిష్‌వారి ప్రశంసలు అందుకొన్నది.

రాణీ లచ్చమ్మారావు 1743లో రాజ్యపాలన చేపట్టేనాటికి ఉత్తర సర్కారు జిల్లాల మీద ఆధిపత్యం కోసం ఫ్రెంచి, ఇంగ్లీషు వారి మధ్య తీవ్రమైన పోరాటాలు సాగుతున్నాయి. స్థానిక జమీందార్లు అటు ఫ్రెంచివారికో, ఇటు ఇంగ్లీషు వారికో మద్దతు ఇవ్వక తప్పని స్థితి కూడా నెలకొంది. రాణీ లచ్చమ్మారావు ముందు చూపుతో వ్యవహరించి బ్రిటిష్ వారికి మద్దతు తెలపడమే కాక, సైనికపరమైన సహాయం కూడా అందించింది.

ఈ పరిణామాలలో, 1759 మే నెల 14వ తేదీన మచిలీపట్నం, కొండపల్లి, నిజాంపట్నం సర్కారుల్ని ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీకి ధారాదత్తం చేస్తూ సలాబత్ జంగ్ సంతకం చేయడంతో ఉత్తర సర్కార్ జిల్లాలు కంపెనీ పరమయ్యాయి. కృష్ణా తీరంలో బ్రిటిష్‌వాళ్ళు మొట్టమొదటిసారిగా అధికారంలోకి రావడంతో, తమకు మద్దతిచ్చిన జమీందారులకీ భూస్వాములకీ కృతజ్ఞతతో వ్యవహరించారు. మునగాల రాజ్యానికి అనేక పన్ను రాయితీలు కూడా ప్రకటించారు.

కంపెనీ పాలనలో మునగాల లాభించినా, మునగాల రాజ్యంలో అధికభాగం నైజాం రాజ్యంలోనే వుండిపోవడంతో కొంత ఇబ్బంది తప్పలేదు. శరీరం తెలంగాణా లోనూ, తలకాయి మాత్రం అప్పటి కృష్ణాజిల్లా మునగాలలోను వుండి పోయింది. స్వాతంత్ర్యా నంతరమే మునగాలని నల్గొండ జిల్లాలో చేర్చారు.

ఇంగ్లండు స్కాట్లండ్ సరిహద్దు వివాదంలా వుండేది మునగాల పరిస్థితి అని చమత్కరించాడు గోర్డాన్ మెకంజీ. లచ్చమ్మారావు తర్వాత వెంకట రామన్న, వెంకట నరసింహరాయుడు వారసులుగా రాజ్యాధికారానికి వచ్చారు. వెంకట నరసింహారావు

కాలంలో 1802లో సన్నద్ ఇ మిల్కియత్ ఇస్తిమిరార్‌ని ప్రకటించింది మునగాల జమిందారీకి కంపెనీ ప్రభుత్వం.

కృష్ణాజిల్లా కైఫీయత్తులో ఈ కీసర వంశీకుల చరిత్ర వుంది. షుమారుగా 1815 ఆ ప్రాంతాల్లో కృష్ణాజిల్లా కైఫీయత్తు రచన జరిగి వుంటుంది. అప్పటికి వేంకట నరసింహారావు ఇంకా బతికి వున్నాడు. ఆయన తర్వాత చాలా జమీందారుల్లో సహజంగా కన్పించే సంతాన రాహిత్యం, అకాలమరణం వంటి అనేక లక్షణాలు మునగాల జమీందారుల్లోనూ కన్పించాయి. 1818, 1836లలో రెండుసార్లు దత్తపుత్రులకు మెజారిటీ తీరేవరకూ కోర్టు ఆఫ్ వార్డ్సు ఆధీనంలో మునగాల రాజ్యం వుంది. 1854లో ఒక దత్తపుత్రుడు కోదండరామయ్య మరణించినప్పుడు ఆయన భార్య రుక్కమ్మ రాజ్యపాలన చేసింది. ఆమెకు ఒక్కతే ఆడపిల్ల లచ్చమ్మ కావడంతో ఈమే వారసురాలయ్యింది. తెలంగాణాలో దేశముఖ్‌గా ప్రసిద్ధుడైన నాయని వెంకట రామయ్యని ఈమె పెళ్ళాడింది. అది మొదలు మునగాల రాజ్యానికి నాయని వంశీకులు పాలకులయ్యారు.

నాయని వెంకట రామయ్య కూడా సంతానం లేకుండానే మరణించాడు. నాయని వెంకట రంగారావుని చిన్నప్పుడే దత్తత తీసుకున్నా, కోర్టు వ్యాజ్యాలు, రంగారావుకు మైనార్టీ తీరడం... అన్నీ పూర్తయి, 1900 సంవత్సరంలో కంపెనీ ప్రభుత్వం నాయని వెంకట రంగారావుని మునగాల రాజాగా గుర్తించింది.

మునగాల రాజ్యాన్ని పాలించిన రాజులందరి శ్రమ ఒక ఎత్తయితే, స్వాతంత్ర్య యోధుడిగా ఈ మునగాల రాజా సాధించిన ప్రతిష్ఠ ఇంకొక ఎత్తు.

వందేమాతరం ఉద్యమకాలంలోనూ, బిపిన్ చంద్రపాల్ బెజవాడ వచ్చినప్పుడు మునగాల రాజా నిర్వహించిన పాత్ర అపురూపమైనది. అయ్యదేవర కాళేశ్వరరావు గారి జీవిత చరిత్రలో మునగాల రాజాకు సంబంధించిన అనేక విశేషాలున్నాయి.

జారు చక్రవర్తి ఆధీనంలోని రష్యాపై తిరుగుబాటు చేసి, జపాన్ స్వాతంత్ర్యం పొందిన వీరగాధని ఆదిపూడి సోమనాధరావు తెలుగులో రాసి మునగాల రాజాకి అంకితం చేశారు.

బందరు సరస్వతి గ్రంథమాలిక, కాకినాడ ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల, మద్రాసు ఆర్య భారతి గ్రంథమాలిక, రాజమండ్రి ఆంధ్రేతిహాస పరిశోధక మండలి, హైదరాబాదు శ్రీకృష్ణ దేవరాయ ఆంధ్ర భాషా నిలయం వంటి సంస్థలు మునగాల రాజా కృషి ఫలితంగా ఏర్పడినవే! విజ్ఞాన చంద్రికా ప్రచురణల సంస్థ వ్యవస్థాపకుడుగా తెలుగులో సైన్సు, చరిత్ర గ్రంథాలు వెలువరించడానికి తొలి రోజుల్లో ఆయన చేసిన కృషి గొప్పది. తన

దివానుగా వున్న ప్రముఖ పరిశోధకులు కొమర్రాజు వెంకట లక్ష్మణరావు గారి స్మృత్యర్థం ఒక నిధిని కూడా ఏర్పాటు చేశారాయన.

తన ఇద్దరు కొడుకులు రామకృష్ణారెడ్డి, గోపాలకృష్ణారెడ్డిలకి స్వాతంత్ర్యపోరాటం చేసిన జపాను సైన్యాధిపతి "తోగో" పేరునీ, అలాగే నావికాదళాధిపతి 'నోగి' పేరునీ పెట్టుకొన్నారంటే మునగాల రాజా స్వాతంత్ర్యపోరాట కాంక్ష ఎంత బలీయమైనదో అర్థం చేసుకోవచ్చు.

మునగాల రాజాగారి పెంపుడు తల్లి నాయని లచ్చమ్మారావు మునగాలని పాలిస్తున్నప్పుడు కొమర్రాజు వెంకటప్పయ్యగారు ఎస్టేట్ మేనేజర్‌గా వుండేవారు. ఈయన అంతకుమునుపు నుంచీ అదే పదవిలో సుదీర్ఘకాలంగా వున్నారు.

లచ్చమ్మారావు భర్త నాయని వెంకటరామయ్య అకస్మాత్తుగా మరణించినప్పుడు కోర్టు వ్యాజ్యాల్లోపడి ఎస్టేట్ కార్యకలాపాలు స్తంభించి పోయాయి. దాంతో కొమర్రాజు వెంకటప్పయ్య ఎస్టేట్ మేనేజర్ పదవి వదులుకుని పెనుగంచిప్రోలు వచ్చి, అక్కడ కొంతకాలానికి మరణించాడు. ఆయనకి ఇద్దరు చిన్నపిల్లలు. అచ్చమాంబ, లక్ష్మణరావులు. ఈ ఇద్దరు పిల్లల్నీ తీసుకుని తల్లి నాగాపూర్‌లోని తన పుట్టింటికి వెళ్ళింది. తమ్ముడు భండారు మాధవరావుకు కూతురు అచ్చమాంబ నిచ్చి పెళ్ళి చేసింది. లక్ష్మణరావుని బావగారు, మేనమామ అయిన మాధవరావ్ చదివించారు. అలా సచ్చరిత్ర రత్నమాల గ్రంథం రచించిన భండారు అచ్చమాంబ 1900 సంవత్సరానికి పూర్వం స్త్రీ చైతన్యానికి కృషి చేసిన విదుషీమణి.

1900 సంవత్సరంలో నాయని వెంకటరావుని మునగాల రాజాగా ఇంపీరియల్ ప్రభుత్వం గుర్తించిన తర్వాత, ఆయన తన చిన్ననాటి స్నేహితులు కొమర్రాజు లక్ష్మణరావుని పిలిపించి, దివాను పదవిచ్చాడు. ఆయనతో కలిసి స్వాతంత్ర్య పోరాట కార్యక్రమాల్లోనూ, సాహితీపరమైన పరిశోధనల్లోనూ పాల్గొన్నారు.

బుద్ధుడి కాలంలో మునగాల పరగణా నాగరకతా విశేషాలు కల్గిన ప్రాంతంగా కన్పిస్తోంది. జగ్గయ్యపేట, ముల్కాపురం, బూదవాడ, నందిగామ, మునగాల, నేలమర్రి, ఉంద్రకోట... ఇవన్నీ ఒకనాటి బౌద్ధ క్షేత్రాలుగా స్యూయల్ గుర్తించాడు.

బౌద్ధ మహాయుగం నుంచి, బ్రిటిష్ మహాయుగం దాకా ఎప్పుడూ అనేక సంచలనాలకు కారణమైన మునగాల అలనాటి పట్టణ వైభవం తెలుగువారికీ, తెలంగాణాకు చిరస్మరణీయం.

# సత్తెనపల్లి

గుంటూరు జిల్లా సత్తెనపల్లి అలనాటి పట్టణ వైభవం మనకు 17వ శతాబ్ది నుంచీ స్పష్టంగా తెలుస్తోంది. 1707లో కొండవీడు సర్కార్‌లో ఓ అద్భుత సంఘటనతో సత్తెనపల్లి ఆధునిక చరిత్ర ప్రారంభం అయ్యింది.

ఢిల్లీ పాదుషా ఔరంగజేబు, కొండవీడు సర్కార్‌కు మజుందార్‌గా తనను నియమించినట్లు సంతకం చేసి ఇచ్చిన నియామక పత్రాలతో ఒక మరాఠా యోధుడు కొండవీడులో ప్రత్యక్షం అవడమే ఈ అద్భుత సంఘటన.

మహారాష్ట్రలోని మానూరి నుంచి తాను వచ్చాననీ, తాము మధ్వులమనీ చెప్పుకున్నాడా యోధుడు. ఆ రోజుల్లో జమీందార్లని శ్రేష్ఠిదార్లు అని కూడా పిలిచేవాళ్ళు. కాలక్రమంలో శ్రేష్ఠిదార్లనే జమీందార్లు అన్నారు. అలా మొదలయ్యింది కొండవీడు సర్కార్‌లో సత్తెనపల్లి, చిలకలూరుపాడు పరగణాలలో మానూరు వంశీకుల పాలనా చరిత్ర.

'ఇదం బ్రాహ్మ మిదంక్షేత్రం' అన్నట్లు, ఈ మానూరు యోధులు వేదవిధుల్ని నిర్వర్తిస్తూనే రాజ్యపాలనా విధులు కూడా నిర్వహించేవారని తగిన శౌర్య పరాక్రమాలు కూడా ప్రదర్శించేవారనీ తూమాటి దొణప్ప ఆంధ్ర సంస్థానములు- సాహితీ పోషణ గ్రంథంలో రాశారు- వీళ్ళని ప్రశంసిస్తూ గోల్కొండ సుల్తానుల దగ్గర సర్దార్లుగా, మొగల్ పాదుషాల దౌలత్‌లో మజుందార్లుగా, షెరిస్తదార్లుగా, దేశపాండ్యలుగా ఈ మానూరు వంశీకులు అనేక పదవులు నిర్వహిస్తూ సత్తెనపల్లి చేరి ఇక్కడ తెలుగు పాలకుల్లాగే జీవించడం మొదలుపెట్టారు. అప్పట్లో కొండవీడుని మూర్తుజానగర్ అనీ, చిలకలూరిపేటని చిలకలూరిపాడు అనీ పిలిచేవాళ్ళు. కొండవీడు సర్కార్‌లో మొత్తం 14 సమితులు, 40 హవేలీలు మానూరి వారి ఏలుబడిలో వున్నట్లు తెలుస్తోంది.

ఇదిలా నడుస్తుండగా, డెక్కన్ సుల్తాన్- వాసిరెడ్డి వారికి కొండవీడు సర్కార్‌లో మూడు వంతుల భాగాన్ని పాలించుకొనేట్లు సనదు ఇవ్వడంతో పెద్ద వివాదం మొదలయ్యింది.

రాజ్యం మొఘలు చక్రవర్తులది. డెక్కను సుల్తానులు ఔరంగజేబు ప్రతినిధులుగా పాలిస్తున్నారు. ఈ దేశముఖులు, మజుందార్‌లు డెక్కన్ సుల్తాన్‌ల దగ్గర పనిచేస్తుండేవారు. ఇప్పుడు ఒకే ప్రాంతానికి స్థానిక పాలకులుగా మొఘల్ చక్రవర్తి మానూరి వారినీ, డెక్కన్ సుల్తాన్ వాసిరెడ్డి వారినీ నియమించడంతో ఎవరి మాట చెల్లుబడి కావాలన్నది ముఖ్య సమస్య అయింది. ఈ దశలో కర్నాట నవాబు గుంటూరు వచ్చి సత్తెనపల్లి, చిలకలూరిపాడు పరగణాలను మానూరి వారికి అప్పగిస్తూ తీర్పు చెప్పాడు. 17వ శతాబ్ది చివరి వరకూ మానూరి వారి పాలనలో సత్తెనపల్లి, చిలకలూరిపాడు పరగణాలు అవిభక్తంగా వర్ధిల్లాయి.

1799లో అప్పటి జమీందారు మానూరు కొండలరావు మరణించిన తర్వాత అతని ఇద్దరు కొడుకులు సత్తెనపల్లినీ, చిలకలూరిపాడునీ చెరొక పరగణా పంచుకున్నారు. ప్రసిద్ధ కొండవీటికోట, చిలకలూరిపాడు పరగణాలో వుంది. బసాలత్ జంగ్ పాలనా కాలంలో 1750కి పూర్వం మానూరి పెదవెంకట కృష్ణమ సత్తెనపల్లిలో కట్టించిన మట్టికోట వుంది. ఇద్దరు కొడుకులు చెరోకోటనీ పంచుకొని ఏలుకోసాగారు.

1816లో సత్తెనపల్లి సంస్థానంలో ఒక దురదృష్టకర సంఘటన జరిగింది. వృద్ధాప్యంలో వున్న సత్తెనపల్లి జమీందారు వెంకట రమణారావు వారసుడిగా వున్న మనవడు మైనరైనందున తానే రాజ్యపాలన చేస్తున్నాడు. ఆయనకు సహాయకుడిగా ఇంటి అల్లుడు పత్రికృష్ణయ్య వ్యవహరిస్తూ వుండేవాడు. కొంతకాలానికి మావగారు కూడా మరణించడంతో మైనరు యువజమీందారు సంరక్షణ బాధ్యత పత్రికృష్ణయ్య పైన పడింది. ఈ పత్రి కృష్ణయ్య దుర్మార్గుడనీ, మైనరు జమీందారుకు చెడు అలవాట్లు నేర్పి బ్రిటిష్ వారి మీద తిరగబడేలా ప్రోత్సహించాడనీ అభియోగం మోపి, సత్తెనపల్లి రాజ్యం మీద సైనికచర్య ప్రకటించింది కంపెనీ ప్రభుత్వం.

నిజానికి ఇది అన్యాయమైన ప్రకటనే! ఆరోజు పత్రికృష్ణయ్య పసిపిల్లాడుగా వున్న చిన్న జమీందార్ని అంతం చేసి రాజ్యం తనదిగా ప్రకటించుకొంటే అడ్డేవాడు లేదు. కానీ, విశ్వాసం కొద్దీ అలా చెయ్యలేక పోవడం వలన చివరికి మాట పడ్డాడు. 1817లో పత్రి కృష్ణయ్య ఇంక సత్తెనపల్లి ఎస్టేట్ వ్యవహారాలు చూడడం మానుకున్నాడు. 1834లో సత్తెనపల్లి ఎస్టేట్‌ని అధికారికంగా స్తంభింప చేశారు. 1846లో పాత చాడీల పేరుతో జమీందారీని వేలంపాటకు పెట్టి ప్రభుత్వం తానే కొనేసినట్లు ప్రకటించింది. అలా ముగిసిపోయింది సత్తెనపల్లి పట్టణ వైభవం.

సత్తెనపల్లి పాలకుల్లో ఒకడైన మానూరు అప్పాజీ స్వయంగా కవి. ఆధ్యాత్మ రామాయణ పద్యకావ్యాన్ని, నృసింహ పురాణం ద్విపద కావ్యాన్ని రచించాడు.

మానూరు వెంకట గోపాలరావు అనే మరో పాలకుడు రుక్మిణీ పరిణయం, వాల్మీకీయ ప్రవేశిక, కీర్తికాంతా స్వయంవరం అనే గ్రంథాలు రచించాడు.

'సత్తెనపల్లి'ని సత్యాభామాపురిగా భావించి, అక్కడి వేణుగోపాల స్వామికి అంకితంగా తన కృతులు వెలయించాడు.

18వ శతాబ్దిలో 'శరభరాజీయం' అనే వైద్య గ్రంథాన్ని రచించిన తుళ్ళూరు శరభరాజు సత్తెనపల్లి మానూరివారి ఆస్థాన వైద్యుడిగా వుండేవాడు.

దాదాపు రెండు శతాబ్దాల పాటు రాజధాని నగరంగా వెలసిల్లిన సత్తెనపల్లి ఈనాటికీ తన వ్యాపార దక్షతనీ పట్టణ వైభవాన్ని నిలబెట్టుకొంటూ పురోగమిస్తూనే వుంది.

# కొండపల్లి

విజయవాడ నుంచి మైలవరం, తిరువూరు, భద్రాచలం వెళ్ళే బస్సు మార్గంలో తూర్పు కనుమలు బారులు తీరి కన్పిస్తుంటాయి.

కృష్ణానదికి సమీపంలో ఇబ్రహీంపట్నం దగ్గరనుంచి ఏడు పెద్ద పెద్ద పర్వత శ్రేణులు కన్పిస్తాయి. ఈ ఏడు పర్వతాలూ కంచెగా సంరక్షిస్తుండగా మధ్యలో కొండపల్లి కోట, దిగువన అలనాటి పట్టణం "కొండపల్లి" కన్పిస్తాయి. గొల్లపాలెం గుట్ట, యఱ్ఱకొండ గుట్ట, యడ్ల కొండగుట్ట ఇలా ఈ ఏడు పర్వతాల్ని వివిధ పేర్లతో పిలుస్తారు.

చారిత్రక కాలం నుంచీ, 18వ శతాబ్ది వరకూ కొండపల్లి పట్టణం ఈనాటి కృష్ణాజిల్లా భూభాగం మొత్తానికీ రాజధాని నగరంగా వుండేది. కనీసం ఒక వెయ్యి సంవత్సరాల ఘనచరిత్ర కలిగి వున్న కొండపల్లి గురించి మనకు అంతో ఇంతో అందుతోంది.

క్రీ.శ.1127లో పశ్చిమ చాళుక్య చక్రవర్తి త్రిభువన మల్లదేవుడు త్రిపురాంతకంలో ఒక శాసనం వేయించాడు. ఈ శాసనం కన్నడ భాషలో వుంది. అందులో "గోవిందరసు" కొండపల్లి మూనూరును పాలిస్తున్నట్లు పేర్కొన్నాడు. చక్రవర్తి మల్లదేవుడికి గోవిందరసు లేదా గోవింద దండనామాత్యుడు సామంతుడిగా వుండేవాడని, అతని రాజధాని కొండపల్లి అనీ, ఈ రాజ్యాన్ని మూనూరు నాడు రాజ్యం అని పిలిచేవారనీ 1127 నాటి ఈ శాసనాన్ని బట్టి మనకు అవగతం అవుతోంది.

ఈ గోవింద దండనామాత్యుడు జననాంతపురంను జయించి, కొండపల్లిని రాజధానిగా చేసుకొని పాలించినట్లు మరికొన్ని ఆధారాలు చెప్తున్నాయి. 'జననాంతపురం' అనేది ఈనాటి విజయవాడకు అప్పటి నామాంతరం కావచ్చని కొందరు పరిశోధకుల అభిప్రాయం.

కాకతీయులు కొండపల్లిని ఆక్రమించేనాటికి "మంచికొండ విషయం" అని పిలిచేవారు ఈ ప్రాంతాన్ని. మంచికొండ ఏది అనే దానిమీద పరిశోధకుల్లో ఏకాభిప్రాయం లేదు. కొందరు కొండవీడుని, మరికొందరు కోటప్పకొండనీ ఈ 'మంచి కొండ'గా ఊహించారు. ఏమైనా కాకతీయుల కాలం నుంచి ఇది కొండపల్లిగానే ప్రసిద్ధి చెందింది. కొండపల్లినాడు, కొండపల్లి రాజ్యం, కొండపల్లి దండపాట ఇలాంటి పేర్లతో ఆ తర్వాతి కాలంలో కొండపల్లి సీమగా పిలవబడింది.

మొదటి కాకతి రుద్రదేవుడు త్రిపురాంతక దేవుడి అంగరంగభోగాలకు కొండపల్లినాడులో, కృష్ణవేణి తీరంలో "రేవూరు" అనే గ్రామాన్ని ధారాపూర్వకంగా దానం ఇచ్చినట్లు త్రిపురాంతకంలోనే తెలుగులో ఒక శాసనం రాయించాడు.

కాకతీయుల తర్వాత రెడ్డిరాజుల ఏలుబడిలోకి కొండపల్లి వెళ్ళింది. పెదకోమటి వేమారెడ్డి తన సోదరుడు మాచారెడ్డిని ఈ కొండపల్లికి పాలకుడిగా నియమించినట్లు బలిజేపల్లి శాసనంలో వుంది. 1360లో అనవేమారెడ్డి కొండపల్లి కొండమీద కోటని దృఢతరం చేయడంగాని, కొత్తగా నిర్మించడం గానీ చేశాడు.

కళింగ గజపతులు కొండవీడుని జయించి, కొండపల్లి కోటని స్వాధీనం చేసుకున్నారు. కపిళేశ్వర గజపతి 27 సంవత్సరాలు కొండపల్లి కేంద్రంగా కృష్ణాతీరాన్ని పాలించాడు. కపిళేశ్వర గజపతి, విద్యాధర గజపతులు సుదీర్ఘకాలం పాలించిన రాజులు. కపిళేశ్వర గజపతి పేరుతో ఉయ్యూరు దగ్గర కపిళేశ్వరపురం, విద్యాధర గజపతి పేరుతో బెజవాడ దగ్గర విద్యాధరపురం, పైడమ్మ, ముత్యాలమ్మల పేర్లతో పైడూరుపాడు, ముత్యాలంపాడు, భార్య భవానమ్మ పేరుతో భవానీపురం ప్రాంతాలు వెలిశాయి. 1476-77లో గుల్బర్గా సుల్తాన్ మహమ్మద్‌షా, అతని మంత్రి ఖాజా మహ్మద్ గవా కొండపల్లి కోటని ఆక్రమించి, ఇక్కడి ప్రసిద్ధ శివాలయాన్ని ధ్వంసం చేసి హిందువులను నరికి చంపారు.

1516లో కృష్ణరాయలు కనీసం రెండు నెలలకు పైగా శ్రమించి కొండపల్లి కోటని స్వాధీనం చేసుకోగలిగాడు. మధ్యలో విరామంలో శ్రీకాకుళం వెళ్ళి ఆంధ్ర మహావిష్ణు దేవాలయాన్ని సందర్శించాడు. అక్కడే ఆముక్తమాల్యద రచనకు శ్రీకారం చుట్టినట్లు రాసుకున్నాడు కృష్ణదేవరాయలు.

రాయలు తర్వాత కొండపల్లి గోల్కొండ సుల్తానుల పరం అయ్యింది. హసన్‌ఖాన్ గోల్కొండ రాజప్రతినిధిగా కొండపల్లిని పాలించాడు. 1550-80 మధ్య కాలంలో ఇబ్రహీం కుతుబ్‌షా కొండపల్లి కోటని పటిష్టపరిచాడు. ఈ మాలిక్ ఇబ్రహీం తెనుగు ప్రజల అభిమానం చూరగొన్న పాలకుడు. ఇతన్ని "మల్కిభరాముడు" అని కీర్తించేవాళ్ళు. కోటకు దగ్గరగా కొమటిపేట అనే ప్రాంతాన్ని పట్టణంగా మార్చి దాన్ని తన పేరుతో ఇబ్రహీం పట్నంగా వ్యవహరించాడు. 1900నాటి బ్రిటిష్ రికార్డుల్లో ఈ ఇబ్రహీంపట్నాన్ని "ఇభరాంపురం"గా పిలుస్తున్నట్లు వుంది.

హైదరాబాదు నగర నిర్మాత కులీకుతుబ్‌షా 1580-1612 మధ్య కాలంలో కొండపల్లి పట్టణానికి దగ్గరగా ఒక నుయ్యిని తవ్వించాడు. ఈ నుయ్యి ప్రస్తుతం విజయవాడ థర్మల్ స్టేషన్ స్థలంలో వుంది. ఈ నూతి నీరు మక్కాలోని 'జంజం' జలంతో సమానం అనీ, ఎదురుగా కన్పించే రెండు కొండలూ మక్కాలోని సఫా, మార్వా పర్వతాలతో సమానం అనీ,

కొండపల్లి మహ్మదీయుల పుణ్యక్షేత్రం కావాలనీ ఆయన ఆశిస్తూ ఈ నూతి గట్టున ఒక శాసనం వేయించాడు. ఈ శాసనం పురావస్తు శాఖ ఆధీనంలో వుంది ప్రస్తుతం.

గోల్కొండ సామ్రాజ్యానికి ఆఖరి పాలకుడు తానీషా, ఔరంగజేబుకు బందీగా చిక్కాడు. తర్వాత, కొండపల్లికి సాహెబ్ సింగ్‌ని కిల్లాదార్‌గా నియమించాడు ఔరంగజేబు. 1707లో మొఘల్ చక్రవర్తుల పాలన కూడా అంతరించింది. కొన్నాళ్ళు స్థానిక జమీందారులు, పాలించిన తర్వాత, నిజాం ఏలుబడిలోకి కొండపల్లి వెళ్ళింది.

1766లో బ్రిటిష్‌వాళ్ళు జనరల్ కల్లాడ్ నాయకత్వంలో కొండపల్లి కోటని ముట్టడించి స్వాధీనం చేసుకున్నారు. 1767 నుంచీ, 1859 వరకూ ఇంగ్లీషువారు ఈ కోటలో సైనిక శిక్షణా కేంద్రం నడిపారు. 1890 నాటికి బ్రిటిష్‌వారికి కోటలు మొహం మొత్తాయి. ప్రత్యేకమైన యుద్ధాలు లేవు కాబట్టి, కోటల అవసరం కూడా వాళ్ళకి లేకుండా పోవడంతో ఆనాటి కృష్ణా కలెక్టర్ కోటల మీద రిపేర్ల కోసం ఖర్చు పెట్టవద్దని ఆదేశించాడు. శిథిలావస్థలో వున్న వాటిని ధ్వంసం చేయవలసిందిగా కూడా ఆజ్ఞాపించాడు. ఒకప్పటి చరిత్ర ప్రసిద్ధ నగరాల్లో పాలనా వైభవాన్ని నడిపించిన కోటలన్నీ కనుమరుగై పోవడానికి ఇది ముఖ్యకారణం!!

కొండపల్లికి అంతర్జాతీయ ఖ్యాతిని తెచ్చిపెట్టిన మరో అంశం కొండపల్లి బొమ్మలు. తెల్ల పొనికి చెట్ల కర్రతో ఈ బొమ్మల్ని చేస్తారు. రాజస్థాన్, మధ్యప్రదేశ్‌ల నుంచి వచ్చి ఆర్య క్షత్రియులు ఈ బొమ్మల తయారీపైనే కొన్ని తరాలుగా జీవిస్తున్నారు. కొండపల్లిలో కలంకారీ పరిశ్రమ కూడా ఒకప్పుడు ప్రసిద్ధి. మచిలీపట్నం, కొండపల్లి, పాలకొల్లు, శ్రీకాళహస్తి నగరాలు కలంకారీ వస్త్రాన్ని ఎగుమతి చేసేవారు. కలంకారికైనా, చెక్క బొమ్మలకైనా వాడుకునే రంగుల్ని వనమూలికలతో ఈ చిత్రకారులు స్వంతంగా తయారు చేసుకోవడం ఇక్కడి ప్రత్యేకత.

గజపతులు నిర్మించిన శ్రీ గిరి వీరేశ్వర స్వామి దేవాలయం, చెన్నకేశవ రామాలయం, ఖిల్లాపైన హజరత్ గలే షహీద్ దర్గాలు ప్రసిద్ధి చెందిన ప్రార్థనా స్థలాలు.

కొండపల్లి రసకర్పూరం, ఇక్కడి పర్వత లోయల్లోని వన మూలికలు శ్రేష్ఠమైనవిగా పేరొందాయి. రాష్ట్రానికి విద్యుత్తు వెలుగులు అందించడానికి తమవంతు పాటుపడ్తున్న విజయవాడ థర్మల్ స్టేషన్, లాంకో విద్యుత్ కర్మాగారాలు కొండపల్లి కీర్తిని శాశ్వతం చేస్తున్నాయి.

# తెనాలి

తెనాలి పేరు తలచుకొంటే 'ఆంధ్ర పారిస్' అనే మాట గుర్తుకొస్తుంది.

చక్రపాణి, శారద, కొడవటిగంటి వంటి ఆధునిక కవులు నడిచిన నేల గుర్తుకొస్తుంది. తెనాలి రామకృష్ణకవి, పిల్లలమర్రి పినవీరభద్రుడు, ఖగోళ శాస్త్రవేత్త పిల్లలమర్రి పూర్ణయ్య సిద్ధాన్తి వంటి చారిత్రాత్మక వ్యక్తులు తెనాలిలో నిర్మించిన చరిత్ర గుర్తుకొస్తుంది.

ఇక్కడి రామలింగేశ్వర స్వామి దేవాలయం అతి ప్రాచీనమైన శైవక్షేత్రంగా తెనాలికి గుర్తింపు తెచ్చింది. అయితే, చరిత్రకారుల్లో కొంతమంది ఇది బౌద్ధమతానికి చెందిన క్షేత్రారామం అనీ, కొంతమంది జైనమతానికి చెందిన దేవాలయం అనీ భావిస్తున్నారు. జైనక్షేత్రమే అయినట్లయితే, తెనాలి బహుశా గుంటూరు జిల్లాలోనే అతి ప్రాచీన పట్టణం అయ్యేందుకు అవకాశం వుంది.

ఒకప్పుడు కృష్ణానది, తెనాలి తాలూకాలోని మున్నంగి మీదుగా రేపల్లె తాలూకాలోని దిండి, దివి తాలూకాలోని అడవుల దీవిని దాటి బంగాళాఖాతంలో కలిసేదని ఒక వివరణ వుంది. నిజానికి కృష్ణానది అనేక పాయలుగా సముద్రంలో కలుస్తుంది. ఒకప్పుడు ఈ పాయ కూడా వుండేదనీ, బహుశా కాలవశంలో అది అంతరించిపోయి వుంటుందనీ అంటారు. పెద్ద వరదలొచ్చినప్పుడు మున్నంగి దగ్గర కట్ట తెంచుకుని వరదనీరు ఈ మార్గానే పరవళ్ళు తొక్కడం ఇందుకు సాక్ష్యం.

ఇలా అంతరించిపోయిందని భావిస్తున్న ఈ నదీ పరీవాహక ప్రాంతంలో ఐదు పుణ్యక్షేత్రాలున్నట్లు చావలిలో దొరికిన ఒక శిథిల శాసనంలో వుంది. చావలి, పెరవలి, తెరవలి పేర్లు మాత్రమే ఇందులో కన్పించాయి. మిగతా రెండు శైవక్షేత్రాల పేర్లు చెరిగిపోయాయి. వీటిలో "తెరవలి" క్షేత్రాన్నే తెనాలి అంటున్నారని పండితులు భావిస్తున్నారు.

అంటే, తెనాలిని ఒకప్పుడు 'తెరవలి' అని పిలిచేవారన్నమాట. కానీ, 14-15 శతాబ్దాల కాలం నించే 'తెనాలి' పేరు వ్యవహారంలో వున్నట్లు తెలుస్తోంది.

తెనాలి రామలింగేశ్వర దేవాలయంలో ఉత్సవ విగ్రహాల పాదాల మీద ఒక సంస్కృత శ్లోకం రాసి వుంది.

శ్రీ తెనాలి వ్యరాజయత్  
గార్లపాడు పురరామ పండితః  
శుక్లమాఘసిత పంచమి గురౌ  
రామలింగ ముమయోత్సవకృతిమ్ -

అనే ఈ శ్లోకంలో, గార్లపాటి రామపండితుడనే తెనాలి పురప్రముఖుడు, కవి శుక్ల మాఘసిత పంచమి గురువారం నాడు అంటే, క్రీ.శ.1509లో ఈ ఉత్సవ విగ్రహాలను చేయించినట్లుంది.

ఈ గార్లపాటి రామపండితుడి గురించి తెనాలి రామకృష్ణ తన పాండురంగ మహాత్మ్యం కావ్యంలో ఆయన తన మేనమామగా వివరించాడు. తెనాలి అగ్రహారికుడని కూడా రాశాడు. కొందరు చరిత్రకారులు తెనాలి రామలింగేశ్వరుడి పేరున మేనమామ గారింట పెరిగిన తెనాలి రామలింగకవి, వైష్ణవమత ప్రియుడైన కృష్ణదేవరాయలి ఆస్థానంలో చేరిన తర్వాత తెనాలి రామకృష్ణుడిగా మారాడని అంటారు. అయితే, కృష్ణదేవరాయలు అష్టదిగ్గజాల్లో తెనాలి రామలింగడు వున్నాడా లేదా అనే విషయంలో చాలా వివాదాలున్నాయి. అది వేరేసంగతి!

1883లో కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్ రాసిన గోర్డాన్ మెకంజీ తెనాలి గురించి నాలుగు మాటలు రాస్తూ, మొదట ఆనాటి డిప్యూటీ తాసిల్దార్ కార్యాలయం గురించి ప్రస్తావించాడు. ఇంతకన్నా నీచ నికృష్టమైన ప్రభుత్వ కార్యాలయాన్ని ఇండియాలోనే ఎక్కడా చూడలేదని రాశాడు. తెనాలి డిప్యూటీ తాసిల్దార్ అంతగా కడుపు మండించిన తప్పు ఏంచేశాడో తెలీదు. అంతటి ప్రసిద్ధి చెందిన తెనాలికి మాత్రం మెకంజీ ఈ చిన్న వ్యాఖ్యతో పెద్ద అపకీర్తిని రికార్డు చేశాడు.

"తెనాలి చందోలు మధ్య రాగిరేకు శాసనాలు అనేకం వున్నాయి. ఒక మంచి ఆర్కియాలజిస్ట్ కోసం ఈ ప్రాంతం ఎదురు చూస్తోంది" అంటాడు మెకంజీ!

ఆధునిక యుగంలో కృష్ణానది నించి తవ్విన ఒక కాలువ అనేక మురుగు కాల్వల్ని, పంట కాలువల్నీ దాటుకొంటూ నిజాంపట్నం పెడుతుంది. దానిపైన నిర్మించిన వంతెన దాటిన తర్వాత గుంటూరు రేపల్లె రైలుమార్గం కోసం ఇక్కడ తెనాలి రైల్వేస్టేషన్ కట్టారు. ఊరుకు దూరంగా కట్టినప్పటికీ, ఈ రైలుస్టేషన్ దగ్గర కొత్తగా జనావాసాలు ఏర్పడడం మొదలుపెట్టాయి. అప్పటి కృష్ణాజిల్లా కలెక్టర్‌గా వున్న "మారిస్" పేరుతో ఈ కొత్త జనావాసానికి మారిస్ పేట అని పేరు పెట్టారు.

1904లో కృష్ణాజిల్లాలోంచి గుంటూరు మండలాన్ని విడదీసి గుంటూరు జిల్లాని ఏర్పరిచిన తర్వాత, తెనాలి దశ తిరిగినట్లయ్యింది. రైల్వే లైన్ అభివృద్ధి చెంది, తెనాలి మార్కెట్ కేంద్రంగా ఎదిగింది. అప్పటివరకూ రేపల్లె నిజాంపట్నం ఓడరేవు వాణిజ్యకేంద్రంగా వుండేది. 1880 తర్వాత రేపల్లె సముద్ర తీరంలో మార్పులొచ్చి మెరకతేలి సముద్రంలోతు తగ్గిపోవడంతో ఓడలు నిజాంపట్నం రేవుకు రావడం ఆగిపోయాయి. అది మొదలు తెనాలి వాణిజ్య కేంద్రం అయ్యింది. ఆంధ్రా పారిస్‌గా వినుతికెక్కింది. తాలూకా ముఖ్యపట్నం అయ్యింది. ఊరు బాగా విస్తరించింది. గుంటూరు తర్వాత జిల్లాలో ప్రసిద్ధ నగరంగా ఎదిగిన తెనాలి అలనాటి పట్టణ వైభవం ఈనాటికీ కాంతులీనుతూనే వుంది!!

# అద్దంకి

నాగార్జున సాగరం దగ్గర వున్న శ్రీ పర్వతం తూర్పు కొస మొదలుకొని, నెల్లూరు దగ్గర బంగాళాఖాతం వరకూ గల ప్రాంతాల్లో గుండ్లకమ్మనది ప్రవహిస్తూ వుంటుంది. ఈ గుండ్ల కమ్మకు ఇరువైపులా వున్న ప్రాంతాన్ని 'పూంగినాడు' అని పిలిచేవాళ్ళు. ఈ పూంగినాటికి ఒకప్పుడు 'అద్దంకి' రాజధానిగా వుండేది.

అద్దంకి, నెల్లూరు, ఉదయగిరి, కందుకూరు ఈ నాలుగు ప్రాంతాల చరిత్ర అద్దంకి చరిత్రతో ముడిపడి నడుస్తుంది. కందుకూరు, కంభం, దర్శి, ఒంగోలు, చేజెర్ల... ఇవన్నీ అద్దంకి చరిత్రలో భాగంగానే కన్పిస్తాయి.

తనకు నద్దంకి దగు రాజధానిగాఁ బ
రాక్రమంబున బహు భూను లాక్రమించి
యనుజ తనుజ బాంధవ మిత్ర జనులకిచ్చె
నెదురె యెవ్వారు వేమ మహీశ్వరునకు

అని ఎఱ్ఱన హరివంశంలో ప్రోలయ వేమారెడ్డి గురించి ప్రశంసించాడు.

అద్దంకిలో నేలమీద కట్టిన పటిష్టమైన కోట వుంది. ఆ రోజుల్లో నేల కోటల కన్నా కొండ మీద కట్టిన కోటలు ఎక్కువ సురక్షితంగా వుండేవి. అందుకని కొండవీడు గిరి దుర్గాన్ని పటిష్టపరిచి, ప్రోలయ వేమారెడ్డి పెద్దకొడుకు అనపోతారెడ్డి అద్దంకి నుంచి రాజధానిని కొండవీడుకి మార్చేవరకూ అద్దంకి చారిత్రక వైభవంగా గొప్పగా నడిచింది.

గజపతుల కాలంలో ఒంగోలు, బాపట్ల పరిసర ప్రాంతాల్ని "అద్దంకి దండపాట" అని పిలిచారు.

కొండవీటి రెడ్డిరాజుల కాలంలో నెల్లూరు, ఒంగోలు జిల్లాలో కొన్ని ప్రాంత్రాల్ని "అద్దంకి సీమ" అని వ్యవహరించినట్లు అనేక శాసనాల్ని బట్టి తెలుస్తోంది. కొన్ని శాసనాల్లో 'అద్దంకి స్థలం' అనే మాట కూడా వాడుకలో కన్పిస్తుంది. రెడ్డిరాజులు పల్నాడుని 14 సీమలుగా విభజించారు. అందులో అద్దంకి మొదటిది.

చారిత్రక అంశాలతో కొద్దిపాటి పరిచయం వున్న ఎవరికైనా అద్దంకి అనగానే 'పండరంగడి అద్దంకి శాసనం' గుర్తుకొస్తుంది. ఈ అద్దంకి శాసనానికి కొన్ని ప్రత్యేకతలున్నాయి.

1. ఇది తెలుగు పద్యాలతో రాసిన శాసనాలలో మొదటిదిగా భావిస్తారు. నన్నయకన్నా కనీసం రెండువందల యాభై సంవత్సరాల పూర్వకాలం నాటి శాసనం.

2. పండరంగడి అద్దంకి శాసనం, చాళుక్య భీముడి ధర్మవరం శాసనాలు తెలుగు పద్యాలలో దొరికాక, నన్నయగారి కన్నా ముందు నాటి తెలుగు సాహిత్యం గురించిన ఒక అవగాహన ఏర్పడింది. తెలుగుసాహిత్య చరిత్ర వెయ్యేళ్ళకన్నా పూర్వకాలం నాటిదని గ్రహించగలిగారు.

ఈ పండరంగడు, వేంగిని రాజధానిగా పాలిస్తున్న గుణగ విజయాదిత్యుడి సేనాని. క్రీ.శ.848-892 మధ్యకాలంలో 45 ఏళ్ళపాటు విజయాదిత్యుడు బెజవాడ రాజధానిగా పరిపాలించాడు. పండరంగడు అతనికి నమ్మకమైన సేనాని. పరమ మహేశ్వరుడు. అతనే స్వయంగా నడిపించుకొంటూ బోయరాజులకు చెందిన 12 కోటల్ని జయించి, ఆ విజయానికి గుర్తుగా అద్దంకి పంద్రంగంలో ఒక శివాలయాన్ని నిర్మించాడు. అక్కడ వేసిన శాసనం ఇది.

కట్టెంపూడి, చుండి ఇవన్నీ దట్టమైన అరణ్యప్రాంతాలుగా వుండేవి. నెల్లూరు పరిసరాల్లో ప్రసిద్ధ బోయకొట్టాలు అంటే ఇవే! కొట్టం అంటే, కోట! దేశం లేదా రాజ్యం అని కూడా అర్థం కావచ్చు.

బోయలకు చెందిన 12 రాజ్యాల్ని పండరంగడు జయించాడు. కట్టెపు దుర్గం అంటే, కట్టెంపూడిని నేలమట్టం చేశాడు. కందుకూరుని బెజవాడ గావించాడు... ఇలా అద్దంకి శాసనంలో చెప్పుకున్నాడు పండంగడు. "కట్టెంపు దుర్గంబు గదు బయల్సేసి కందుకూర్బెజవాడ గావించె మెచ్చి-" అని వుంది ఈ శాసనంలో!

పండరంగడు బెజవాడని పాలిస్తున్న గుణగ విజయాదిత్యుడి ఆజ్ఞలకు లోబడి, అతని ప్రతినిధిగా అద్దంకి సీమని పాలించాడు. బహుశా కందుకూరుని రాజధానిగా చేసుకొని వుంటాడు. కందుకూర్బెజవాడ గావించె అనడంలో అర్థం కందుకూరుని రాజధాని చేసుకున్నాడనడమే కావచ్చు.

ధర్మవరం తెనుగు శాసనంలో ఈ పండరంగడి యుద్ధశైలిని రాస్తూ, "కన్నరా భూపతి వెన్నాజిలో జూసె" అని వుంది. కన్నారాభూపతి వెన్నుని పండరంగడు యుద్ధంలో చూశాడట. అంటే, ఓడిపోయి కన్నరాభూపతి వెనక్కి తిరిగి పారి పోయాడని అర్థం. నన్నయకన్నా పూర్వమే శాసనాల్లో కూడా ఇంత చక్కని కవిత్వం కనిపించడంతో నన్నయకు ముందు కవిత్వం లేదనేవాళ్ళ కళ్ళు తెరుచుకున్నాయి. తెలుగు భాష వెయ్యేళ్ళ కన్నా చాలా పూర్వపునాటిదనే వాదనకు బలం చేకూర్చాయి ఈ అద్దంకి, ధర్మవరం శాసనాలు.

అద్దంకి, కందుకూరుల గురించి చెప్పుకునేప్పుడు ప్రబంధ పరమేశ్వరుడు ఎఱ్ఱాప్రెగడ నడిచిన భూమిగా స్మరించుకోవడం మరిచిపోకూడదు. ఎఱ్ఱనకవి పాకనాటిలో గుడ్లూరుకు చెందినవాడు. అది ఇప్పుడు కందుకూరు దగ్గర వుంది. ఇది మన్నేఱు ఒడ్డున వుందని వెన్నెలకంటి సూరన పేర్కొన్నాడు.

ఎఱ్ఱాప్రెగడ తండ్రి సూరన. ఈయన కాలం నుంచీ రెడ్డి రాజులతో ఎఱ్ఱన గారి కుటుంబానికి సంబంధం వుంది. రెడ్డి రాజ్యాన్ని వ్యవస్థాపించిన ప్రోలయ తండ్రి వేమారెడ్డి, ఆయన తండ్రి మల్లారెడ్డి ఎఱ్ఱన గారి పూర్వీకుల నుంచీ సిరిసంపదలిచ్చి గౌరవించారు. వీళ్ళు కాకతీయులకు సామంతలుగా ఈ అద్దంకి సీమను ఏలుకొంటున్న ప్రభువులు- ఆ రోజుల్లో.

కాకతీయల కాలంలో పల్నాడుకు చెందిన అనేకమంది వీరులకు సేనాధిపత్యం ఇచ్చి గౌరవించారు. వీళ్ళని నాయక శబ్దంతో పిలిచేవారు. ఈ నాయకులు 75 మంది ఆంధ్ర ప్రాంతంలో ఏకమై మహమ్మద్ బీన్ తుగ్లక్ మీద తిరుగుబాటు చేసి విజయం సాధించారు. ఆ తర్వాత 75 మందీ తమ తమ ప్రాంతాలకు రాజులుగా ప్రకటించుకున్నారు. వీరిలో ప్రోలయనాయకుడు అద్దంకిని రాజధానిగా చేసుకుని రెడ్డి రాజుల మహా సామ్రాజ్యాన్ని వ్యవస్థాపించాడు. అతని తర్వాత వేమారెడ్డి అధికారంలోకి వచ్చాడు. చుట్టూ వున్న నాయక రాజ్యాల్ని, బోయల మన్నేల్ని జయించి సామ్రాజ్య విస్తరణ ప్రారంభించాడు.

తనకు నద్దంకి తగు రాజధానిగాఁ బరాక్రమంబున
బహుభూములాక్రమించి,
యనుజ తనుజ మిత్రజనులకిచ్చె నెదురెయెవ్వారు
వేమ మహీశ్వరునకు?

అని ఎర్రన హరివంశం ఉపోద్ఘాతంలో వేమారెడ్డి గురించి ప్రశంసించాడు.

రెడ్డిరాజులు, పాలిస్తున్న కాలంలో విజయనగర సామ్రాజ్యం సంగమ వంశీకులతో ఒక రూపాన్ని పొందింది. హరిహరరాయలు పూర్వ పశ్చిమ సముద్రాధీశుడని బిరుదు పొందాడు. 1543 నాటికి పెన్నానది దాటి కనిగిరి కందుకూరు దాకా విజయనగర రాజ్యం విస్తరించింది. కర్నాటరాళం అనేవారు ఈ ప్రాంతాన్ని. బోయమన్నేలన్నీ విజయనగర రాజులకు, రెడ్డి రాజులకు మధ్య యుద్ధ భూములుగా వుండేవి. కంపరాయలు విజయనగర రాజుగా అధికారంలోకి వచ్చాక ఉదయగిరి పెద్ద పట్టణం అయ్యింది. కందుకూరు అద్దంకిల ప్రాధాన్యత తగ్గింది.

1464లో కపిలేశ్వర గజపతి విజయనగర రాజుల్ని ఈ ప్రాంతం నుంచి పారద్రోలాడు. అందుకు ప్రతీకారంగా, 1513లో కృష్ణరాయలు అద్దంకి కందుకూరుల్ని గెలిచి, ఉదయగిరి ఆరవీటి రాజులకు పాలించుకునే అధికారం ఇచ్చాడు.

1585లో కుతుబ్‌షాహీల స్వాధీనం అయ్యింది అద్దంకి. కానీ, వెంకటపతి రాయలు 1589లో దీన్ని తిరిగి ఉదయగిరిలో కలిపాడు. అప్పటినించీ 1688లో ఔరంగజేబుకు స్వాధీనం అయ్యేవరకూ నూరేళ్ళ పాటు అద్దంకి సీమ ఉదయగిరి రాజుల చేతుల్లోనే వుంది. కృష్ణనించి కావేరిదాకా వరుసపెట్టి రాజ్యాలన్నీ ఔరంగజేబు సేనాని జుల్ఫిఖర్ ఖాన్ గెలుచుకెళ్ళాడు. ఆ తర్వాత 1792 వరకూ నిజాం ఏలుబడిలోనూ, 1801 వరకూ ఆర్కాట్ నవాబు కిందా వుండి, 1801లో బ్రిటిష్ వారి ఆధీనం అయ్యింది. ఆ తర్వాత వారికి తిరగగలిగే అవసరాలేవీ అద్దంకిలో లేకపోవడంతో అద్దంకి అలనాటి పట్టణ వైభవం క్రమేణా కనుమరుగైపోయింది!

# చేజెర్ల

గుంటూరు జిల్లాలో చేజెర్ల ప్రసిద్ధ శైవక్షేత్రం. అత్యంత ప్రాచీనమైన శివాలయం అలనాటి చేజెర్ల వైభవానికి సాక్షిగా ఇక్కడ నిలబడి వుంది. కూర్చున్న ఏనుగు ఆకారంలో ఈ శివాలయం వుంటుంది. ఇందులోని ఈశ్వరుణ్ణి కపోతేశ్వరుడు అంటారు. క్రీస్తుశకం 3వ శతాబ్దానికన్నా ముందునాటి గుడి ఇది.

ఈ ప్రాచీన దేవాలయంలో దొరికిన శాసనాలలో ఆనందగోత్రికులకు సంబంధించిన శాసనం పురాతనమైంది. పల్లవరాజు సత్మంభామల్లుడు ఈ ఆనందగోత్ర రాజవంశీకుల అమ్మాయిని వివాహం చేసుకున్నాడు. అతనికి సంబంధించిన శాసనం అది. వాతాపి చాళుక్యులు వేంగి రాజ్యాన్ని పాలిస్తున్న కాలం నాటిది. రెండవ పులకేసి క్రీ.శ.610-642 మధ్యకాలంలో వేంగిలో చాలా శక్తివంతమైన రాజ్యనిర్మాణం చేశాడు. క్రీ.శ.617లో పల్లవరాజు సత్మంభామల్లుడు ధాన్యకటకం దగ్గర ఈ వాతాపి చాళుక్యులతో పోరాడి ఓడిపోయాడు. అక్కడితో పల్లవులతో పాటు ఆనంద గోత్రికుల పాలన తెలుగు నేలమీద అంతరించి తూర్పు చాళుక్యులు వేంగి పాలకులుగా స్థిరపడ్డారు.

చేజెర్ల చరిత్రకు సంబంధించినంత వరకూ ఆనంద గోత్రికుల విశేషాలే ఎక్కువ అవసరం. క్రీ.శ.3వ శతాబ్దిలో పలనాడులో కొంత భాగాన్ని ఆనందగోత్రికులైన బౌద్ధులు! కనీసం 300 ఏళ్ళపాటు పాలించారు. నిజానికిది చాలా చిన్నరాజ్యం. కానీ, చరిత్రలో వీరికి సముచిత స్థానం వుంది. కందరుడు ఈ రాజ్యవంశ స్థాపకుడు. అపర మహాశైల బౌద్ధ సిద్ధాంతానికి చెందిన ప్రబోధకుడు బౌద్ధాచార్యుడైన ఆచార్య భదంత ఆనందుడుకి ఈ కందరుడు శిష్యుడు.

ఈ గురువు పేరునే తొలితరం బౌద్ధరాజులు ఆనంద గోత్రికులుగా ప్రసిద్ధులైనారని చరిత్రకారులు భావిస్తారు. కందరపురం వీరి రాజధాని.

శ్రీశైలం, శ్రీపర్వతం, కోటప్పకొండ అంటే, త్రికూటపర్వతం ఈ మూడుకొండల నడుమ భాగంలో ఆనంద గోత్రీకుల రాజ్యం వున్నదని ఒక శాసనంలోంది. శ్రీశైలం, నాగార్జున కొండల సంగతి అలా వుంచితే, ఈ ఆనంద వంశీకుల్ని త్రికూటాధిపతులని పిలిచేవారు. కాబట్టి, కోటప్పకొండ, నరసరావు పేట పరిసరాలలో వీరి రాజధాని నగరం కందరపురం అయ్యేందుకు అవకాశం వుంది. కపోత కందరపురం అనే పేరు కూడా శాసనాలలో అక్కడక్కడ కన్పిస్తుంది. కందర, కపోత కందర అనేవి బౌద్ధ ధర్మాలకు సంబంధించిన పదాలు.

ఈ సాక్ష్యాల ఆధారంగా చేజెర్ల ఆనంద గోత్రికుల రాజధాని నగరం కపోత కందరపురం కావచ్చునని కొందరు పండితుల ఊహ. రెండవ ఆనంద గోత్రికుడు దామోదర వర్మ క్రీ.శ.295-315 మధ్యకాలంలో రాజ్యపాలన చేశాడు. ఈయన చేజెళ్ళలో బుద్ధునిపేర్న ఒక చైత్యారామాన్ని నిర్మించి వుంటాడని భావిస్తున్నారు.

వైదికధర్మాలు పాటించేవారికి రామాయణ భాగవత భారతాలు ఎలా పవిత్రగ్రంథాలో, అలాగే బౌద్ధ ధర్మాలు పాటించేవారికి జాతకథలు, వాటిలోని పాత్రలు అంతే పవిత్రమైనవి.

దానకర్ణుడిగా ప్రసిద్ధుడైన శిబిచక్రవర్తి కథ బౌద్ధ జాతక కథలలోనిదే! తనను శరణుజొచ్చిన పావురాన్ని కాపాడడానికి వేటగానికి ఆ పావురం బరువుతో సమానమైన మాంసాన్ని తన తొడలోంచి కోసి ఇచ్చిన కథ అందరికీ తెలుసు. బౌద్ధారామాల్లో చాలాచోట్ల ఈ కథకు సంబంధించిన శిల్పాలు చెక్కినవి కన్పిస్తాయి. శిబిచక్రవర్తి, పావురం బౌద్ధులకు ముఖ్యమైన పాత్రలు. ఈ పావురం పేరుతోనే కందరపురం కపోతకందరపురం అయ్యింది.

రానురానూ బౌద్ధమత ప్రాబల్యం తగ్గిపోవడంతో ఈ ఆనంద గోత్రికులు కూడా శైవులుగా మారారు. అత్రివర్మ కపోత బౌద్ధారామాన్ని జీర్ణోద్ధరణ చేసి, శివలింగాన్ని ప్రతిష్ఠించి ఉంటాడని చరిత్రకారులు భావిస్తున్నారు. పిండీశ్వరుడని ఈ శివుణ్ణి వ్యవహరించినట్లు శాసనాధారాలున్నాయి. కానీ, పిండీశ్వరాలయం కూడా శిథిలావస్థకు చేరుకున్నప్పుడు రెండవ కందర రాజు మళ్ళీ జీర్ణోద్ధరణ చేసి, కపోతేశ్వర లింగాన్ని వ్యవస్థాపించాడు.

చేజెర్ల చరిత్రతో ఆనంద గోత్రీకులు, పల్లవులు, విష్ణుకుండినుల చరిత్ర ముడిపడి సాగింది. ఆనంద గోత్రీకుల్ని బౌద్ధంలోంచి శైవంలోకి విష్ణుకుండినులు మరల్చివుంటారని, పల్లవరాజులు మరింత ప్రోత్సహించారని మనం ఒక అంచనాకు రావచ్చు. వెంకేశ్వరుడు, పిండీశ్వరుడు, కపోతేశ్వరుడు ఇలా ఇక్కడి శివుణ్ణి వివిధ కాలాల్లో వివిధ పేర్లతో వ్యవహరించినట్లు శాసనాధారాలు తెలుపుతున్నాయి. క్రీ.శ.617లో కుబ్జ విష్ణువర్ధనుడు వాతాపిచాళుక్య లేదా తూర్పు చాళుక్య రాజుగా వేంగి రాజ్యానికి పాలకుడిగా పట్టాభిషేకం చేసుకున్నాడు. ఆ తర్వాత ఈ దేవాలయం కపోతేశ్వర దేవాలయంగా ప్రసిద్ధి చెందింది.

కృష్ణదేవరాయలు ఈ దేవాలయ భూములపై పన్నులు మినహాయించినట్లు చేజెర్లలో ఒక శాసనం తిమ్మరుసయ్య పేరుతో వుంది. చేజెర్ల, బిట్టలపురం, కపోతపురం గ్రామాలలో ఈ దేవాలయభూములకు పన్ను మినహాయింపునిచ్చారు.

చేజెర్లలో కోటి లింగాలుండేవని భక్తుల నమ్మకం. పొలాలు దున్నేప్పుడు రైతులకు చాలా లింగాలు దొరికేవిట! ఈ దేవాలయం ప్రక్కన మల్లికాగుండం అనే పుష్కరిణి

వుంది. ఒకప్పుడు దీన్ని ఓంకార నది అనేవాళ్ళు. అటు కోటప్పకొండ, ఇటు చిలకలూరిపేటల వైపు ఈ నది ఏరులా ప్రవహిస్తుంది. 'ఓగేరు' అంటారు దీన్ని.

ఒకప్పుడు ఈ ఆలయం వెలుపలి ప్రాకారం దగ్గర 20 గజాల విస్తారమైన పెద్దచెట్టు వుండేదని, అనేక రకాల మొక్కలు శాఖలు ఈ చెట్టు నుంచి వుండేవని, రకరకాల మొక్కలు కలిసిపోయి ఒకే మొక్కగా ఎదిగినట్లుండేదనీ అందుకని, 'పేరు లేని పెద్దమాను' అనే వారని "గుంటూరు మండల సర్వస్వం" గ్రంథంలో వుంది. 1925లో ఈ మహామాను గాలివానకు ఒరిగిపోయిందిట.

చేరుంజర్ల, చేంజెర్ల అనే నామాంతరాలు కూడా తరువాతి కాలపు శాసనాలలో చేజెర్లకున్నట్లు కన్పిస్తున్నాయి.

ప్రతాపరుద్రుడి కాలంలో దేవాలయ పోషణకు చేజెర్లని దానంగా ఇచ్చినట్లు ఒక శాసనంలో వుంది. ఇక్కడ మొత్తం 9 శాసనాలు దొరికాయని అంటారు. ఈ కపోతేశ్వరాలయం చుట్టూ, 78 శివాలయాలు, 28 నందులు, 62 దుర్గాదేవి విగ్రహాలు 10 భైరవ విగ్రహాలు 21 వీరశైవుల విగ్రహాలూ ఉన్నట్లు కూడా శాసనాధారాలు చెబుతున్నాయి. ఈ సంఖ్యలో కొంత అతిశయోక్తి వుండేందుకు అవకాశాలున్నప్పటికీ, 'చేజెర్ల' ఖచ్చితంగా ఒక మహాపట్టణం అంత విస్తారంగా వుండేదని మనం తేలికగా ఊహించవచ్చు. అదీ, చేజెర్ల అలనాటి పట్టణ వైభవం!!

# కొణకంచి

కృష్ణాజిల్లా జగ్గయ్యపేట సమీపంలో కొణకంచి మొన్నటిదాకా ఒక శివారు గ్రామం. కానీ, వెయ్యి సంవత్సరాలనాడు చక్రం తిప్పిన ఘనచరిత్ర 'కొణకంచి' కుంది. జగ్గయ్యపేట నేషనల్ హైవే మీద నుంచి వేదాద్రికి వెళ్ళే మార్గంలో కొణకంచి గ్రామం వుంది. దాని అలనాటి పట్టణ ప్రాభవాన్ని పరిశీలిద్దాం.

చాలాకాలం గుండబోయిన పాలెంకు ఇది శివారు గ్రామంగా వుండేది. 1957లో దీన్ని ప్రత్యేక గ్రామంగా గుర్తించారు. ఈ గ్రామానికి నైరుతి దిక్కున "శ్రీరాములు పంటచెరువు" ఈ గ్రామ ప్రజల దాహార్తి తీర్చేందుకు ఉపయోగిస్తోంది.

కొణకంచి గ్రామంలో అనేక ప్రాచీన శాసనాలు దొరికాయి. హనుమాలయంలో దొరికిన ఒక శాసనంలో ఈ వూరు పేరు "కొండకంచి" అని వుంది. "శా కాబ్దే గజతర్క భేనుగణి తౌ శ్రీ కొండకంచీ స్థితః" అని! శ్రీశైలం నుంచి, కృష్ణానది పరీవాహక ప్రాంతం వెంబడి ఒకటే పర్వత వరుస నదికి కంచెలా వుందని, ఆ పర్వతం రెండో కొన ఈ వూరి దగ్గర వుంది కాబట్టి ఇది 'కొనకంచి' అయ్యిందట! కొనగిరి నంటివున్న ఊరు ఇది.

108 కంచిక్షేత్రాల్లో ఈ వూరు కూడా ఒకటి. కాబట్టి 'కొనకంచి' అనే పేరుతో సార్థకమైనట్లు ఈ వూరి ప్రజలు విశ్వసిస్తారు. 'కొండకంచి' కూడా ఇలానే ఏర్పడిన పదం కావచ్చు.

క్రీ.శ.806-846 మధ్య వేంగి రాజ్యాన్ని తూర్పు చాళుక్య ప్రభువు రెండో విజయాదిత్యుడు పాలించాడు. అతను 108 సార్లు శత్రుమూకల మీద దండెత్తి తన రాజ్యాన్ని సుస్థిరం చేసుకున్నాడనీ, 108 యుద్ధాలలో జరిగిన జననష్టానికి బాధ్యత వహిస్తూ, ఆ పాప పరిహారార్థం 108 శివాలయాలు నిర్మించి, వాటిని కంచిక్షేత్రాలుగా పేర్కొన్నాడనీ చరిత్రకారులు భావిస్తారు. కొనకంచిలోని శివాలయం అలా ఏర్పడినదే నంటారు. ఈ విజయాదిత్యుడికే నరేంద్ర మృగరాజు అనే బిరుదు వుండేది. కొణకంచిలో శివుణ్ణి ఈయన పేరున రాజరాజనరేంద్ర స్వామి వారని, శ్రీ కంతేశ్వరుడని కూడా పిలుస్తుంటారు. విజయాదిత్యుడి పేరునే విజయవాడకు ఆ పేరు వచ్చి వుంటుందని మరికొందరు చరిత్రకారుల నమ్మకం.

క్రీ.శ.1146లో రాజేంద్రచోళుడు 60 మివర్తనల భూమి కొండకంచి శ్రీ కంతేశ్వరుడికి దానం ఇచ్చినట్లు ఇక్కడ దొరికిన ఒక శాసనంలో వుంది.

ఇదే కాలంలో అనేకమంది 'త్యాగి' వంశపురాజులు నందిగామ సీమలో కొంత భాగాన్ని పాలించారు. 1199లో నరసింహ వర్ధన త్యాగి పోతరాజు, కాకతీయ గజపతితో సంధి చేసుకొని సంబంధం కలుపుకొన్నాడు. ఈ త్యాగి పోతరాజు కొనకంచి శివాలయానికి చాలా దానాలు ఇచ్చి దేవాలయాన్ని అభివృద్ధి చేశాడు. ఈయనే ముక్త్యాలలో

ముక్తేశ్వరాలయం కట్టినట్లు శాసనాధారాలు చెప్తున్నాయి. కాకతి ప్రతాపరుద్రుడు స్వయంగా వచ్చి కొనకంచి శివాలయానికి భూరిదానాలిచ్చి నట్లుంది.

కొణకంచిలో ప్రసిద్ధ నారాయణాలయం, బ్రహ్మాలయం కూడా వుండేవని అక్కడ దొరికిన కొన్ని శాసనాల ఆధారంగా తెలుస్తోంది. ఇప్పుడు రెండు దేవాలయాలూ లేవు. ఈ దేవాలయాలకు "శ్రీమతు బెజవాడ తెలికి వేవుర కులుండైన కుట్టిశెట్టి దీపమాలలు సేయించె-" అని శాసనాలలో వుంది.

1833లో గోర్డాన్ మెకంజీ కృష్ణా డిస్ట్రిక్ట్ మేన్యువల్‌లో నందిగామ తాలూకాకు కృష్ణానదికి మధ్యనున్న గ్రామాల గురించి వివరిస్తూ 'కొనకంచి'ని ప్రస్తావించాడు. కొనకంచికి బ్రిటిష్ పాలనా కాలంలో కనకంచి అనే వ్యవహారనామం వుండి వుండవచ్చు. అక్కడ పురాతనమైన కోట ఒకటి శిధిలావస్థలో వుందనీ, అందులో నాలుగు శిలాశాసనాలున్నాయనీ రాజేంద్ర చోళుడి దానశాసనాలు అవి అనీ పేర్కొన్నాడు.

ఆ రోజుల్లో "కొంగర మల్ల" అనే బందిపోటు స్థావరం ఇక్కడ వుండేదిట. అందుకని కొనకంచి రోడ్డువైపుకు రావడానికి జనం భయపడే వారిని మెకంజీ పేర్కొన్నాడు.

కాకతి ప్రతాపరుద్ర దేవుడికీ కొణకంచికీ చాలా సంబంధం వుంది. మహమ్మద్ బీన్ తుగ్లక్ సైనికులకు పట్టుబడిన ప్రతాపరుద్రుణ్ణి ఢిల్లీకి తరలించేందుకోసం గోదావరి దాటిస్తున్నారట. ఆయన ఆస్థానకవి విద్యానాథుడు ఒక సామాన్య పౌరుడి రూపంలో నదిలో నిలబడి తనని మొసలి పట్టుకొన్నట్లు నాటకం ఆడి ఆ సైనికులు వచ్చి తనను రక్షించేలా అరవడం మొరలుపెట్టాడట. ఆవిధంగా విద్యానాథుడు నెమ్మదిగా ప్రతాపరుద్రుడిని బంధించిన పడవలో చేరి, రహస్యంగా ఆయన నుంచి రాజముద్రికని తీసుకొని రాజధానికి వెళ్ళడం విద్యానాథుడి లక్ష్యం. సైనికులకు ధన్యవాదాలు చెప్పుకొని పడవలోంచి ఒడ్డెక్కి ఓరుగల్లు ప్రయాణం అయ్యాడు. దారిలో కొణకంచి గ్రామం వచ్చాడట. కొణకంచి గ్రామ కరణం ఆయనకు ఆశ్రయం ఇచ్చి, ఓరుగల్లు సురక్షితంగా చేరే ఏర్పాటు చేసినట్లు ఒక ఐతిహ్యం వుంది. క్రీ.శ.1268లో కాకతీయ సామ్రాజ్యానికి మంత్రిగా పనిచేసిన "నాగయ గన్నమంత్రి కూడా ఇక్కడ శివాలయానికి భూరిదానాలు చేశాడు. శాసనాలలో కన్పించిన 'గన్నమల' ఈయనేనని కొందరు చరిత్రకారుల ఊహ.

ఈ కొనకంచి పట్టణ వైభవాన్ని చవిచూసినదే!! జాతీయోద్యమ కాలంలో కొనకంచి గ్రామం మంచిపాత్ర పోషించింది. కొణకంచి చక్రధరరావు, కాకుమాను వెంకట నర్సయ్యలు తొలితరం స్వాతంత్రయోధులు.

చారిత్రకంగా ఒకనాడు ఒక వెలుగు వెలిగిన పట్టణాలు కొన్ని వాటి అస్థిత్వాన్ని నిలుపుకోగా, కొన్ని సింధునాగరకత కాలం నగరాల మాదిరి భూమిలో నిక్షిప్తం అయిపోయాయి. కొణకంచి... ఒక కుగ్రామంగా నిలిచి వుంది... ఇంకా తన ఒకనాటి అస్థిత్వపు అవశేషాల్ని అరచేతిలో పుచ్చుకొని!!

# తోట్లవల్లూరు

కృష్ణాజిల్లాలో తోట్లవల్లూరు ఈ రోజున ఒక మామూలు గ్రామీణ ప్రాంతం. కానీ, ఒకప్పుడు ఇది వల్లూరు జమీందార్ల రాజధాని నగరం! తోటలు ఎక్కువగా వున్న వల్లూరు కాబట్టి తోట్లవల్లూరు అన్నారు. వల్లూరు దీని అసలు పేరు. సారవంతమైన భూమి. బంగారం పండుతోందన్నంత ప్రసిద్ధి. కృష్ణాజిల్లాలోని ధనిక గ్రామాలలో ఇదొకటి.

18-19 శతాబ్దాలలో బ్రిటిష్ పాలనా కాలంలో ఈ వల్లూరు పట్టణ వైభవాన్ని చవిచూసింది. 1800 సంవత్సరానికి పూర్వం ఇది మొదట నూజివీడు జమీందారీలోనూ, ఆ తర్వాత దేవరకోట అంటే, చల్లపల్లి జమీందారీలోనూ వుండేది. 1800 సంవత్సరం తర్వాత బొమ్మదేవర నాగన్ననాయుడు ఈ వల్లూరునీ, బందరు బెజవాడ ఏలూరు తాలూకాల్లోని మరికొన్ని గ్రామాల్ని కొనుక్కొని, వాటికి వల్లూరుని రాజధానిగా చేసుకొని పాలించాడు. బ్రిటిష్‌వాళ్ళ లెక్కప్రకారం- ఈ వల్లూరు జమీందార్లు చిన్న జమీందార్లే అయినప్పటికీ అత్యంత ధనికులట! 1883లో కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్‌లో గోర్డాన్ మెకంజీ వీళ్ళ గురించి రికార్డు చేశాడు.

బొమ్మదేవర నాగన్న బ్రిటిష్ ఆర్మీలో రవాణా శాఖలో మొదట కార్మికుడిగా చేరి మేస్త్రీ స్థాయికి ఎదిగాడు. క్రమేణా రవాణా కాంట్రాక్టులు చేయడం మొదలుపెట్టి నమ్మకమైన రావాణాదారుడిగా బ్రిటిష్‌వారి ప్రశంసలు పొందాడు.

1798-99లో టిప్పుసుల్తాన్‌తో బ్రిటిష్‌వారు ముఖాముఖీ యుద్ధానికి తల పడ్డప్పుడు ఈస్టిండియా కంపెనీ సైనిక పటాలాల్ని, వాళ్ళకు కావలసిన యుద్ధ సామగ్రిని, ఆహారపదార్థాల్ని మైసూరుకు ఆఘమేఘాల మీద రవాణా చెయ్యవలసి వచ్చింది. బొమ్మదేవర నాగన్న దగ్గర వున్న రవాణా యంత్రాంగం గొప్పది. ఇప్పటి లాగా లారీలు, గూడ్సు వేగన్లు లేకపోయినా ఎడ్లబండ్లతోనూ, గుర్రపు బండ్ల తోనూ సమయానికి సకాలంలో వస్తువులు చేర్చి సహకరించాడు. బ్రిటిష్‌వాళ్ళు గెలిచారు. మైసూరు నగరాన్ని స్మశాన వాటికగా మార్చేశారు. గెలిచిన ఉత్సాహంతో ఊరంతా నిలువు దోపిడీ చేశారు. ఈ దోపిడీలో బొమ్మదేవర నాగన్నకు పెద్ద వాటానే లభించింది. తిరిగి వచ్చేటప్పుడు బండ్ల నిండా డబ్బు సంచులు తెచ్చుకొన్నాడని ప్రజలు కతలుగా చెప్పుకున్నారు.

1803లో శిస్తు బకాయి పడ్డ కొన్ని హవేలీ గ్రామాల్ని బ్రిటిష్ వాళ్ళు వేలానికి పెట్టారు. ఈ వేలంలో తోట్లవల్లూరునీ, గూడూరునీ కొనుగోలు చేశాడు నాగన్న. జమిందారు

అనిపించుకున్నాడు. తన జన్మస్థలం అయిన తోట్లవల్లూరుని రాజధానిగా ప్రకటించాడు. అక్కడ ఒక కోటని కట్టించుకున్నాడు.

ఈయన రవాణా చాతుర్యానికి సాక్ష్యం ఏమంటే మచిలీపట్నం నుంచి హైదరాబాద్ వైపు, రాజమండ్రి వైపు, చెన్నపట్నం వైపు వెళ్ళడానికి ఆయన దగ్గర 1500 గుర్రపుబళ్ళు, 5000 ఎడ్లబళ్ళూ వుండేవి. ప్రతిరోజూ సర్వీసు వుండేది. వెళ్ళే బళ్ళు వెళ్ళేవి, వచ్చే బళ్ళు వచ్చేవి. హైదరాబాద్‌కి కేవలం 15 రోజుల్లో సరుకును గమ్యానికి చేర్చి, మళ్ళీ అక్కడి నించి 15 రోజుల్లో తిరిగి వచ్చేవి.

వసంత వాడ, కొప్పాక, నారాయణపురం, దురదపూడి గ్రామాల్ని కూడా కొనుక్కొని తన జమీందారీలో కలుపుకొన్నాడు.

నాగన్న తర్వాత అతని మనుమడు రాజా ఇమ్మడి నాగన్న జూనియర్ 1842లో జమీందారయ్యాడు. 1857 సిపాయిల తిరుగుబాటు జరిగినప్పుడు ఈ జూనియర్ నాగన్న తాతగారిని మించిన చొరవచేసి బ్రిటిష్‌వారికి సాయపడ్డాడు. సిలోన్ నుంచి రాయల్ రెజిమెంట్ బందరు దాకా ఓడలో వస్తే, బందరు నుంచి వాళ్ళని కాలిబాటన సురక్షితంగా మద్రాసుకు తరలించగలిగాడు. ఆయనకి స్వర్ణ కంకణం తొడిగి దుశ్శాలువాతో సత్కరించింది ఇంపీరియల్ బ్రిటిష్ ప్రభుత్వం.

1867లో జూనియన్ నాగన్న మరణించాడు. నరసింహనాయుడు జమిందా రయ్యాడు. ఈయన స్వంత ఖర్చుతో భీమడోలు దగ్గర ఏలూరు కాలువ పైన రైలు, రోడ్డు వంతెన నిర్మించాడట. 1875లో మద్రాస్‌కు ప్రిన్స్ ఆఫ్ వేల్స్ వచ్చినప్పుడు ఈ వల్లూరు యువజమిందార్ని తన పక్కన కూర్చోబెట్టుకొని ఊరేగాడట– ఆ బ్రిటిష్ యువరాజు.

1900 సంవత్సరంలో వారసుల పంపకం వలన వల్లూరు జమిందారీ ఉత్తర వల్లూరు దక్షిణ వల్లూరుగా విడిపోయాయి. ఈ వంశీకుల్లో భాష్యకాట్ల నాయుడు జమిందారు సాహితీపోషకుడు. వావిళ్ళ రామస్వామి శాస్త్రులును ఆర్థికంగా ఆదుకొని వావిళ్ళ ప్రచురణలు ముందుకు సాగడానికి తోడ్పడ్డాడు.

ఈ బొమ్మదేవర వారిది పట్నాల గోత్రం. వీళ్ళ ఇంటి అసలుపేరు ఎడ్లవారు. ఎడ్లనాగన్న ఈస్టిండియా కంపెనీలో రవాణా కాంట్రాక్టర్‌గా వున్న రోజుల్లో సుంకర గురవయ్య శ్రేష్ఠి మచిలీపట్నంలో దుబాషీగా వుండేవాడు. ఆయనకి రావిపాటి బ్రహ్మన్న అనే వైదిక పండితుడు స్నేహితుడిగా వుండేవాడు. ఎడ్లనాగన్న ఈ ఇద్దరికీ నమ్మకమైన అనుచరుడు.

మైసూరులో టిప్పుసుల్తాన్‌తో యుద్ధం ముగిసి, రత్నాల రాసుల్ని మూటకట్టి బండ్లకెత్తుకుని నాగన్న వల్లూరుకు తిరిగి వచ్చేసరికి కాలవశాన గురువు గురవయ్యగారు

స్నేహితుడు బ్రహ్మన్న ఇద్దరూ మరణించారట. ఆ ఇద్దరి మీదా ప్రేమతో, వాళ్ళ జ్ఞాపకంగా 'బ్రహ్మన్న దేవర' అని తన ఇంటి పేరు మార్చుకున్నాడు. ఈ బ్రహ్మన్నదేవర ఇంటిపేరే. వాడుకలో బొమ్మదేవర అయ్యిందని డా॥ తూమాటి దొణప్ప ఆంధ్ర సంస్థానాలు సాహిత్య పోషణం అనే గ్రంథంలో రాశాడు.

నూరేళ్ళ పాటే వెలుగొందినప్పటికీ, తోట్లవల్లూరు జమీందార్లు రవాణా కాంట్రాక్టర్లుగా కోట్లు గడించారు. గడిచిందంతా విలాసాలకే వెచ్చించారు. ఈస్టిండియా కంపెనీ పాలనా కాలంలో నుంచి, ఆ తర్వాత బ్రిటిష్ మహారాణి ఇంపీరియల్ పాలనా కాలంలోనూ తోట్లవల్లూరు మంచి ప్రశస్తిలో వుండేది. ఎప్పుడూ వచ్చిపోయే బళ్ళతో కళకళలాడుతూ వుండేది. రహదారులు గానీ, వంతెనలు గానీ లేని ఆ రోజుల్లో వాగులూ, వంకలూ, అడవులూ దాటి సరుకు రవాణా చెయ్యగలగడం ఒక గొప్ప సాహసం. దాన్ని కృష్ణాజిల్లాలో ఒక మారుమూల పల్లెటూరు వ్యక్తి సాధించగలగడం విశేషం. అందుకు ప్రభుత్వం దగ్గర మెప్పు పొందే విధంగా ప్రవర్తించడం ఒక అవసరం. సాయపడ్తున్నట్లు కన్పిస్తూనే తమ అభివృద్ధిని సాధించుకోగల నేర్పు ఈ వల్లూరు జమీందార్లకుండేదిట. 20వ శతాబ్దం వచ్చిన తర్వాత ఈ రాజవంశీకులు విలాసాలకు అలవాటుపడి, వ్యాపారాన్ని నిర్లక్ష్యం చేశారు. ఆ కారణంగా ఆ అలనాటి వైభవం అంతరించి పోయింది. ఒకనాడు కళకళలాడిన తోట్లవల్లూరు ఈనాడు మామూలు గ్రామం అయిపోయింది.

# విస్సన్నపేట

కృష్ణా తీరంలో నూజివీడు తిరువూరులకు మధ్య విస్సన్నపేట ఒకప్పుడు వరిగొండ వంశీకుల పాలనలో రాజధాని నగరంగా వుండేది.

గోల్కొండ ప్రభువుల పాలనాకాలంలో 1700 సంవత్సరానికి పూర్వం ముస్తఫానగర్ అంటే, కొండపల్లి సర్కారులో జమ్మలవాయ పరగణాకి వెల్లంకివారూ, వరిగొండ వారూ ఉమ్మడి దేశ పాండ్యాలుగా వుండేవారు. ఆ తర్వాత ఈ పరగణా మొత్తాన్ని వరిగొండ వారికిచ్చి వాళ్ళని శాశ్వత కౌలుదార్లుగా చేశారు. 1800 సంవత్సరం మొదలయ్యేనాటికి ఈ శాశ్వత కౌలుని వరిగొండవారు దక్కించుకోగలిగారు.

అప్పటికి జమ్మలవాయి పరగణాలో 14 ఎస్టేట్లుండేవి. విస్సన్నపేట ఎస్టేట్ వాటిలో ఒకటి. వరిగొండ వారు విస్సన్నపేటని రాజధానిగా చేసుకొని పాలించుకోసాగారు.

వరిగొండ నీలంరాజు అనే వైదికుడు విస్సన్నపేట జమీని పాలించిన వరిగొండ వంశీకులకు మూలపురుషుడు. నీలంరాజు తర్వాత 13 తరాలు గడిచాయి. 14వ తరం వాడు వరిగొండ రామన్న కాలంలో శాశ్వతకౌలు హక్కులు లభించాయి. ఈయనకు సంతానం లేకపోవడంతో దూరపు బంధువుల కుర్రవాడు రమణప్పని దత్తు తీసుకున్నాడు. ఏలూరుకు చెందిన చావలి వెంకట సుబ్బయ్య గారి అమ్మాయి లక్ష్మీదేవమ్మని ఇచ్చి వివాహం చేశాడు. వీళ్ళు చావలి వారు కాదనీ, కావలి వారనీ, ఇంగ్లీషులో 'కా' అనడానికి 'C' అనే అక్షరాన్ని వాడడం చేత చావలి వారిగా వ్యవహరించబడ్డారనీ గోర్డాన్ మెకంజీ కృష్ణాడిస్ట్రిక్ట్ మేన్యువల్‌లో వీళ్ళ వివరాలిస్తూ ఈ వ్యాఖ్య చేశాడు.

లక్ష్మీదేవమ్మ అన్నగారు చావలి వెంకట బొర్రయ్య అప్పటికే చాలా ప్రసిద్ధుడు. ఆయన కల్నల్ మెకంజీతో కలిసి గ్రామ చరిత్రలు అంటే కైఫీయత్తులు తయారుచేస్తున్న రోజులవి. ఆయన ముగ్గురు తమ్ముళ్ళు సీతయ్య, లక్ష్మయ్య, రామస్వామి అందరూ ప్రభుత్వోద్యోగులే! సంపాదనపరులు, పలుకుబడి కల్గినవారూ కావడంతో జమీందారీ కుటుంబంతో వియ్యం అందగలిగారు. ఇక్కడి వరకూ కథ బాగానే నడిచింది.

1810లో దత్తత కొచ్చిన యువ జమీందారు రమణప్ప మరణించాడు. మరణించిన ఈ రమణప్ప కొత్తగా వివాహితుడు కావడం వలన అతనికి సంతానం లేదు. ఆయన మరణించేనాటికి ఎస్టేట్ పరిస్థితి కూడా అంతంత మాత్రం అయ్యింది.

ఈస్టిండియా కంపెనీ ప్రభుత్వానికి డబ్బు చాలా బకాయి వుండడంతో ఈ సంస్థానాన్ని కైవసం చేసుకునే దురాలోచనని బ్రిటిష్ వాళ్ళు చేస్తుండగా జమీందారు మరణించాడు. మరణించబోయేముందు అతని బంధువులు బలవంతంగా ఒక పిల్లవాణ్ణి దత్తత చేయించారు. స్పృహ లేని స్థితిలో అతను తీసుకున్న దత్తత చెల్లదని అతని భార్య లక్ష్మీదేవమ్మ ఎదురు తిరిగింది. కంపెనీ పాలకులు ఆమెకు మద్దతుగా నిలబడ్డారు. ఎస్టేట్ పాలనని లక్ష్మీదేవమ్మకి అప్పగించారు.

కంపెనీకి చెల్లించవలసిన బకాయిలు చెల్లించి జమీందారీని స్వాధీనం చేసుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది లక్ష్మీదేవమ్మకి. అంత డబ్బు ఆమె దగ్గర స్థిరంగా లేకపోవడంతో, ఆమె అన్నగారు సీతయ్య ఆ మొత్తాన్ని చేబదులుగా సర్దాడు. నిజానికి అది పెద్దమొత్తం. తన కొడుకుని ఆమె దత్తత తీసుకోవడానికి అంగీకరించిన మీదటే ఈ పెట్టుబడిని పెట్టాడు అన్నగారు సీతయ్య. ఇక్కడితో ఆ కథ సుఖాంతం కావాలి నిజానికి.

కానీ, ఎస్టేట్లను కాపాడుకోవడానికి నిస్సంతువులుగా వున్న జమీందార్లు, రాజులు తీసుకొనే దత్తతలు చెల్లవని బ్రిటిష్ వారు ఒక చట్టాన్ని తెచ్చి, జమీందారు మరణించగానే రాజ్యాన్ని కైవసం చేసుకోవడం ప్రారంభించిన రోజులవి. ఝాన్సీ లక్ష్మీబాయి తన రాజ్యాన్ని కాపాడుకోవడానికి ఈ కారణంగానే ఎదురుతిరిగి పోరాడింది.

ఇప్పుడు లక్ష్మీదేవమ్మ పరిస్థితి కూడా అదే అయ్యింది. మేనల్లుడి దత్తత చెల్లదని 1838లో కోర్టు తీర్పు చెప్పింది. దత్తత రద్దయ్యింది. అన్నగారు సీతయ్యకు డబ్బు పోయింది. దత్తత దక్కలేదు. తన డబ్బు తనకి వడ్డీతో సహా తిరిగి ఇచ్చేయ్యాలని చెల్లెలి మీద కోర్టుకెక్కాడు సీతయ్య. 1867దాకా ఈ కోర్టు కేసు నడుస్తూనే వుంది. రెండు పక్షాలకూ చాలా డబ్బు కోర్టు ఖర్చుల కిందే వ్యయం అయిపోయింది. ఏ దశలోనూ రాజీకి రావడానికి రెండు పక్షాలూ అంగీకరించలేదు.

ఈ కేసు ఇలా నడుస్తుండగా, జమీందారీని తన చిన్నన్నయ్య చావలి లక్ష్మయ్యకు రాసి ఇవ్వడానికి లక్ష్మీదేవమ్మ సిద్ధపడింది. అందుకు వరిగొండ వంశీకులైన భర్త తరఫు బంధువులు అంగీకరించక కోర్టు కెక్కారు. కోర్టు, లక్ష్మీదేవమ్మకు అనుకూలంగా తీర్పునిచ్చింది. లక్ష్మయ్యకు జమీందారీ దక్కింది. ఇన్ని కష్టాలూ పడినా రెండో అన్నగారు సీతయ్యకు మాత్రం ఈ విషయంలో శూన్యహస్తమే మిగిలింది!

చావలి లక్ష్మయ్య తర్వాత అతని కొడుకు నారాయణరావు అతని తర్వాత అతని కొడుకు వెంకటపతి రావులు జమీందార్లుగా వచ్చారు. వెంకటపతిరావు పెళ్ళయిన ఏడాదిలోపే,

సంతానం లేకుండా మరణించడంతో, అతని తరఫు బంధువుల్ని ట్రస్టీలుగా పెట్టి, ఒక చారిటబుల్ ట్రస్ట్‌ను ఏర్పాటు చేశారు. ఈ ట్రస్టు పాలనని బ్రిటిష్ ప్రభుత్వం ఆమోదించలేదు. అప్పుడు, అన్ని విధాలా నష్టపోయిన సీతయ్య గారి మనవడు రాజేశ్వర రాయుడికి జమీందారీ దక్కింది. విధి ఇన్ని నాటకాలు ఆడింది విస్సన్నపేట రాజవంశీకుల జీవితాలతో!

1886 వచ్చేసరికి ఈ జమీందారీ పూర్తిగా అప్పుల్లో కూరుకుపోయింది. కోర్టు వ్యాజ్యాల్లోనే నలిగిపోయిన ఆర్థికవ్యవస్థ, అపసవ్య పాలన కారణంగా మరింత కృంగి పోయింది. ఈ దశలో ప్రభుత్వానికి కట్టవలసిన సొమ్ము చెల్లించి, ఏలూరుకు చెందిన స్థితిమంతులు 'మోతే' వారు విస్సన్నపేట జమీందారీని కొనుకున్నారు.

మోతే వారి స్వాధీనంలోకి వెళ్ళిన తర్వాత విస్సన్నపేట కొంతమేర కళకళలాడిందనే చెప్పాలి. మోతే గంగరాజు, మోతే నారాయణ రావులు ఈ వంశీకుల్లో ప్రసిద్ధులు.

మోతే గంగరాజుకు రావుబహద్దర్ బిరుదు వుండేది. తన షష్టిపూర్తి నాడు తులాభారం తూగి దానధర్మాలు చేశాడట. బందరు జాతీయ కళాశాల, కన్యకా పరమేశ్వరి ఉన్నత పాఠశాలలకు భూరి విరాళాలిచ్చాడు. 'మోతే వంశ్యుఁడు గంగరాజ ధనవన్ముఖ్యుండు సద్దాత..." అని తిరుపతి వేంకటకవులు ఆయన్ని ప్రశంసించారు. మోతే నారాయణరావు స్వాతంత్ర్య పోరాటం తొలిదశలో, సంస్కరణోద్యమాల్లో పాల్గొన్నాడు. ఆంధ్ర నాటక కళాపరిషత్తు వ్యవస్థాపకుల్లో ఒకడు. తిరుపతి వేంకట కవులు ఆంధ్రీకరించిన మృచ్ఛకటికం నాటకాన్ని ప్రదర్శింపచేశాడు.

కాలక్రమంలో విస్సన్నపేట కాలప్రవాహంలో కలిసిపోయింది. దాని రాజధాని నగర వైభవం అంతరించిపోయింది. ఇప్పుడది మామూలు మండల కేంద్రంగా నిలిచి వున్నదంతే!!

# పెందోట

క్రీ.శ.16వ శతాబ్దపు సామాజిక పరిణామాల నేపథ్యంలో రూపొందిన రాజధాని నగరం 'పెందోట'. విశ్వకర్మ కులస్థులకు ఇది క్రీస్తుపూర్వం చివరి శతాబ్దాల నుంచీ పవిత్ర క్షేత్రం కూడా! వేదవేత్తలైన మహా శిలాచార్యులకి ఆలవాలమైన గొప్ప పట్టణంగా చరిత్రకారులు భావిస్తారు. ఈ మహాశిల్పులే అమరావతి బౌద్ధ చైత్యం శిల్పాల్ని, నాగార్జునకొండలో బౌద్ధ శిల్పాల్ని చెక్కి వుంటారని వీరి భావన.

విశ్వకర్మ పురాణంలో పెందోట ప్రస్తావన వుంది. మయ బ్రహ్మ తన కుమార్తె సంజ్ఞాదేవిని సూర్యుడికిచ్చి ఈ నగరంలోనే వైభవోపేతంగా వివాహం చేసినట్లు ఇందులో వర్ణించడం జరిగింది.

పెందోట నగరం గుంటూరు జిల్లాలో నాగార్జున కొండకి ఎనిమిది మైళ్ళ దూరంలో కృష్ణానది ఒడ్డున వుంది.

ధవళేశ్వరం మార్కండేయాచార్యులు మార్కండేయ ప్రభువుగా ప్రసిద్ధుడు. ఈయన గోల్కొండ రాజ్యపాలకుడు మహమ్మద్ ఖులీకుతుబ్‌షాకి కుడిభుజంగా వ్యవహరించి అనేక యుద్ధాల్లో విజయాలు సాధించడానికి తోడ్పడ్డాడని పెందోట రాజవంశీకుల చరిత్రని వర్ణించిన కావ్యాల ఆధారంగా తెలుస్తోంది.

కోటయే వీటికి మేటియై మిక్కిలి
    చూపట్టు చక్కని చుట్టుగట్టు
క్రీడాద్రులే పురికిని సప్తకుల పర్వ
    తములును మేరు మందర నగరములు
బొడ్డన బావులే పుట భేదనంబున,
    కమృతాబ్ధి ముఖ్య రత్నాకరములు
రవి సోమ వీధులే రాజధానికిఁ బ్రసి
    ద్ధిగను నేబదియారు దేశములును
పరమగునట్టి పెందోట పురవరమున
కధిపతి శిరోవతంసమై యలరె, సకల
కళల ధవళేశ్వర పుర విఖ్యాతుడైన
గురుతర యశోధనుండు మార్కొండు ఘనుడు

అనే పద్యం వలన ఈ పెందోట నగరం పర్వతాల మధ్య వుందనీ, చుట్టూ వున్న పర్వతాలే పెట్టని కోటగా ఒప్పి వున్నాయని, సూర్యచంద్రులే హద్దులుగా ఈ రాజ్యం వర్ధిల్లిందనీ, దీని అధిపతి ధవళేశ్వర మార్కండేయ ప్రభువనీ దీని భావం.

ధవళేశ్వరం వంశీకులలో ఈ మార్కండేయుడు ఆరవ తరంవాడు. రెండవతరంవాడు "బెజవాడ ప్రభుడు"గా ప్రసిద్ధి పొందాడు. కుతుబ్‌షాహీతో స్నేహం, బెజవాడ ప్రశస్తి ఈ రెండు ఆధారాలబట్టి ఈ పెందోట ప్రభువుల రాజ్యం బెజవాడ నుంచీ కృష్ణకు ఆవల తెలంగాణాలో కొంత వరకూ విస్తరించి వుండవచ్చని చరిత్రకారుల ఊహ. అయితే, నాగార్జున సాగర్ తర్వాత ఈ పెందోట రాజ్యంలో చాలా భాగం నదిలో మునిగిపోయింది. ఇప్పుడు వాటి అవశేషాల్ని వెలికి తీయడం అసాధ్యమే!

ఎంతని యెన్నవచ్చు ధవళేశ్వర సోమయ మారకుందుధీ
మంతుని రాజ్యభారము సమగ్ర విభూతియు సర్వమంత్రి సా
మంతుల యందలంబులె చమత్కృతి బారగ రేకుదీర్చిన
ట్లంతట నిందు దద్గ్రహ సమావృతిసాల మలంక రించుచున్

అనే పద్యంతో మార్కండేయ ప్రభువు యొక్క రాజ్యసభ సర్వమంత్రి సామంత బృందాలతో సందడించేదనీ, ఆనాటి పెందోట రాజ్యం పెద్దదే గానీ, చిన్న సామంత రాజ్యం కాదనీ అర్థం అవుతోంది. కులీకుతుబ్‌షాహీ సమయంలో ఈ మార్కండేయ ప్రభువు సమకాలీనుడైన ఒక రాజుగా, స్నేహితుడిగా, నమ్మదగిన ఆత్మీయుడిగా వున్నాడే గానీ, సేనాధిపతిగానో, సామంతుడిగానో వున్నట్లు 'నాగరఖండం' అనే కావ్యంలో పేర్కొనలేదు. ఇతని ముత్తాత 'బెజవాడ ప్రభువు' కావడం వలన కాలక్రమంలో వీళ్ళు తమ రాజధానిని బెజవాడ నుంచి పెందోటకు మార్చుకుని వుంటారని అర్థం అవుతోంది.

మార్కండేయ ప్రభువుకి ముగ్గురు భార్యలనీ, అతని తర్వాత బబ్బారాయుడు రాజ్యానికి వచ్చాడనీ, 1620 తర్వాత ఈ రాజ్యం అంతరించిపోయిందనీ, గోల్కొండ పతనం పెందోట పతనం ఒకేసారి జరిగివుండవచ్చనీ చరిత్రకారులు భావిస్తారు.

ఈ పెందోట ప్రభువులు వీరశైవులు దండపాణీశ్వరస్వామి భక్తులు. పెందోటలో దండపాణీశ్వర ఇలవేల్పుకు గొప్ప దేవాలయం వుండేది. ఇప్పుడు దండపాణీశుడూ లేడు. ధవళేశ్వర ప్రభువులూ లేరు. అలనాటి పెందోట పట్టణ ప్రాభవమూ లేదు. కొంతరాజ్యం జలసమాధి అయ్యింది. కొంత రాజ్యం అడవులు పెరిగి కనుమరుగై పోయింది.

తురగా రాజకవి, అయ్యంకి బాలసరస్వతి జంటకవులు ఈ ధవళేశ్వర మార్కండేయ ప్రభువు ఆశ్రిత వర్గంలోని కవులే, మార్కండేయులు కళాపోషణ చేసి ఆ రాజవంశీకు లందరిలో ప్రసిద్ధుడయ్యాడు.

ఈ జంటకవులు స్కందపురాణాంతర్గత సనత్కుమార సంహితలో విశ్వకర్మ మహిత వైభవకరమైన 'నాగరఖండం' అనే గ్రంథాన్ని తెలుగులోకి అనువదించారు. ఇది 5 అశ్వాసాల కావ్యం. ఈ కావ్యప్రశస్తిలో కవులు మార్కండేయ ప్రభువు వివాదాలు పేర్కొన్నారు. ఈ ఆధారమే లేకపోతే 'పెందోట వాజ్యం' గురించి సాక్ష్యాలేవీ మనకు లేకుండా పోయేవనడంలో అతిశయోక్తి లేదు.

# కవుతరం

కృష్ణాజిల్లా గుడివాడ సమీపంలో వున్న 'కవుతరం' సామాజిక చైతన్యానికి ఆటపట్టయిన అలనాటి పట్టణాలలో ఒకటి! క్రీస్తు శకం ఒకటవ శతాబ్ది నుంచీ 21వ శతాబ్ది వరకూ ఈ కవుతరం ఎప్పుడూ వార్తల్లోనే వుందనడం అతిశయోక్తి కాదు.

ఈ ఊళ్ళో 'గౌతమేశ్వర స్వామి' దేవాలయం వుండటం కారణంగా గౌతమవరం అనే పేరు ఏదో ఒక కాలంలో దీనికి ఉండి వుండవచ్చునేది కొందరు పండితుల ఊహ. ఈ గౌతముడు గౌతమ బుద్ధుడూ కావచ్చు లేదా, వైదిక ఋషులలోని అనేకమంది గౌతములలో ఒక గౌతముడూ కావచ్చు.

'కవుతరం' బౌద్ధుల కేంద్రమేననడానికి ఇక్కడ తగినన్ని సాక్ష్యాలు దొరకలేదు. రాబర్టు స్యూయల్ పండితుడు గానీ, కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్ తయారుచేసిన గోర్డాన్ మెంకజీగానీ ఇది బౌద్ధ కేంద్రం కావచ్చునీ, గుడివాడతో సమానంగా కవుతరంలోనూ బౌద్ధస్తూపమో, చైత్యవిహారమో ఉండే అవకాశం వుందనీ రాశారు.

బౌద్ధ యుగంలో ఘంటసాల వాణిజ్య కేంద్రంగానూ, ఓడరేవుగానూ వుండేది. సముద్రం ఇప్పుడు కనీసం ముప్పయిమైళ్ళ లోపలికి పోయింది గానీ, ఆ రోజుల్లో ఘంటసాల దాకా వుండేదని చరిత్రకారుల భావన. ఘంటశాల నుంచి గుడివాడ మీదుగా ఏలూరు తర్వాత వున్న వేగి వరకూ రాచబాట వుండేది. ఘంటసాల గుడివాడ మధ్య కవుతరం వుంది. ఈ రాచబాటలో మధ్యలో కన్పించే చాలా వూళ్ళలో బౌద్ధమత కేంద్రాలుండేవి.

ఆ రోజుల్లో కృష్ణాతీరంలో నివసించిన ప్రజలకు ఇండో చైనా దేశాలతోనూ, ఈజిప్ట్ రోమ్ తదితర దేశాలతోనూ వాణిజ్య సంబంధాలూ నడిచాయనడానికి తగినన్ని సాక్ష్యాలున్నాయి. ఈ వాణిజ్య సంబంధాల కారణంగా కృష్ణాతీరం నుంచి అనేకమంది ప్రజలు ఆయాదేశాలకు వలసపోవడం, అక్కడి వారు అనేకమంది ఇక్కడకు రావడం సహజంగానే జరిగాయి.

చంపా నగరంగా మనకు బాగా పరిచితమైన కంపూచియాలో 'కౌతర' అనే ప్రాంతం వుంది. "ఏన్షియంట్ ఇండియన్ కాలనీస్ ఇన్ ద ఫార్ ఈస్ట్" అనే గ్రంథంలో ఆర్.సి.మజుందార్, ఈ 'కౌతర' రాష్ట్రం గురించిన వివరాలు కొన్ని తెలియజేశారు. భగవతి కౌతరేశ్వరి పేరున ఏర్పడిన పుణ్యక్షేత్రం అంటాడు దీన్ని మజుందార్. చరిత్ర పరిశోధకులు మారేమండ రామారావు కంబోడియాలోని కౌతర గుడివాడ దగ్గరి కవుతరం

ప్రాంతాల దగ్గర పోలికల్ని నిరూపించడం వలన, ఈ కవుతరం నుంచి వలస వెళ్ళిన కృష్ణాతీరంలోని తెలుగు ప్రజలు కంబోడియాలో తమ జన్మభూమి పేరునే ఒక ప్రాంతాన్ని నెలకొల్పుకున్నట్లు అర్థం అవుతోందంటారు.

సముద్రగుప్తుడు ఆంధ్ర ప్రాంతాన్ని జయించిన తర్వాత అలహాబాద్‌లో వేయించిన శాసనంలో 'కౌటూర' అనే రాజ్యాన్ని కూడా జయించినట్లు పేర్కొన్నాడు. ఈ 'కౌటూరు' కవుతరమేనని కొందరు చరిత్రకారులు నిరూపించే ప్రయత్నాలు చేశారు.

క్రీ.శ.1149 సంవత్సరంలో సోమనమంత్రి వేయించిన దానశాసనంలో విజయ పురి, ఘంటసాల, గౌతరం, ఏలేశ్వరం, వేంగీశ్వరం, ఉండవల్లి, విజయ వాటిక... ఇలా అనేక గ్రామాల ప్రస్తావన వుంది. 'గౌతరం' గ్రామం కవుతరమేననడానికి ఆక్షేపణ లేదు. కనీసం 850 ఏళ్ళనాటి ప్రాచీనత ఈ కవుతరానికి వున్నదనడంలో అతిశయోక్తి కూడా లేదు.

రాజరాజ నరేంద్రుడు క్రీ.శ.1019-1062 మధ్యకాలంలో రాజ్యం చేశాడు. ఆయన కవుతరంలో చెన్నకేశవ స్వామి దేవాలయాన్ని ప్రతిష్ఠించినట్లు గ్రామప్రజల విశ్వాసం. రాబర్టు స్యూయల్ పండితుడు ఈ దేవాలయం రెడ్డి రాజుల కాలం నాటిది కావచ్చునని అభిప్రాయపడ్డాడు. ఇక్కడి వల్లభాంబ గుడి, వడ్డి చెరువు 1323-1424 మధ్యకాలంలో రెడ్డిరాజులు పాలిస్తున్న యుగంలో ఏర్పడి వుంటాయనీ, ఇక్కడ బంగారపు వడ్లగింజలు దొరికేవని ప్రశస్తి వుండేదనీ అంటారు. ఈ చెరువు మధ్యగా తిరువూరుకు వెళ్ళే రోడ్డు వేయడం వలన ఒకే చెరువు రెండు చెరువులుగా కన్పిస్తోందని తాళ్ళూరు మంగపతిరావు రాశారు.

కోస్తా ప్రాంతంలో అడవుల్ని నరికించి భూమిని సాగుకు తెచ్చిన ఘనత రెడ్డి రాజులకే దక్కుతుందని అంటారు. కాలువలు, దొరువులు, పాయలు, బావులు... ఇలాంటివి ఏర్పాటుచేసి రెడ్డిరాజులు నదీజలాల్ని సాగునీరుగా మళ్ళించగలిగారు.

క్రీ.శ.1759 నుంచీ 1843 వరకూ కవుతరం కమదన రాజవంశీకుల ఏలుబడిలో గురజ జమీందారీలో భాగంగా వుండేది. గుడివాడ, విన్నకోట, కలిదిండి బాహర్‌జల్లి (అంటే, కైకలూరు) ఈ నాలుగు ప్రాంతాలూ కమదన వారికి ఆధీనంలో వుండేవి. వీటిని చార్‌మహల్ ప్రాంతాలుగా వ్యవహరించేవాళ్ళు.

1770 నుంచీ ఇంచుమించుగా ప్రతి పదేళ్ళకూ వచ్చిన కరువూ, 1833-34లో వచ్చిన నందన కరవులతో 'కృష్ణాతీరం' కడగండ్ల పాలయ్యింది. ఈ కరువు పుణ్యానే గోదావరీ కృష్ణా నదుల మీదుగా ధవళేశ్వరంలోనూ, బెజవాడలోనూ ఆనకట్టలు నిర్మాణం అయ్యాయి.

అందువలన మెట్ట వ్యవసాయం మాగాణి వ్యవసాయంలోకి మారింది. రైత్వారి సెటిల్‌మెంట్ ఫలితంగా రైతుకు తను పండించే భూమిపైన హక్కు ఏర్పడ్డంతో కోస్తా ఆంధ్రలోనూ, ముఖ్యంగా కృష్ణాతీరంలోనూ రైతులు తలెత్తుకు తిరగగలిగే అవకాశాలు ఏర్పడ్డాయి. ధనిక, మధ్య తరగతి రైతులు ఏర్పడ్డారు. ప్రజల్లో సామాజిక చైతన్యం తగిలేందుకు ఈ పరిణామాలు ఎంతగానో తోడ్పడ్డాయి. కౌతరం గ్రామం ఇందుకు శ్రీకారం చుట్టింది.

ఆధునిక విద్యలు నేర్చుకోవడం, బ్రహ్మ సమాజం ప్రభావం, వందేమాతరం ఉద్యమం, అస్పృశ్యతా వ్యతిరేక ఉద్యమం... వీటన్నింటిలోనూ ఇక్కడి ప్రజలు ప్రముఖ పాత్ర వహించడం వలన కృష్ణాజిల్లాలో బెజవాడ మచిలీపట్నంలకు దీటుగా 'కౌతరం' తన ప్రశస్తిని నిలబెట్టుకుంది.

1907లో కవుతరం మీదుగా బందరు రైల్వే లైను పూర్తయ్యింది. అదే ఏడాది కట్టమంచి కొళందరెడ్డి మరికొందరు ప్రముఖులు కలిసి "ఆంధ్ర లక్ష్మి ఇండస్ట్రియల్ కంపెనీ లిమిటెడ్"ను స్థాపించారు. అప్పటి కలెక్టర్ స్కాట్. ఈ కంపెనీకి కౌతరంలో స్థలం మంజూరు చేశాడు. ఒక బియ్యం మిల్లుని, చేనేత పరిశ్రమనీ, తోళ్ళను పదును చేసే పరిశ్రమనీ నెలకొల్పారు. ఇప్పటికీ పెద్ద ఉప్పుడు మిల్లులలో ఒకటిగా ఆంధ్ర లక్ష్మి రైస్‌మిల్లు ఆడుతోంది. కట్టమంచి రామలింగారెడ్డి గారి పెద్దన్న కుమారులయిన కొళందరెడ్డి ఇక్కడ పరిశ్రమను నెలకొల్పారు గానీ, నష్టాలు రావడంతో, దాన్ని వదులుకున్నారు. ఆయన ఈ చెరుకువాడ వేంకట నరసింహం పంతులు సహకారంతో బ్రహ్మ సమాజ ఉద్యమంతో పాటు, ఆంధ్ర లక్ష్మి జాతీయ విద్యాలయం 1910లో ఇక్కడ నెలకొల్పారు. బందరులో జాతీయ కళాశాల తర్వాత ఇదే కృష్ణాజిల్లాలో ఏర్పడిన జాతీయ విద్యాలయం.

కౌతరం, అంగలూరు, గురజ గ్రామాలు ఆ రోజుల్లో చైతన్యవంతమైన గ్రామాలు. 1908లో ఇక్కడ మొదటి సహకార పరపతి సంఘం ఏర్పడింది. గాంధీ 1929లో ఒకసారి, 1938లో ఒకసారి ఈ గ్రామాన్ని సందర్శించారు. నార్ల వెంకటేశ్వరరావు గారి తల్లి మాచమ్మ గారు తాను పేదరికంలో వున్నప్పటికీ, తన చేతి బంగారపు గాజుల్ని తీసి గాంధీకి సమర్పించిన సంఘటన కౌతరం ప్రజలకు ఒక మధురస్మృతి.

1932లో తూర్పు కృష్ణాజిల్లా హరిజన సేవాసంఘం ఏర్పడింది. దాని కార్యాలయం కౌతరంలోనూ వుండేది. జిల్లాలో హరిజన హాస్టల్స్ నెలకొల్పడం, హరిజనులకు రాత్రి పాఠశాలలు నడపడం, హరిజనులకు విద్యార్థి వేతనాలివ్వడం... ఇవీ ఈ సంఘం

కార్యక్రమాలుగా వుండేవి. కృష్ణాజిల్లాలో హరిజనోద్యమం బలంగా నడవడానికి కౌతరం నిర్వహించిన పాత్ర గొప్పది. కౌతరం అంగలూరు గ్రామాలు మొట్టమొదటగా హరిజన దేవాలయ ప్రవేశ కార్యక్రమాల్ని ప్రారంభించిన గ్రామాలుగా ప్రసిద్ధి పొందాయి.

1939-40 వ్యక్తి సత్యాగ్రహంలో బొబ్బా ఆదినారాయణమూర్తి, వీరపనేని గోపాలకృష్ణయ్య చౌదరి హైకమాండ్ ఆజ్ఞను పొంది స్వాతంత్ర్య ప్రకటన చేసి కఠిన శిక్షలు పొందారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో కౌతరం ప్రజలు వీరూ వారూ అనే తేడా లేకుండా మూకుమ్మడిగా ప్రభుత్వ వ్యవస్థ పైన తిరుగుబాటు చేశారు.

దేశవ్యాప్తంగా ప్రసిద్ధిపొందిన ఎందరో మహనీయుల్ని కౌతరం ప్రభవించింది.

పింగళి వీరరాఘవరావు ఆలిండియా రేడియో ఎడిషినల్ డైరెక్టర్ జనరల్ చేసారు. ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి దినపత్రికలకు సంపాదకత్వం వహించిన నార్ల వెంకటేశ్వర రావు గారు, పద్మశ్రీ డా॥ నార్ల తాతారావు బాలబంధు కీ.శే.బి.వి. నరసింహారావు, వాజ్మయి మహోద్యక్షులు వడ్లమూడి గోపాలకృష్ణయ్య, ప్రముఖ పారిశ్రామిక వేత్తలు అట్లూరి జయరామయ్య, అట్లూరి వెంకటేశ్వరావు, ఆంధ్రజ్యోతి వ్యవస్థాపకులు శ్రీ కె.యల్.యన్.ప్రసాద్ సెంట్రల్ గవర్నమెంట్ హోమ్ సెక్రటరీగా పనిచేసిన కె.పద్మనాభయ్య, డిజిపిగా పనిచేసిన తాళ్ళూరి సూర్యనారాయణ, సినీనటులు కైకాల సత్యనారాయణ కమ్యూనిస్ట్ ఉద్యమనేత కె.బలరామయ్య వంటి ఎందరో ప్రముఖులు ప్రభవించిన కౌతరం సామాజిక చైతన్యానికి మరో తరాన్ని అందించి జాతీయోద్యమ స్ఫూర్తిని రగిలించిన ప్రశస్తి పొందింది! ఇదీ కవుతరం అలనాటి నుంచి ఈనాటిదాకా సాగిస్తున్న ప్రాభవం!

# నరసరావుపేట

రెండువందల సంవత్సరాల క్రితం ఆనాటికి అందుబాటులో వున్న అత్యాధునిక సౌకర్యాలతో చక్కని పథక రచనతో కొత్తగా నిర్మించిన రాజధాని నగరం నరసారావుపేట.

అంతకుమునుపు అక్కడ 'అట్లూరు' అనే వూరుండేది. ఈ వూళ్ళో ఒక కోటని కట్టి, దాని చుట్టూ పట్టణాన్ని విస్తరించడం వలన అట్లూరు గ్రామ స్వరూప స్వభావాలు పూర్తిగా మారిపోయాయి. ఈ అట్లూరు అంతకు ఐదారు వందల ఏళ్ళక్రితం కటికనేని వంశీకుల మొఖాసా గ్రామం. తర్వాత వినుకొండ పాలకుల స్వాధీనం అయ్యింది. రాజా మల్రాజు వెంకట గుండారావు వినుకొండ జమిందారుగా వున్న కాలం అది! 1797 సంవత్సరంలో తన ఏలుబడిలో వున్న ఈ అట్లూరు గ్రామాన్ని ఎంచుకొని, ఇక్కడ కోటని కట్టించాడు. సాక్షాత్తూ జమిందారే ఇక్కడ నివసించడం కారణంగా రాజధాని మొత్తం ఇక్కడకు తరలివచ్చేసింది. కొత్తగా ఒక పట్టణమే అక్కడ వెల్సింది. దానిన తన తండ్రి పేరుతో నరసారావు పేట అని పేరు పెట్టాడు.

'పేట' అంటే, మార్కెటింగ్ యార్డ్ వంటిది. వివిధ హోల్‌సేల్ వర్తకులు తమ సరుకుల్ని ఇక్కడకు తెచ్చుకొని అమ్మకాలు కొనసాగిస్తుంటారు. నిత్యం వ్యాపార లావాదేవీలతో నరసరావుపేట త్వరలోనే పెద్ద వాణిజ్యకేంద్రం అయ్యింది.

ఈ రాజా మల్రాజు వెంకట గుండారావు అమరావతి పాలకుడు రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడుకు సమకాలికుడు. నూరుమంది చెంచుల్ని ఊచకోత కోయించిన సంఘటనకు వెంకటాద్రినాయుడు, గుండూరావు జమిందార్లు ఇద్దరూ కారకులని బ్రిటిష్ వారి రికార్డులే చెప్తున్నాయి.

నరసారావు పేటకు రాజధాని తరలి రాకమునుపు, మొదట బెల్లంకొండ సంస్థానం- తర్వాత వినుకొండ సంస్థానం- ఆఖరున నరసారావుపేట సంస్థానంగా మారింది. నరసారావుపేట ఏర్పడ్డాక ఈ జమిందార్లకు బాగా కలిసివచ్చింది. రావూరు జమిందారీలో సైదాపురాన్ని, రేపల్లె జమిందారీలో రాచూరునీ, పెద్దాపురం సంస్థానంలో కడలి ముఠానీ కొనుగోలు చేసి తమ జమిందారీని విస్తృత పరుచుకున్నారు. మొత్తం 420 గ్రామాలు వుండేవిట నరసారావుపేట జమిందారీ ఆధీనంలో!

దిట్టకవి నారాయణ కవి రాసిన రంగరాయ చరిత్రలో ఈ మల్రాజు రాజవంశీకుల వివరాలున్నాయి. కాకతి ప్రతాపరుద్రుడి ఆస్థానంలో 77 గోత్రాలకు చెందిన పద్మనాయిక

కులస్థులు పాలకులుగా వుండేవారట. వీళ్ళలో తెలంగాణాలోని కొల్లార సంస్థానానికి విరియాల గోత్రీకులైన ఈ మల్రాజు వంశీకులు పాలకులు.

కాలవశంలో ప్రతాపరుద్రుడు ఢిల్లీ సుల్తాన్‌కు పట్టుబడి కాకతీయ సామ్రాజ్యం పతనం అయిన తర్వాత ఒక్కొక్కరే క్రమేణా ఢిల్లీ పాదుషాల ప్రాపకం కోసం కాకతీయుల కాలం నాటి సంస్థానాల పాలకులు ప్రయత్నించసాగారు. మల్రాజు వల్లారాయుడు లేదా వల్లభరాయుడు కూడా ఇలానే ఢిల్లీ మెప్పుపొంది కొండవీడు పరగణాలో కొంతభాగాన్ని పాలించుకోవడానికి అనుమతి సంపాదించుకొన్నాడట. అతని వారసులుగా కొండలరాయుడు, రామన్నలు వరుసగా ఈ ప్రాంతాన్ని పాలించారు. అప్పట్లో దీన్ని బెల్లంకొండ సంస్థానం అనేవాళ్ళు. "సకల దిగ్దేశ నృపతులు సన్నుతింప బెల్లంపుకొండ ధరాధిరాజ రాజ మార్తాండ మూర్తి రామన్నపతి..." అని ఈ రామన్న గురించి కవి ప్రశంస వుంది. రంగరాయ చరిత్ర గ్రంథంలో ఆయన తర్వాత మూడు తరాలు గడిచాక 'రామన్న పాలుడు' అధికారంలోకి వచ్చాడు. ఆయనకి రంగరాయ చరిత్రం అంకితం ఇచ్చాడు దిట్టకవి నారాయణ కవి.

బహుశా, ఈ తరాలు గడిచేకాలంలో పలనాడులో రాజకీయపరమైన అస్థిరత బాగా వుండేది. రామన్నగారి కొడుకు మల్రాజు వెంకట నరసింహారావు తరానికి వచ్చేసరికి ఈ పాలకులు బెల్లంకొండ సంస్థానాధీశులుగా కాక, వినుకొండ సంస్థానాధీశులుగా వున్నారు. హైదరాబాద్ నవాబు బసాలత్ జంగ్ వీళ్ళని వినుకొండ పాలకులుగా లేక దేశ్‌ముఖ్‌లుగా నియమించినట్లు కన్పిస్తుంది.

ఈ నరసింహారావు పేరునే నరసారావుపేట ఏర్పడింది. "సైపుఖాన వజీర బుజావలేప లోపకృద్ధీర విజయ ప్రతాపశాలి" అని ఆయన గురించి నారాయణ కవి ప్రశంసించాడు. 18వ శతాబ్దం మధ్యకాలంలో ఈయన జీవించి వుండాలి. ఈయనకి ఇద్దరు కొడుకులు. పెదవెంకట గుండారావు, చినవెంకట గుండారావు- అని!

1784-1814 మధ్యకాలంలో పెదవెంకట గుండారావు సంస్థాన పాలకుడుగా వున్న కాలంలో నరసరావుపేట నగర నిర్మాణం పూర్తయ్యింది.

1797లో కోటను కట్టించడం కోసం అట్లూరు గ్రామంలో కొనకంచి వెంకటేశం అనే రైతు నుంచి 20 ఎకరాల పొలాన్ని కొన్నాడట గుండారావు. మేళ్ళ చెరువు సాంబయ్య అనే బ్రాహ్మణుడు శంకుస్థాపనకి ముహూర్తం కూడా పెట్టాడు. కానీ, రంగా వెంగమశెట్టి అనే వాస్తు శాస్త్ర పండితుడు. కోటని ఆ స్థలంలో కట్టవద్దని ఆపు చేయించి, అదే ముహూర్తానికి అట్లూరు గ్రామం మధ్యలో ఒక బొడ్డురాయిని స్థాపింపచేశాడు. అక్కడ

కోటని కట్టారు. ఆ కోట చుట్టూ ఊరు పెరిగింది. ఊళ్లో ఉద్యానవనాలు, చేతరాయి అనే విలాసమందిరం... ఇలాంటివి కూడా కట్టించాడట. 1891లో ఈ మందిరాన్ని రోడ్డు విస్తరణ కోసం పడగొట్టారని అంటారు.

పమిడిపాడు నుంచి మేళ్ళ చెరువు వారినీ, తొండపి నుంచి రామడుగు వారినీ, బెల్లంకొండ నుంచి కౌతవరపు వారినీ, మార్కాపురం నుంచి తగవరపు వారినీ, మొవ్వనుంచి పువ్వాడ వారినీ, వినుకొండ నుంచి బత్తుల వారినీ, పోతవరం నుంచి కాకుమాను వారినీ, పత్తిపాడు నుంచి ఏకావారినీ, ఈదర నుంచి మంచళ్ళవారినీ, యల్లమంద నుంచి వేదాంతం వారినీ, ఇలా... ఊటుకూరు వారు, మండావారు, దేసువారు... అనేక కులాలకు చెందిన ప్రముఖుల్ని నరసారావుపేటకి ఆహ్వానించి అక్కడవాళ్ళు నివాసాలేర్పరుచుకునేలా ప్రోత్సహించాడు గుండారావు. ఇంకా మరికొందరు మహమ్మదీయులు, మార్వాడీలు, ఇంగ్లీషు వాళ్ళు కూడా ఈ కొత్త పట్టణంలో నివాసాలు ఏర్పరచుకొన్నారు.

నరసరావు పేట ఏర్పడక ముందు అక్కడ వున్న అట్లూరు గ్రామానికి కటికెనేని వాళ్ళు పాలకులుగా వున్న రోజుల్లో కటికెనేని నారన్న అక్కడ ఒక బావినీ, చెరువునూ తవ్వించాడు. నారన్న బావిగా ఇప్పటికీ అది ప్రసిద్ధం.

కోటని మహమ్మదీయ సాంప్రదాయంలో కట్టారు. మొఘల్ రాచరిక విలాసం అంతా ఈ కోటలో అందుబాటులో వుండేదిట.

రాజా గుండారాయుడు రాచరికపు వైభవాన్ని సంపూర్ణంగా అనుభవించా దనడానికి తార్కాణం ఏమంటే, ఆయన దగ్గర 99 ఏనుగులూ 100 ఒంటెలూ, 500 గుర్రాలూ వుండేవిట. ఎనిమిది పళ్ళ తోటలు కూడా వుండేవిట. వీటికోసం రాజుగారు ఎంత వెచ్చించి వుంటాడో వూహకు అందని విషయం ఏమీ కాదు. వాటి అవసరం అంతగా ఆ రోజుల్లో ఆయనకు వుందా అనేదే ప్రశ్న! ఈ ఛోటా జమీందార్లు తమని మహారాజులుగా భావించుకొంటారని బ్రిటిష్ వాళ్ళు చాలా సందర్భాల్లో హేళన చేశారు అందుకే!

ఈ గుండా రాయుడి గారి పట్టపుటేనుగుని ఖండేరావు అని పిలిచేవాళ్ళట. ఏనుగుల పాలనకోసం ఒక్క ఏనుగుకూ ఒక్కో మావటి, ఒక్కో సహాయకుడూ తప్పనిసరి కదా... ఏనుగుల పాలకుల్ని ఏనుగుల వాళ్ళనీ, ఏనుగులుండే స్థలాన్ని ఏనుగుల బజారనీ జన వ్యవహారంగా వుండేది.

గుండారావు నర్సరావుపేట ప్రతిష్ఠని ఇనుమడింప చేయడానికి ఇలా ఎంతో వెచ్చించాడు. ఆ రోజుల్లో ఈ గుండారావు వెంకటాద్రినాయుడు ఇద్దరూ గుంటూరు సీమలో ప్రసిద్ధులుగా చెలామణి అయిన జమీందార్లు.

వెంకటాద్రినాయుడు అమరావతి పట్టణాన్ని నిర్మించినా, నూట ఎనిమిది శివాలయాల్ని కట్టించినా జమీందారీ అప్పులపాలు కాకుండా కాపాడుకోగలిగాడు. ఆయన వారసులు

ఆస్తి కోసం కోర్టులకెక్కి జమీందారీని విచ్ఛిన్నం చేసుకున్నారు. కానీ, గుండారావు గారి విషయంలో ఇందుకు భిన్నంగా జరిగింది. ఆయన చూస్తుండగానే కరువు కాటకాలు కూడా తన ఖర్చుకు తోడు కావడంతో ఖజానా ఖాళీ అయిపోయింది. సంస్థానం అప్పుల పాలయ్యింది. చివరికి 1833-46 సంవత్సరాల మధ్య కాలంలో ఈస్టిండియా కంపెనీ పాలకులు నిర్మోహమాటంగా, తమకు అభిమాన పాత్రుడైన స్నేహితుడని కూడా చూడకుండా జమీందారీని స్వాధీనం చేసుకున్నారు. అలా ముగిసిపోయింది నరసరావుపేటలో మల్రాజు వంశీకులపాలన.

కంపెనీపాలన ప్రారంభం అయ్యాక, 1887లో మున్సిపాలిటీగా మారింది నర్సరావుపేట! 1886లో రైలు మార్గం వేశారు. 1891లో మున్సబు కోర్టునీ, 1896లో డిప్యూటీ కలెక్టర్ కార్యాలయాన్నీ తరలించారు. ఈనాడు నరసారావుపేట వైభవోజ్వల పట్టణంగా విరాజిల్లుతోంది. దాని వ్యవస్థాపకులు నిలుపుకోలేకపోయినా, వారు వేసిన పునాదులు బలీయమైనవిగా నిలిచి వున్నాయి!

# చల్లపల్లి

దివి తాలూకాలో ప్రసిద్ధమైన చల్లపల్లి సంస్థానానికి కనీసం 500 ఏళ్ళ చరిత్ర వుంది.

కొండపల్లి కోటని జయించి, శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణువుని దర్శించుకొని, స్వామి సన్నిధిలో ఆముక్తమాల్యద కావ్యరచనకు శ్రీకారం చుట్టాడు కృష్ణదేవరాయలు. అప్పుడే, కృష్ణాతీరంలో ఈ దివ్యసీమలో ఒక కోటని నిర్మించాలని కూడా సంకల్పించుకున్నాడు. ఆ కోటకు తన పేరునే 'దేవరకోట'గా వ్యవహరించాలనుకున్నాడు.

అలా నిర్మితమైన దేవరకోట నగరమే ఈనాటి చల్లపల్లి పట్టణం.

భువన విజయ సభలో బలవంతుడైన అన్నకు భయపడి సోదరభక్తి ప్రదర్శించిన రాముడి సోదరులకన్నా, పాండవ సోదరులు గొప్పవారనీ, బలహీనుడైన అన్నకు బలవంతులైన సోదరులు కట్టుబడి వున్నారనీ కృష్ణారాయలు ఒకసారి సమన్వయ పరిచినప్పుడు, వింజామరం వీచే ఉద్యోగి ఒకడు కల్పించుకొని "రాయల వారు పాండవ పక్షపాతాన్ని పోనిచ్చుకున్నారు కారు..." అని వ్యాఖ్యానించాడట. అతని ఉద్దేశం రాయలు సాక్షాత్తూ విష్ణుమూర్తి అవతారం అనడమే!

ఇంత చక్కని వ్యాఖ్యానానికి సంతోషించి రాయలు ఆ ఉద్యోగిని ఏంకావాలో కోరుకోమంటే, అతను "దేవర! కోటని ఏలాలని వుంది-" అన్నాడట!

కొంపలంటుకుపోయే ఈ వరాన్ని అతను కోరినప్పుడు, తిమ్మరుసు యుక్తిగా అతన్ని "దేవరకోట" పాలకుడిగా పంపాడని ఒక కథ ప్రచారంలో వుంది.

విజయనగర సామ్రాజ్య పతనం తర్వాత దివిసీమ పూర్తిగా గోల్కొండ ప్రభువుల పాలనలోకి వెళ్ళిపోయింది. అంతకుపూర్వం కొంతకాలం నూజివీడు సంస్థానంలో భాగంగా వున్న చల్లపల్లి రాజ్యం గోల్కొండ పాలకులకు సంక్రమించింది. ఆ దశలో రేచర్ల గోత్రీకులైన యార్లగడ్డ గుర్వినీడుని 1576-1596 మధ్యకాలంలో గోల్కొండ పాదుషాలు దేవరకోటకు పాలకుడిగా నియమించినట్లు తెలుస్తోంది.

1710-1723 కాలంలో రాజా యార్లగడ్డ అంకినీడు రాజకీయంగా బలమైన శక్తిగా ఎదిగాడు. మధ్యలో '1734-1745' కాలంలో ఒక పన్నెండేళ్ళపాటు ఈ జమీందారీని నిజాం ఫౌజుదారు, ఆక్రమించాడు. 1746లో యార్లగడ్డ కోదండరామన్న జమీకి వచ్చి, చల్లపల్లి రాజ్యాన్ని అభివృద్ధిపరిచాడు.

1798-1819 కాలంలో ఇమ్మడి అంకినీడుని జమీందారుగా "సన్నద్-ఇ-మిమీయత్ ఇస్తి మిరాద్"ను ఈస్టిండియా కంపెనీ ప్రభుత్వం అందించింది. మహారాష్ట్ర వెళ్ళి, పూనాలోని పీష్వాను సందర్శించి "శ్రీమంతు" అనే బిరుదును పొందాడు. "రాజా

అబ్దతుల్ అక్రాన్" అనే బిరుదు కూడా సంపాదించాడు. ఈ బిరుదు నామాలన్నింటినీ, ఆ తర్వాతి చల్లపల్లి సంస్థానాధీశులంతా ధరిస్తూ వచ్చారు.

రాజా శ్రీమంతు ఇమ్మడి అంకినీడు గారే ఈనాటి చల్లపల్లి నగరానికి నిర్మాత! కోటని కాశీరాజు గారి కోటలాగా కట్టించాడు. అప్పట్లోనే కోట పునర్నిర్మాణానికి రెండు లక్షల రూపాయలు ఖర్చయ్యాయిట!

1846-75 మధ్యకాలంలో రెండవ అంకినీడు బహద్దరు కోటప్రాకారాన్ని రాతితో నిర్మించాడు. ఇప్పటికీ ఈ రాతి ప్రాకారం నిలబడి వుంది. ఈయన్ని ముమ్మిడి అంకినీడు బహద్దరు అంటారు.

ఈయన కవి పండితుల్ని బాగా ప్రోత్సహించాడు. చల్లపల్లిలో ఒక సంస్కృత పాఠశాలని కూడా నిర్మింపచేశాడు.

తన కుమారుడు శ్రీమంతురాజా యార్లగడ్డ మల్లికార్జున ప్రసాద నాయుడుకి ముక్త్యాల రాజా భవానీ శంకర ప్రసాద్ గారి అమ్మాయినిచ్చి పెళ్ళి చేశారు. 1876లో మల్లికార్జున ప్రసాద నాయుడు సతీ సమేతంగా ఘనంగా తన పట్టాభిషేకాన్ని జరుపుకున్నాడు.

1890లో దాయాదుల పోరు ఈ సంస్థానానికి కూడా ఆవహించింది. అన్ని కోర్టులూ అయిన తర్వాత, మద్రాస్ ప్రీవీ కౌన్సిల్ చల్లపల్లి సంస్థానాన్ని విభజించడానికి వీల్లేదని తీర్పునిచ్చింది. కానీ, రాజాగారు తన తమ్ముళ్ళకి చెరొక 750 రూపాయిలు మనోవర్తిగా ఇవ్వాల్సి వచ్చింది.

1904లో చల్లపల్లి కుమార రాజా మూడవ యార్లగడ్డ అంకినీడు ప్రసాదు బహద్దరుకి ముక్త్యాల రాజాగారి సోదరి భవానీదేవిని ఇచ్చి పెళ్ళిచేశారు. వీళ్ళిద్దరికీ పుట్టినవాడే చల్లపల్లి రాజాగా ప్రసిద్ధుడైన రాజా శివరామ ప్రసాద్ బహద్దర్.

మొదట జస్టిస్ పార్టీ ప్రముఖుడిగా, తర్వాత కాంగ్రెస్‌లో ముఖ్యనాయకుడిగా, "చల్లపల్లి"అనే పేరుతో క్రియాశీలక పాత్ర పోషించారు శివరామప్రసాద్. 1929లో ఈయన చల్లపల్లి జమిందారుగా అధికారంలోకి వచ్చారు.

ఈయన పట్టాభిషేక మహోత్సవం కవిపండిత ప్రముఖుల సమక్షంలో చాలా ఘనంగా జరిగింది. చెళ్ళపిళ్ళవారు, శ్రీపాదవారు, వేటూరివారు, కాశీకృష్ణాచార్యులు, ఉమర్ ఆలీషా కవి... ఇలా మహామహులంతా ఆ ఉత్సవానికి హాజరయ్యారట! "ఇంతమంది కవీంద్రు లేరేని పట్టాభిషేకమ్మనకును విచ్చేయలేదు-" అంటూ కవుల కీర్తనల్ని అందుకున్నాడాయన. అప్పటికే రాజకీయాల్లో సుప్రసిద్ధుడుగా ఎదిగిన చల్లపల్లి రాజాని ఒక కవి- "గోత్రాది సభలోన గురుండొక్కరుడె కాని కలరునీ సభను బెక్కండ్రు గురులు..." అని కీర్తించాడు.

తిరుపతి కవులు, కొప్పరపు సోదర కవుల్ని ఈయన సత్కరించాడు. జమ్మలమడక మాధవరాయ శర్మ గారి ఆంధ్ర ప్రతాప రుద్రీయము, అభినవ సహదేవ యేజెళ్ళ శ్రీరాములు

చౌదరి పశువైద్య వస్తు గుణదీపిక, గొట్టిపాటి వెంకట సుబ్బయ్య గారి "భట్టు మూర్తే రామరాజభూషణా?" వంటి అనేక గ్రంథాలను అంకితం పొందాడు. వాఙ్మయ మహాధ్యక్ష వద్దమూడి గోపాలకృష్ణయ్య గారికి స్వయంగా గండపెండేరం తొడిగి గౌరవించాడు. స్థానం నరసింహారావు, పెద్దిభొట్ల చలపతిరావు, గోవిందరాజుల సుబ్బారావు- వంటి కళాకారుల్ని, హరికథకుల్ని బుర్రకథల కళాకారుల్నీ సత్కరించాడు.

మొదట జస్టిస్ పార్టీ ద్వారా శాసనసభ్యుడిగా ఎన్నికయ్యారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభంజనం వీచి, ఆంధ్ర ప్రాంతంలో జస్టిస్ పార్టీ మహామహులంతా ఓడిపోయినప్పుడు, ఒక్క చల్లపల్లి రాజానే గెలిచి, ఈ ప్రాంతంలో తన పట్టును నిలబెట్టుకున్నారు. ఆ తర్వాత కాంగ్రెస్ రాజకీయాల్లోకి మారారు.

ముక్తేవి పెరుమాళ్ళయ్య, కాసుల పురుషోత్తమకవి వంటి ప్రముఖ కవులు చల్లపల్లి సంస్థానాధీశుల ఆదరణ పొందిన వారే వాగ్గేయకారుడు నారాయణ తీర్థులు సిద్ధేంద్రయోగి కూడా ఈ సంస్థానాధీశుల గౌరవాన్ని అందుకున్నారట!

1746-1791లో చల్లపల్లిని పాలించిన యార్లగడ్డ కోదండరామన్న దేశాహి పాలనా కాలంలో, 'నిజామలీ' అనే వాడు పెద్ద దండుతో ఇటువైపు దాడికి వస్తున్నాడని సమాచారం అందింది. అప్పుడు కోదండ రామన్న ముక్తేవి పెరుమాళ్ళయ్య కవిని ఆశ్రయించి, శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణువును ప్రార్థించి సంస్థానాన్ని రక్షించ వలసిందిగా కోరాడు.

పెరుమాళ్ళయ్య కవి 'శత్రుహంత శ్రీహనుమంతా' అనే మకుటంతో అప్పటికప్పుడు ఒక శతకాన్ని రచించాడు. అప్పటి బెజవాడ దాకా దూసుకొచ్చిన "నిజామలీ" గుర్రపు దండు మీద పిడుగులు పడి, బలగం చెల్లాచెదురై, అట్నుంచి అటే వెనక్కి తిరిగివెళ్ళి పోయారట!

"ఇత్తరిని నిజామల్లీ
హత్తీలు గుఱ్ఱాలు పటుతరాహనబలముల్
మొత్తమయి వచ్చె వి
ఛ్ఛిత్తుపడన్ శత్రుహంత శ్రీహనుమంత!"

అంటూ ఈ కథని కవి తన శతకంలో వివరించాడు.

కాశీనాథుని మల్లనారాధ్యుడికి ఈ కోదండ రామన్న మల్లేశ్వరపురం అగ్రహారాన్ని కానుకగా ఇచ్చాడట!

ఈస్టిండియా కంపెనీ పాలనా కాలానికి 190 చదరపు మైళ్ళ విస్తీర్ణంలో, 60 కసుబా (రైత్వారీ) గ్రామాలతోనూ, 32 శివారు గ్రామాలతోనూ పాలెములతోనూ, 20 అగ్రహారాల తోనూ చల్లపల్లి సంస్థానం ఒక వెలుగు వెలిగింది. సంస్థానాల రద్దు వరకూ ఈ జమీందారీ అప్రతిహతంగానే నిలిచింది! కృష్ణాతీరంలో చల్లపల్లి పట్టణ ప్రాభవం అది!

# తిరువూరు

తిరువూరు పేరు చెప్పగానే కృష్ణాజిల్లా చరిత్రతో పరిచయం వున్న ఏ ఒక్కరికైనా వెల్లంకి రాజవంశీకులు గుర్తుకొస్తారు.

షుమారుగా క్రీ.శ. 1550 క్రితం మేడూరు ఘూట్, జమలవాయి, కనకగిరి పరగణాలకు రాజధాని నగరంగా తిరువూరు ప్రశస్తి నందింది.

రాజా వెల్లంకి మల్లారావుకు ఈ మూడు పరగణాలపైనా అధికారం వుండేది. గోల్కొండ ప్రభువులు ఈయనకు ఈ అధికారాన్ని ధారాదత్తం చేసినట్లు కన్పిస్తుంది.

మల్లారావు తర్వాత, జానకిరావు, మల్లారావు (2), లింగారావు రామారావు, వెంగళరావులు వరుసగా ఈ జమీందారీకి వారసులుగా వచ్చారు.

వీరిలో చివరివాడైన వెంగళరావు అబ్దుల్ హసన్‌షా పాలకుడికి సమకాలికుడు. 1669-87 మధ్యకాలంలో జమీందారీకి వారసుడిగా వచ్చాడు. 'అబ్దులు హసన్ షా' అంటే రామదాసు చరిత్రలో ప్రసిద్ధుడైన తానీషాయే! తానీషాతోనే గోల్కొండ కుతుబ్‌షాహీ రాజవంశ పాలన అంతం అయ్యింది. దెక్కన్ భూభాగం అంతా ఔరంగజేబు ఆధీనం అయ్యింది.

తానీషా అక్కన్న మాదన్న మంత్రుల సలహాపైన పాలించేవాడు. మాదన్న మంత్రి ఈ వెల్లంకి వెంగళరావుకు పూర్తి స్థాయి జమీందారీ హోదా కల్పించాడు. ఔరంగజేబు అధికారంలోకి రాగానే తక్షణం అవన్నీ నశించిపోయాయి.

వెల్లంకి రాజ వంశీకులకు గండభేరుండ పక్షి బొమ్మను చిత్రించిన తెల్లజెండా, రాచరికపు చామరం నాలుగు రకాల డ్రమ్స్- ఢంకా, నవుబత్, తాషా, మార్ఫా... ఇవన్నీ వారి కుటుంబ ప్రతిష్ఠను చాటే వస్తువులుగా వుండేవని 1883లో కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్‌లో గోర్డాన్ మెకంజీ పేర్కొన్నాడు.

వెల్లంకి కుటుంబీకులకు సంబంధించిన అనేక విశేషాలు ఈ మాన్యువల్‌లో మెకెంజీ రికార్డు చేశాడు కూడా!

తానీషా పాలన ముగిసి, ఔరంగజేబు పాలన మొదలైన తర్వాత 1698లో, వెల్లంకి వెంగళగావు పెద్దకొడుకు ఔరంగజేబు నుంచి ఒక సనదు సంపాదించుకున్నాడు. అయితే, ఈ సనదు ద్వారా ఆయన కొంత జమీందారీని సంపాదించుకోగలిగాడు గానీ, అది జాయింట్ దేశ్‌పాండే పదవి అయ్యింది.

వరిగొండ విస్సంరాజు, వెల్లంకి గోపాలరావు, ఇంకా ఇతరులూ కలిసి దేశ్‌పాండెలుగా, మేదూరుఘాట్, జమలవాయ్ ప్రాంతాలను పాలించవలసిందని ఈ సనదులో ఔరంగజేబు ఆదేశించాడు. అప్పుడు తిరువూరు జమలవాయిలో భాగం అయ్యింది.

ఈ వెల్లంకి గోపాలరావు తర్వాత అతని ఐదుగురు కొడుకులూ జమలవాయి పరగణాని పంచుకున్నారు.

పెద్దకొడుకు వెంకటరావుకి గంపలగూడెం, రెండో కొడుకు వెంగళరావుకు కలగర, మూడోకొడుకు పెద్ద రామారావుకు తిరువూరు లభించాయి. మూడో కొడుకు తన బాబాయికి దత్తత వెళ్ళినా, తిరువూరులో కొంత వాటా లభించింది. నాలుగో కొడుకు నిస్సంతువుగా మరణించడం వలన వాటా ఇవ్వలేదు. ఐదో కొడుకు జోగయ్యారావుకు 'ఎనగడప' లభించింది.

తిరువూరు వాటా లభించిన పెద్ద రామారావుకు నల్గురు కొడుకులు. పెద్దకొడుకు ముందే మరణించడం వలన మిగిలిన ముగ్గురు కొడుకులూ తిరువూరును మూడు భాగాలుగా విభజించి పంచుకున్నారు. పంచుకోవడం అయితే పంచుకున్నారు గానీ, వాళ్ళలో పెద్ద వాళ్ళిద్దరూ సంతానాన్ని పొందలేకపోయారు. చివరివాడైన సూరా రావుకు ముగ్గురు కొడుకులు కలగడంతో, వారిలో ఇద్దరిని తన అన్నలిద్దరికీ దత్తత ఇచ్చాడు. ఇదీ ఒక తెలివైన పనే! సూరారావు ముగ్గురు కొడుకులకీ ఆస్తి లభించి నట్లయ్యింది.

వీళ్ళలో వెంకటకృష్ణారావుకు రాజుపేట, చిన్నరామారావుకి నడిమి తిరువూరు ముఠా, రామకృష్ణారావుకు పాత తిరువూరు ముఠా లభించాయి.

తిరువూరు పట్టణాన్ని ఈ ముగ్గురు అన్నదమ్ములూ పంచుకున్నప్పటికీ, కలిసే వుండే వాళ్ళు. వూరంతా ఒకే ఏలుబడిగా సాగేది.

1802లో కంపెనీ పాలనలో శాశ్వత శిస్తు విధానం అమలులోకి వచ్చాక ఈ ముగ్గురూ జమీందార్లుగానే స్థిరపడ్డారు.

జమీందారీ త్రయం తిరువూరును పాలిస్తున్న కాలంలో రాజనాయకుడు అనే బందిపోటు దొంగ అల్లకల్లోలాలు సృష్టించడం మొదలుపెట్టాడు. 1827లో వాణ్ణి పట్టి బంధించి ఈ వెల్లంకి సోదరులు ప్రజాభిమానంతో పాటు, కంపెనీ ప్రభుత్వం అభిమానం కూడా పొందగలిగారు.

రాజు పేట వాటాదారుడు వెంకట కృష్ణారావుకి ముగ్గురు కొడుకులు– జగన్నాథరావు, సూరారావు, శోభనాద్రి రావు. వీళ్ళలో శోభనాద్రిరావుని వీళ్ళ జ్ఞాతులు కలగర జమీందారు లక్ష్మణరావు దత్తత తీసుకున్నాడు. అలా తిరువూరు జమీందారీలో కలగర కూడా కలిసింది.

ఈ సంతానంలో పెద్దవాడు జగన్నాథరావు మూడో కొడుకుని గంపలగూడెం జమీందారు దత్తత తీసుకున్నాడు.

ఇలాంటి దత్తతలు ఈ తరాలలో అనేకం జరిగాయి.

1883 నాటికి, రాజుపేటని రామకృష్ణారావు, నడిమి తిరువూరుని వెంకట రామారావు, పాత తిరువూరుని రాజా వెల్లంకి వెంకట రామసూర్య ప్రకాశరావు, గంపలగూడెంను వెల్లంకి రామారావు పరిపాలిస్తున్నారని మెకంజీ పేర్కొన్నాడు.

ఆధునిక కాలానికి వచ్చేసరికి తిరువూరు, గంపలగూడెం జమీందార్లు తమ దేశభక్తిని చాటుకుంటూ అనేక కార్యక్రమాలు చేపట్టారు.

బెజవాడ రామమోహన గ్రంథాలయం గ్రౌండ్ ఫ్లోర్ నిర్మాణం కోసం, అప్పట్లో అయ్యదేవర కాళేశ్వరరావు ప్రేరణతో పాత తిరువూరు జమీందారు రాజా వెల్లంకి చిన వెంకటరావు విరాళం ఇచ్చి నిర్మింపచేశాడు. 1917లో ఈ నిర్మాణం పూర్తయ్యింది.

నడిమి తిరువూరు- ఇనగడప ఎస్టేట్ దారులు రాజా వెల్లంకి చిన వెంకట రామారావు తిరుపతి వేంకట కవుల్ని ఆహ్వానించి తిరువూరులో వారి శతావధానం ఏర్పాటు చేసి సన్మానించారట.

వావిలకొలను సుబ్బారావు గారి కౌసల్యా పరిణయం పద్య ప్రబంధాన్ని ఈ చిన్న వేంకటరామారావే ప్రచురింపచేశారు.

# గురజ

కొల్లేటి ఒడ్డున కైకలూరు, గుడివాడ ప్రాంతాలలో విస్తరించిన 'గురజ' ఈనాడు ముదినేపల్లి మండలంలో ఒక చిన్న గ్రామంగా వుంది.

కానీ, 1700 సంవత్సరం నాటికి 400 చదరపు మైళ్ళ విస్తీర్ణంతో 260 గ్రామాలతో విస్తరించి వుండే ఒక పెద్ద సంస్థానంగా వుండేది. ఈ సంస్థానాధీశులు 'కమదన' వంశీకులు పద్మనాయక కులానికి సంబంధించిన వారు విప్పర్ల గోత్రీకులు.

కమదన గురవయ్య, అయ్యన్న, సుబ్బయ్య, అంకయ్య ఇత్యాది ప్రముఖులు ఈ గురజ సంస్థానాన్ని తొలి రోజుల్లో పాలించారు.

కలిదిండి, గుడివాడ, బత్తరజల్లి, విన్నకోట... ఈ నాలుగు ప్రధాన ప్రాంతాలు గురజ సంస్థానంలో వుండేవి. నాలుగు ముఖ్య పట్టణాలున్న సంస్థానం కాబట్టి దీన్ని చార్‌మహల్ హవేలీ అనీ చార్‌మహల్ సంస్థానం అని కూడా పిలిచేవారు. బహుశా ఈ నాలుగు వూళ్ళలో కూడా గురజ పాలకులకు నివాస స్థలాలైన కోటల వంటివి వుండి వుంటాయి. ఆ విధంగా చార్‌మహల్ సార్థక నామధేయి. మహల్ అనేది మండలానికి మరో పర్యాయం కావచ్చు కూడా! కొన్నాళ్ళు కానుకొల్లు, ఇంకొన్నాళ్ళు బేతవోలు గురజ సంస్థానానికి రాజధానులుగా వున్నాయి కూడా! అయితే, కమదన వంశీకులు ఎక్కువగా గురజలోనే వుండేవారంటారు. ఈ నాలుగు ముఖ్యప్రాంతాల్లో, బత్తరజల్లి అంటే కొల్లేరుకు లోపల వున్న కొల్లేటి కోట, కైకలూరు తదితర ప్రాంతాలు. బాహర్ జల్లి అంటే కొల్లేరుకు బైట వున్న ఇతర ప్రాంతాలు మొదలైనవి అని అర్థం. కమదన వారు నూజివీడు ప్రభువులకు సమీప బంధువులే!

1713-1748 మధ్యకాలంలో నూజివీడును పాలించిన రామచంద్ర అప్పారావు శిస్తు బకాయి పడటంలో దక్కను సుబేదారు అతని తలని నరికి ఏలూరు కోటకు వ్రేలాడదీశారు. రుస్తుం ఆలీఖాన్ అనేవాడు నూజివీడుని స్వాధీనం చేసుకున్నాడు గానీ, చక్కని పాలన అందించ లేకపోవడంతో స్థానిక ప్రజలు ఆదరాభిమానాలు చూరగొన్న నూజివీడు రాజవంశీకుడి కోసం వెదికారు. ఈలోగా, వీరి దూరపు బంధువులైన కమదన అప్పయ్య, కమదన రాయన్నలకు శిస్తు వసూలు బాధ్యత అప్పగించారు.

ఈ కమదన సోదరులు గోల్కొండలో తమ పలుకుబడిని ఉపయోగించి, నూజివీడు ప్రభువుల జమీందారీని పునఃప్రతిష్టిస్తూ ఒక సనదును సాధించారు. వెంకటాద్రి అప్పారావు అనే వారసుడి పేరుతో ఈ సనదు సంపాదించారు. ఆ విధంగా మేకా వంశీకుల్లో ఒక సమర్థుడిని, అన్వేషించారన్నమాట. కానీ, సనదు చేతి కందే సమయానికి ఈ వెంకటాద్రి మరణించాడు.

గురజకు చెందిన ఈ కమదన సోదరులు ఎలాంటి స్వార్థము లేకుండా మేకా రాజవంశీకులకు మేలు చేయడానికే కంకణం కట్టుకున్నారన్నది సుస్పష్టం. వెంకట్రాది తమ్ముడు జగన్నాధ అప్పారావు అనే జగ్గయ్యకు జమీందారీ అప్పగించారు.

ఈ కథను 'జగ్గయ్య' మరో మలుపు తిప్పాడు. అతను రాజ్యానికి రాగానే కమదన సోదరుల్ని అడ్డు తొలగించే ప్రయత్నాలు ప్రారంభించాడు. వాళ్ళు ఈ పరిణామాలు ఊహించలేదు. కానీ, తప్పనిసరి పరిస్థితుల్లో తిరుగుబాటు చేసి, జగ్గయ్యని బంధించారు. జగ్గయ్య అప్పుడు కాళ్ళ బేరానికొచ్చి నిడదవోలు, పెంటపాడు ఇచ్చేందుకు ఒప్పుకొన్నాడు. కమదన సోదరులు జగ్గయ్యని విడుదల చేశారు. విడుదల అవ్వంగానే, కమదన సోదరుల్ని దేశబహిష్కరణ చేశాడు జగ్గయ్య. దాంతో కమదన సోదరులు గోల్కొండ సుల్తాన్‌కు జరిగిందంతా వివరించి, మేకావారి నూజివీడు సామ్రాజ్యం మొత్తాన్నీ తమ పేరుతో రాయించుకు వచ్చారు. మళ్ళీ జగ్గయ్య వారి పాదాల మీద పడి ప్రాధేయపడ్డాడు. ఈసారి చార్‌మహల్ ఎస్టేట్ అంటే కొల్లేరు ప్రాంతం అంతా ఇస్తానని మాట ఇచ్చాడు. కమదన సోదరులు మేకా వంశీకులపైన వున్న రాజ భక్తితో సనదును ఉపసంహరించుకున్నారు. నూజివీడు రాజు 'హవ్వ' అని నవ్వి మళ్ళీ శూన్య హస్తం చూపించాడు. కమదన సోదరులకి తలకాయి కొట్టేసినట్లయ్యింది! తమరాజ భక్తి అపహాస్యం పాలయ్యిందని బాధపడ్డారు.

అప్పట్లో గోల్కొండ సుల్తాన్‌లకు ఫ్రెంచివారు బాగా స్నేహంగా వుండేవారు. అందుకని ఈ కమదన సోదరులు ఈసారి ఫ్రెంచివారిని ఆశ్రయించారు. ఫ్రెంచివారితో జరిగిన యుద్ధంలో జగ్గయ్య ఓడిపోయాడు. బందీగా గుల్బర్గా తీసుకుపోయారు అతని అక్కడే చనిపోయాడు.

ఇంత జరిగినా కమదన సోదరులు నూజివీడు సంస్థానాన్ని ఆక్రమించకుండా, మేకా రాజ కుటుంబీకుల్లో మరొకడు వెంకటాద్రి అప్పారావును పాలకుడిగా ప్రతిష్టించి, అతనికి 1759లో అమర్ దారీ సనదుని, 1763లో జమీందారీ సనదుని ఇప్పించారు. తాము చార్‌మహల్ పాలకులుగా మాత్రమే వుండిపోయారు. అలా ఏర్పడింది 'గురజ' సంస్థానం.

కమదన సోదరులు అధికారంలోకి రావడానికి ముందే ఈ నాలుగు ముఖ్య ప్రాంతాల్ని చార్‌మహల్ సంస్థానంగా వ్యవహరించే వారన్నది ఈ నిరూపణల్ని బట్టి అర్థం అవుతోంది. గురజ నివాసులైన కమదన వంశీకులు పాలించారు కాబట్టి 'గురజ సంస్థానం' అని కూడా అనేవారు.

1764 వరకూ కమదన వంశానికి చెందిన వారసులు సమర్ధవంతంగానే పాలించారు. ఆ తర్వాతి కాలంలో జమీందారీకి కష్టకాలం వచ్చింది. అప్పులు పెరిగిపోయాయి. అవనిగడ్డ జమీందార్లు నూజివీడు జమీందార్లు మొగలితుర్రు జమిందారులూ ఈ

చార్‌మహల్ ఎస్టేట్‌ని కొంతకాలం కౌలుకు తీసుకుని సాకారు. కానీ, జమీందారీ నిలవలేదు. ఈస్టిండియా కంపెనీ కైవసం చేసుకోకతప్పలేదు.

1792లో వీళ్ళ వారసుల్లో ఒకరు శోభనాద్రిరాయణి కంపెనీకి బకాయిలన్నీ కట్టి జమీందారీని అధికారికంగా స్వాధీనం చేసుకున్నాడు. 1803 దాకా అలా అలా నడిచి మళ్ళీ చిటికి కంపెనీ వశం అయ్యింది. 1813లో కలిదిండి బత్తరజల్లి పరగణాల్ని వేలంవేసి వచ్చిన డబ్బుతో గురజ సంస్థానాన్ని నిలబెట్టారు. కానీ, 1876లో పూర్తిగా ఈ జమీందారీ అంతరించిపోయింది.

1792-1836లో గురజను పాలించిన శోభనాద్రిరాయుడు కొంతమేర సారస్వత పోషణ చేశాడు. మల్లంపల్లి మల్లికార్జున శాస్త్రి అనే కవి సత్యవతీ ఉపాఖ్యానంలో శోభనాద్రి ప్రభువు ప్రశంస చేశాడు. "కమదన శోభనాద్రి మహేంద్రుడిదె వృత్తి యలమర్తి నల శోభనాద్రిపురము..." అని అవతారికలో పేర్కొన్నాడు.

గురజ జమీందారీ అంతరించిపోయినా కమదన వంశీకులు గురజలోనే నివసించారు. పాపయ్యారావు పింఛను తీసుకున్న మొదటి జమీందారు. ఈయన కొడుకు నరసింహరావు, మనుమడు వెంకటరావులు శక్తి కొలదీ సాహిత్యపోషణ చేశారు.

వీళ్ళలో 'కమదన వెంకటరావు బహద్దరు' 'వైదర్భీ పరిణయం' అనే నాటకాన్ని రాసినట్టు తెలుస్తోంది. 'సత్కవీంద్రుల సేవించి సాహిత్యమొక కొంత చవిగొని సరసమైన కవిత నల్ల నేర్చి..."న వాడుగా ఈయన్ని కవులు ప్రశంసించారు.

"ఆంధ్ర సంస్థానములు- సాహిత్య పోషణం" గ్రంథంలో తూమాటి దొణప్పగారూ, కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్‌లో గోర్డాన్ మెకంజీ ఈ కమదన వంశీకుల గురించి అనేక వివరాలను రికార్డు చేశారు.

మండవల్లి గ్రామంలో "ఆంధ్ర ప్రబోధినీ గ్రంథ నిలయం" అనే ప్రచురణ సంస్థని నెలకొల్పి మంచి సాహిత్య గ్రంథాలను కమదన వంశీకులు వెలువరింప చేశారు. కమదన వెంకట హనుమంతరావు, వెంకట రామారావు, జగన్నాథరావు, శోభనాద్రిరావు.... ఈ వంశీకుల్లో సారస్వతాభిలాషతో పనిచేసిన వారిలో ప్రముఖులు.

ఆంధ్రభారతి, సారస్వత సర్వస్వం గ్రంథాలు వెలువడటానికి ఈ గురజ జమీందారులే ప్రధాన పాత్ర వహించారు.

'గురజ' తానుగా మహాపట్టణ వైభవాన్ని పొందలేకపోయినా నాలుగు పట్టణాలకు కేంద్రస్థానంగా నిలిచి కృష్ణాతీరంలో పట్టణ వైభవాన్ని అనుభవించింది!

# అత్తిలి

పశ్చిమ గోదావరిజిల్లాలో 'అత్తిలి' ఈ రోజున ఒక గ్రామంగా కన్పిస్తుంది గానీ, రెండు వేల సంవత్సరాలుగా కన్పిస్తున్న తెలుగు వారి చరిత్రకు సాక్షీభూతంగా, కొంతకాలం రాజధాని నగరంగా వెలుగొందిన చారిత్రక పట్టణం అది!

అనేక శాసనాలలో 'అత్తిలి విషయం' ప్రస్తావన కన్పిస్తుంది.

'విషయం' అనే పదం ఒక జిల్లా లేదా ఒక ప్రాంతానికి అనే అర్థంలో పూర్వ కాలంలో వాడుకలో వుండేది. అనుమకొండ విషయం, పెడకల్లు విషయం, బెజవాడ విషయం, భోగాపుర విషయం, వరాహవర్తనీ విషయం, వేంగి విషయం, వేల్పూర విషయం, సగర విషయం... ఇలా చాలా ప్రాంతాల్ని 'విషయం' అనే పేరుతో వ్యవహరించారు.

'అత్తిలి' కూడా అలాంటి విషయంగా వుండేది.

అత్తిలి విషయంలో విప్పర్రు, ఆరవిల్లి కోరుకొల్లు, ఈడూరు, కంచుమర్రు గ్రామాలు వుండేవి. విప్పర్రు 'విప్పఋ'గానూ, ఆరవిల్లి ఆరుపిల్లి గానూ ప్రాచీన శాసనాలలో కన్పిస్తుంది. ఇవి రెండు తణుకు సమీపంలోని గ్రామాలు. ఆయా శాసనాల కాలంలో అవి ప్రసిద్ధ గ్రామాలై వుంటాయి. అలాగే, కోరుకొల్లుని 'కోరుకొలను' అన్నారు. ఇది భీమవరం దగ్గరున్న గ్రామం! తణుకు దగ్గరే, ఈడూరు, కంచుమర్రు గ్రామాలు కూడా వున్నాయి. ఈడూరుని ఇడియూరు అనీ, కంచుమర్రుని కలుచుంబర్రు అనీ శాసనాలలో పేర్కొన్నారు. ఆనాటి ఆ పేర్లు ఆధునికంగా ఇలా మారాయన్నమాట!

నిజానికి క్రీస్తుపూర్వం చివరి శతాబ్దాలలోనూ, క్రీస్తుశకం మొదటి శతాబ్దాలలోనూ 'వేంగి విషయం' అత్యంత ప్రాచీనమైన విషయాలలో ఒకటి. ఈ వేంగి 'పెదవేగి' అనే పేరుతో ఏలూరు దగ్గర ఒక కుగ్రామంగా వుంది ఈనాడు.

క్రీస్తు శకం తొలి శతాబ్దాల నాటి శాలంకాయనుల కాలంలోనూ విష్ణుకుండినుల కాలంలోనూ, 'వేంగి విషయం' అనే పేరుతోనే ఈ ప్రాంతాన్ని పిలిచారు.

అత్తిలి ఈ వేంగి విషయంలో అంతర్భాగంగా కూడా వుండేది.

తూర్పు చాళుక్యులు వేంగి మండలం అనీ, చాళుక్య చోళులు వేంగి రాజ్యం అనీ వ్యవహరించారు. రాజరాజ నరేంద్రుడు కాలంలో వేంగి విషయం అనే అలవాటు కూడా వుండేది.

'అత్తిలి' ఈ రాజన్యుల కాలంతో రకరకాల స్థాయిల్ని పొందింది. ఒకదశలో తణుకు, భీమవరం వరకూ వ్యాపించిన ప్రాంతానికి అత్తిలి రాజధానిగా లేదా ముఖ్య పట్టణంగా వున్నట్లు పైన శాసనాలలో మనం చెప్పుకున్న గ్రామాల పట్టిక చెప్తోంది.

అయితే, ఏలూరు, తణుకు, భీమవరం, నరసాపురం ప్రాంతాల్ని "పానార విషయం" పేరుతో కొంతకాలం వ్యవహరించినట్లు మరికొన్ని శాసనాధారాలు కన్పిస్తున్నాయి. అత్తిలి విషయాన్నే "పానార విషయం"గా వ్యవహరించినట్లు కొందరు చరిత్రకారుల ఊహ. కుందూరు ఈశ్వరదత్తుగారు ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం గ్రంథంలో 'పానార విషయం'లో అత్తిలి విషయం అంతర్భాగంగా వుండి వుండవచ్చని రాశారు. నిజానికి ఇవన్నీ వేంగి విషయంలో అంతర్భాగాలే!

వివిధ కాలాలలో ఆయా గ్రామాలు సాధించిన అభివృద్ధిని బట్టి రాజధాని నగరాలు లేదా ముఖ్యపట్టణాలు మారి వుంటాయి. ఆ పట్టణాన్ని బట్టి ఆ విషయం పేర్లలో మార్పులు కూడా కలిగి వుంటాయి.

వేంగి రాజ్యంలో అత్తిలి విషయం గానీ, పానార విషయం గానీ ఒక ప్రాంతంగా వుండేవి అనేది ఇక్కడ ముఖ్యవిషయం.

ఏడవ శతాబ్దినాటి పృథ్వీ మహారాజు తొండివాడ శాసనంలో 'పాగు వార విషయం' గురించి ప్రస్తావించాడు.

ఈ పృథ్వీ మహారాజు రణదుర్జయుడి కొడుకు. ఈయన పిష్టపురం అంటే పిఠాపురంలో ఒక శాసనం వేయించాడు. కొండమంచి గ్రామ నివాసి, కామకాయనస గోత్రీకుడు విష్ణుశర్మ పుత్రుడు- భవశర్మకి పాకుణార విషయంలోని 'తాగ్గివాడ' గ్రామాన్ని అగ్రహారంగా సర్వబాధా పరిహారం చేసి ఇచ్చాడని ఈ పిఠాపురం శాసనంలో పృథ్వీ మహారాజు పేర్కొన్నాడు.

'పావనవారం' అనేమాట పానారం అయ్యిందని ఒక ఊహ. "పావన వారమున తనుకున కొమ్మన పెగ్గడ్లు" అంటూ తణుకుకు సంబంధించిన ప్రస్తావన ఒక శాసనంలో వుంది. తణుకుని 'తనుకు' అని వ్యవహరించారు. పావన వారంలో 'వారం' అనే పదం ఒక ప్రాంతాన్ని సూచించేదే!

పావునవారం, పానవారం, పానావారం, పావినవార ఇలా అనేక పేర్లు శాసనాలలో కన్పిస్తాయి- ఇవన్నీ అత్తిలి విషయానికి అంటే ప్రాంతానికి వివిధ కాలాలలో జన వ్యవహారంలో వున్న పేర్లన్నమాట.

మొత్తం మీద తాడిపర్రు, వద్దిపర్రు, పాందువ్వ, జేతపూడి, దిగుమర్రు, ఉనిశిలి, అండలూరు, కొండేపూడి, వేంద్రం, మోగల్లు, కోరుకొల్లు, ఆరవిల్లి, తణుకు, విప్పర్రు, చెరుకువాడ, పెనుగొండ, మారుటేరు.... ఈ ప్రాంతాలన్నీ ఆ రోజుల్లో ఈ పానార విషయంలో వుండేవి. అత్తిలి వీటికి కేంద్రస్థానంగా గానీ, ముఖ్యపట్టణం గానీ వుండి వుండవచ్చు. లేదా 'అత్తిలి విషయం' పావన వారంలో కొంతభాగం- అంటే, తణుకు వరకూ వ్యాపించిన ప్రాంతం కూడా అయివుండవచ్చు.

ధవళేశ్వరం వద్ద గోదావరి పైన ఆనకట్ట నిర్మాణం తర్వాత "అత్తిలి విషయం"లోని ఒకనాటి గ్రామాలన్నింటికీ మహర్దశ ఏర్పడింది.

చిత్తపేట నుంచి 40 కి.మీ. పొడవున ఏలూరు వరకూ వచ్చిన కాలువ, బెజవాడ ఆనకట్ట నుంచి ఏలూరు దాకా వచ్చిన కాలువతో కలుస్తోంది.

చిత్తపేటకి దిగువన అరమైలు దూరంలో నుంచి అత్తిలికి వెళ్ళే కాలువ మొదలౌతుంది. వయ్యేరు కాలువ అంటారు దీన్ని. దాదాపు 15 కి.మీ. పొడవైన ఈ అత్తిలి కాలువ మీద ఒకప్పుడు వర్తక వాణిజ్యాల కోసం ఏలూరు నుంచి పడవలే నడిచేవి. కృష్ణా గోదావరి నదుల్ని అనుసంధానం చేస్తూ ధవళేశ్వరం నుంచి బెజవాడ ఆనకట్ట దాకా కాలువలు ఒకదానితో ఒకటి కలిసి జలమార్గం ఏర్పడింది. ఒక ఏలూరు దగ్గర మాత్రమే "లాకులు"న్నాయి. అందువలన ఈ జలమార్గం ద్వారా ప్రయాణం చాలా సులువుగా వుండేది.

వయ్యేరు కాలువ ఏలూరుపాడు దాకా వచ్చిన తర్వాత అక్కడ టైడల్ లాక్‌ని నిర్మించారు. ఉప్పుటేరుకు ఈ టైడల్ లాకుతో సంబంధాన్ని కలిపారు. చిన్నక్కాపురం దగ్గర మరో లాకుని నిర్మించి కొల్లేరుతో ఈ కాలువని అనుసంధించారు. అక్కడికి పదిన్నర మైళ్ళ దూరాన ఉండి గ్రామం వరకూ ఇంకో కాలువని తవ్వారు.

సముద్రంలో వృధాగా కలిసిపోయిన జలాల్ని కొంతమేరకైనా వినియోగంలోకి తేవడం కోసం వెయ్యి కాలువలు తవ్వాలని బ్రిటిష్ ప్రభుత్వం ఆ రోజున పథక రచన చేసినట్లు గోదావరి డిస్ట్రిక్ట్ మాన్యువల్‌లో హెన్రీ మోరీస్ పేర్కొన్నాడు. ఈ జలం అత్యంత విలువైన ద్రవం కాబట్టి దీన్ని "లిక్విడ్ గోల్డ్" అన్నాడాయన.

'అత్తిలి' ఈ కాల్వలకు సంధానకర్తగా వుండటమే ఇక్కడి ముఖ్య విషయం!

రాజులు రాజ్యాల చరిత్ర కన్నా అత్తిలి ప్రజలు నిర్మించుకున్న ప్రజా చరిత్ర ముఖ్యమైందని ఈ అలనాటి పట్టణం తన ప్రాభవ వైభవాలను ప్రకటిస్తోంది!!

# గూడూరు

మచిలీపట్నానికి నాలుగు మైళ్ళ దూరంలో గూడూరు ఒకప్పుడు గొప్ప రేవు పట్టణాల్లో ఒకటి. గూడూరు రేవు పట్టణంగా వున్న ఈనాటి రోజుల్లో మచిలీపట్నం రేవు వుండి వుండకపోవచ్చు. ఈనాటి మంగినపూడి రేవు, ప్రాచీన ఓడరేవు కాకపోవచ్చు.

భౌగోళికంగా చూసినప్పుడు రెండువేల ఏళ్ళనాడు కృష్ణాజిల్లా ఘంటసాల, గూడూరు, దివిసీమలోని కోడూరులు పెద్ద రేవు పట్టణాలే! కానీ, సముద్రం తన దిశని మార్చుకొంది. సునామీల వంటివి ఏర్పడినప్పుడు ఒక చోట సముద్రం వెనక్కి పోవడం, ఒకచోట సముద్రం ముందుకు చొచ్చుకు రావడం జరుగుతుంటాయి. అలా, సముద్రం ఘంటసాలనీ, గూడూరునీ వదిలి చాలాదూరం వెనక్కి వెళ్ళి పోయింది. బదులుగా అనేక నగరాలను ముంచెత్తి వుండొచ్చు. ఎన్నో గ్రామాలు, ఎన్నెన్నో పంటపొలాలు, సముద్రగర్భంలో వుండి వుండొచ్చు కూడా! "పితుంద్రా" అనే నగరం బందరుకు సమీపంలో వుండేదని కొన్ని ఆధారాలు చెప్తున్నాయి. ఖారవేలుడు ధ్వంసం చేసిన ఆ నగరాన్ని సముద్రం కబళించి వుంటుందని పండితుల ఊహ. ఇప్పటికీ బందరు సముద్రంలోంచి ఒడ్డుకు కొట్టుకువచ్చి, మళ్ళీ సముద్రంలోకే అలలతో పాటు చేరిపోయే నల్లమట్టి ఇక్కడ సముద్ర గర్భంలో నాగరిక ప్రాంతాలేవో వుండేవనడానికి ప్రబలసాక్ష్యమే!

సరే గూడూరు కథలోకి వద్దాం-

చరిత్రకారుల మధ్య ఏకాభిప్రాయం లేనప్పటికీ, కృష్ణానదీ ముఖద్వారంలో ప్రఖ్యాతి పొందిన వర్తక స్థానాల్లో గూడూరు ముఖ్యమైన రేవు పట్టణమే! ఇక్కడినుంచి చైనా, బర్మా, కాంబోడియా, మలాకా, జావా దేశాలకి వర్తక వాణిజ్యాలు విరివిగా సాగేవి. వాణిజ్య ప్రముఖుల రాకపోకలూ సాగేవి.

బృహత్పలాయనులు ఈ గూడూరు రేవు పట్టణాన్ని రాజధానిగా చేసుకొని పాలించారు.

టోలమీ అనే యాత్రికుడు, పరిశోధకుడు క్రీస్తు శకం 130లో కృష్ణాతీరం గురించి నేటి అనేక విశేషాల్ని రికార్డు చేశాడు. అందులో 'కొడ్డూర' అనే రేవు పట్టణం ప్రస్తావన కూడా వుంది. 'కుడ్డూర' అని కూడా అంటారు.

ఈ 'కొడ్డూర' బందరు దగ్గరి 'గూడూరు' అని ఎక్కువమంది చరిత్రకారులు అభిప్రాయపడ్డారు.

సముద్రతీరాన వున్న ప్రాచీన నగరం కోడూరు ఈ 'కొడ్డూర' కావచ్చని ఇంకొంతమంది చరిత్రకారుల భావన.

1883లో కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్‌ను తయారుచేసిన గోర్డాన్ మెకెంజీ కాలం నుంచీ ఈ వివాదం వుంది.

స్మిత్స్ ఏనిషియంట్ అట్లాస్‌లో 'కొలొనెల్‌యూల్'' టోలెమీ చెప్పిన మైసోలస్ నది ఒడ్డున వున్న కొడ్డూర ఈ గూడూరేనని స్పష్టంగా నిర్ణయించాడు. ఇదే నిర్ణయాన్ని ఎక్కువమంది చరిత్రకారులు ఇప్పటికీ ఆమోదిస్తున్నారు.

అయితే, బెజవాడ దగ్గరి యనమలకుదురు కూడా టోలెమీ కాలంలో ప్రసిద్ధ ప్రాంతంగానే వుందనీ, కొడ్డూర లేదా కూడూర ఈ ఎనమలకుదురు కావచ్చనే వాదనని కూడా గోర్డాన్ మెకెంజీ ప్రస్తావించాడు.

కొడ్డూర తప్పనిసరిగా రేవు పట్టణం కావాలని లేదు. రేవులో దిగిన సరుకుని కృష్ణా నది దగ్గరకు తెచ్చి అక్కడినించి జలమార్గాన కృష్ణాతీరంలోని వివిధ ప్రాంతాలకు దిగుమతి చేసేవారు. అలాగే, కృష్ణాతీరంలోని వివిధ ప్రాంతాలనుంచి ఉత్పత్తులు జలమార్గాన గూడూరు చేరి అక్కడినించి సముద్రానికి చేరే పద్ధతిలో వాణిజ్య వ్యవహారాలు నడిచి వుండచ్చు.

సముద్రం మీద వాణిజ్యంతో పాటు రాజ్యాధికారం సాధించుకున్న బృహత్ఫలాయనులు గూడూరును రాజధానిగా ఎంచుకొనడానికి అటు సముద్రమూ ఇటు కృష్ణానదీ రెండూ దగ్గరగా వున్న నగరం కావడమే కారణం కావచ్చు.

బృహత్ఫలాయన జయవర్మ కొండమూడి శాసనంలో "విజయ ఖందావారా నగరం కూడూరాతో కూడూర హారే గామం పాంటూరమ్" అని ప్రాకృత భాషలో పేర్కొనడం జరిగింది.

చరిత్ర కందినంత వరకూ మొదట శాతవాహనులు, తర్వాత శాలంకాయనులు, బృహత్ఫలాయనులు, విష్ణుకుండినులు తూర్పు చాళుక్యులు, చాళుక్యచోళులూ వరుసగా ఈ ప్రాంతాన్ని క్రీస్తుశకం మొదటి వెయ్యి సంవత్సరాలు పాలించారు.

టోలమీ చెప్పిన కుడ్డూర అనేది స్థానిక పదానికి గ్రీకు భ్రష్టరూపం. కొడ్డూర లేదా కుడ్డూరకు దగ్గరగా ధ్వనించే పేరు ఏదో అప్పటికి వుండి వుండాలి కదా...

టోలమీ కాలంలో బృహత్ఫలాయనులు, శాలంకాయనులూ వున్నారు. బృహత్ఫలాయనుల శాసనాలలో కూడూర హార అనీ, శాలంకాయనుల శాసనాలతో "కుద్రహారం" అనీ కన్పించే ఈ పేర్లే టోలమీ చేత 'కొడ్డూర'గా పలికించి వుంటాయి.

క్రీ.శ.4వ శతాబ్దినాటి శాలంకాయన స్కందవర్మ కంతేరు శాసనంలో "విజయ స్కంద వర్మాణా, వచనా త్కూదూ హర..." అని పేర్కొన్నాడు.

ఆ తర్వాత క్రీ.శ.420నుంచి 620 వరకూ కృష్ణా గోదావరి మధ్య ప్రదేశాన్ని విష్ణుకుండిన రాజవంశీకులు పాలించారు. వీళ్ళకు బెజవాడ రాజధానిగా వుండేదని అంటారు. మాధ్యవర్మ అనే రాజు వీళ్ళలో ప్రసిద్ధుడు. ఈయన కాలానికి గృధ్రవారం, గుద్దవాడి పేర్లతో ఈ ప్రాంతం అంతా పిలవబడింది.

మూడవ విజయాదిత్యుడి బందరు శాసనంలో 'గుద్రవారం' అనే పదం కన్పిస్తుంది. రెండవ చాళుక్య భీముడు కూడా బందరు శాసనంలో "గుద్ర వార విషయం" అని పేర్కొన్నాడు.

విషయం అంటే, "ప్రాంతం" అని! జిల్లా లేదా తాలూకా అనే అర్థంలో ప్రయోగించ బడిన పదం అది. అనేక శాసనాలలో గృధ్రవాడి, గుద్దవాడి, గుద్రహారం, గుద్రారం అనే పదాలు కన్పిస్తాయి. ఈ గుద్రహారం గుధ్రవాడి పేర్లు 'గుడివాడ'గా మారడానికి కారణం అయినట్లు పండితులు భావిస్తారు.

కుద్రహారంగా పిలవబడిన కాలంలో ఈ ప్రాంతానికి గూడూరు రాజధానిగా వుండేదనీ, ఐదారు వందల ఏళ్ళు గడిచి గుద్రహారంగా ఈ ప్రాంతానికి పేరు మార్పు జరిగి, గుడివాడ రాజధాని అయ్యిందనీ, గుద్రహారం అనే పదాన్ని బట్టే గుడివాడకి ఆ పేరు వచ్చిందనీ కుందూరు ఈశ్వరదత్తు వంటి పరిశోధకుల భావన.

గూడూరు రాజధానిగా వున్న కాలంలో గానీ, గుడివాడ రాజధానిగా వున్న కాలంలో గానీ 'గుద్రవారం' ప్రాంతంలోని గ్రామాలుగా శాసనాలలో కన్పించిన పేర్లలో ఈనాటి దివిసీమలోని గ్రామాలు ఏమీ కన్పించక పోవడాన కొద్దూర, దివిసీమ కోడూరు కాకపోవచ్చని పండితుల ఊహ.

పెందుర్ర, తటివరు, అంగలూరు, వేల్పూరు, పాంబర్రు అనే పామర్రు, మర్ద్రాపల్లి అనే మద్దాలి, పెనుకపఋ అనే పారుపూడి, వంటి గ్రామాలే కాకుండా, ఏలూరు, రామచంద్రాపురంలోని కొన్ని గ్రామాలు కూడా ఈ గుద్రవారంలో వున్నట్లు కుందూరు ఈశ్వరదత్తు గారు ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం గ్రంథంలో పేర్కొన్నారు.

ఈ నిరూపణలు చాలావరకూ బందరు దగ్గరి గూడూరు రెండు వేల ఏళ్ళనాడు తెలుగువారి రాజధాని నగరంగా వుండేదని ఖచ్చితంగా మనం నమ్మవచ్చనడానికి సాక్ష్యాలుగా నిలుస్తున్నాయి.

గుద్రవార ద్వయం కూడా వుంది. రెండు గుద్రవారాలు ఏమిటో స్పష్టంగా తెలియదు. గూడూరు గుడివాడ గానీ, గూడూరు కోడూరు గానీ కావచ్చునంటారు.

కుందూరి ఈశ్వరదత్తుగారు కృష్ణాజిల్లాలోని గూడూరు, గోదావరి జిల్లాలోని రామచంద్రాపురం ఈ రెండింటినీ గుద్రవార ద్వయంగా చెప్పవచ్చని రాశారు.

రాజుల్నీ, రాజ్యాల్ని, విజయాల్నీ కీర్తించే చరిత్రలే చరిత్రగా భావిస్తున్న పరిస్థితుల్లో 'గూడూరు' చరిత్ర సృష్టించిన నగరంగా వెలుగులోకి వచ్చింది. ఈ నగరానికి ఖ్యాతిని తెచ్చింది ప్రజలు. ఉత్పత్తులు సాధించి ఎగుమతులు చేసిన రైతులు, చేనేత కార్మికులు, శిల్పులు, కవులు, స్వర్ణకారులు... వీళ్ళు! వీళ్ళతో నిండివుండేది- రెండువేల ఏళ్ళనాడు... అలనాటి పట్టణం గూడూరు!!

# గూటాల

19 శతాబ్దిలో ప్రాచుర్యాన్ని పొందిన పట్టణాలలో గూటాల ముఖ్యమైంది. శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రి, తిరుపతి వేంకట కవులు, శ్రీరాం వీర బ్రహ్మ కవి వంటి కవి ప్రముఖుల ప్రశంసలు పొందిన మన్యం రాజవంశీకులు- స్వల్పకాలమే అయినా మంచి ఖ్యాతి సంపాదించి పెట్టారు... గూటాల పట్టణానికి!

మొదట్లో గూటాల- "పోలవరం" జమీందారీలో వుండేది. 1812లో పోలవరం ఎస్టేటుని బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ వేలం వేసింది. ఇంజరం, గూటాల, ఇడిపి, తిరుగుడు మెట్ట, పెద్దేహం, ముంగీండపాలెం... ఈ గ్రామాలన్నీ కలిసిన గూటాల సంస్థానాన్ని ఈ వేలంలో ఆనాటి నూజివీడు జమీందారు కొనుగోలు చేశారు.

కానీ, ఎక్కడో దూరంగా వున్న ఈ భూభాగాన్ని నిర్వహించడం నూజివీడు సంస్థానాధీశులకు శక్తికి మించింది కావడంతో, 1827లో మన్యం సత్యలింగం అనే వాణిజ్య ప్రముఖుడు గూటాల సంస్థానాన్ని నూజివీడు జమీందారు దగ్గర నించి కొనుక్కున్నారు. పాతనాగారం ముతాలోని మరికొన్ని గ్రామాల్ని కూడా కలుపుకొని గూటాల సంస్థాన పాలకుడిగా బ్రిటిష్ వారికి పన్ను బకాయిలు కడ్తూ జమీందారుగా వ్యవహరించబడ్డారు.

1938 నాటి లెక్కల ప్రకారం గూటాల సంస్థాన ఆదాయం ఇరవై ఆరు 26 వేల రూపాయలుగా వుంటే ఆరు వేల ఏడువందల ఇరవై రూపాయిలు పేష్కషు చెల్లించేవాళ్ళట.

మన్యం సత్యలింగం స్వతహాగా లక్ష్మీపుత్రుడు. సముద్రం మీద వర్తక వాణిజ్యాలు నిర్వహించి కోట్లకు పడగలెత్తిన కుటుంబం ఆయనది. ఈయన వ్యాపారాలన్నీ 'యానాం' నుంచి జరిగేవి. ఫ్రెంచి వారి పాలనలో యానాం వుండేది కాబట్టి, ఆయన వ్యాపార లావాదేవీలన్నీ ఫ్రెంచివారిలో ముడిపడి నడిచేవి. సత్యలింగం గారి తండ్రి కనకయ్య చాలా ప్రసిద్ధులు. రెడ్డి రాజుల కాలంలో వసంతోత్సవం నిర్వహించి చరిత్ర ప్రసిద్ధి నొందిన ప్రముఖ వ్యాపారవేత్త అవచి తిప్పయ్యశెట్టి ఈ 'మన్యం కనకయ్య'గా అవతరించాడని ప్రజలు భావించుకునేవారట!

1827లో మన్యం సత్యలింగం గూటాల సంస్థానాన్ని కొనుగోలు చేసిన తర్వాత దాదాపు పాతిక సంవత్సరాలు పాలించారు. 1850లో ఆయన మరణానంతరం తమ్ముడు వెంకటరత్నం సంస్థాన పాలన చేపట్టాడు. 1860లో ఆయన కొడుకు కనకయ్య, ఈ కనకయ్య గారి తర్వాత చిన్న కనకయ్యలు వరుసగా అధికారంలోకి వచ్చారు.

ఈ చిన్న కనకయ్య చాలా కొద్దికాలమే పాలనలో వున్నాడు గానీ గొప్ప వాణిజ్యవేత్తగా పేరు పొందాడు. ఫ్రెంచి వాళ్ళతో మంచి సంబంధాలు నెలకొల్పాడు. ఎదురు అప్పులిచ్చి, ఫ్రెంచివాళ్ళని తన గుప్పెట్లో పెట్టుకున్నాడు. ఫ్రెంచి భూభాగంలోంచి చాలా ఆస్తుల్ని కొని జమీందారీని విస్తృత పరిచాడు. వీళ్ళు గూటాలలోకన్నా యానాంలోనే ఎక్కువగా

నివసించినా గూటాలని బాగా అభివృద్ధి చేశారు. యానాంలో గూటాల జమీందార్ల ప్యాలెస్‌ని నిర్మించాడు. గూటాలలోనూ. యానాంలోనూ అన్న సత్రాలు కట్టించి, అవి సమగ్రంగా నిర్వహించబడేలా కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేశాడు. కానీ, దురదృష్టవశాత్తూ పదేళ్ళు కూడా పాలించకుండానే 1873లో చాలా చిన్న వయసులోనే మరణించాడు.

చిన్న కనకయ్య తర్వాత ఆయన భార్య మహాలక్ష్మమ్మ జమీందారీ పాలనచేపట్టి కోస్తా జిల్లాల్లో గొప్ప సంస్థానాధీశుల్లో ఒకరిగా పేరు సంపాదించుకుందనీ ఆమె గురించి "ఆంధ్ర సంస్థానకులు- సాహిత్య పోషణము" గ్రంథంలో తూమాటి దొణప్ప గారు రాశారు.

మన్యం మహాలక్ష్మమ్మ గారు తనని చిన్ననాడు ఆదుకొని ఆదరించిందని చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రి గారు తన స్మృతులలో రాసుకున్నారు. చేతికి ఎముక లేనట్లు దానధర్మాలు చేస్తూనే, కుటుంబపరమైన వాణిజ్య లావాదేవీలన్నీ నిర్వహించేదట ఆవిడ.

కాశీ పండితులు పుల్య దక్షిణామూర్తి శాస్త్రి గారి పాండితీ వైభవాన్ని విని ఆయనకి ముక్కారు పండు, కేదార ఖండం ఇచ్చి సత్కరించిందట!

కవి పండితుల్ని, కళాకారుల్ని, భాగవతుల్ని పోషించి ప్రోత్సహించిన ధనికులకు కీర్తి ఆచంద్ర తార్కారం వుంటుంది. కవుల్ని, కళాకారుల్ని హీనంగా చూసిన వాళ్ళూ, వీళ్ళకి మనం ఎందుకివ్వాలి అని లోభత్వంతో వ్యవహరించిన వాళ్ళు చరిత్రలో ఎక్కడా చోటులేని వారిగా మరుగున పడిపోతారు. ఒక వంద సంవత్సరాలు పాలించిన ఒక రాజ వంశంలో ఒకరో ఇద్దరో మాత్రమే ప్రసిద్ధులు కన్పిస్తారు. ఎందుకంటే, వాళ్ళు కవుల్నీ, కళాకారుల్నీ ప్రోత్సహించారు కాబట్టి!

మన్యం మహాలక్ష్మమ్మ గారి పాలనా కాలంలో గూటాల సంస్థానానికి చాలా గొప్ప పేరు వచ్చింది. ఆమె, వేద పండితులనే కాకుండా, బొమ్మలాటలు, వీధినాటకాలు, కూచిపూడి భాగవతుల్ని కూడా ఆదరించారట. యానాంలో మన్యం మహాలక్ష్మమ్మగారి మేడ ఎదురుగా జరిగే తోలు బొమ్మలాటల్ని, వీధినాటకాల్ని తాను స్వయంగా చూసినట్టు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారు రాసుకున్నారు. అప్పుడాయన వయసు పదేళ్ళు.

"నను బాల్యంబది యాదిగా నెఱిగి యేనాడేని నే వచ్చినం తనె
వెన్ వెంటన దర్శనం బొసగి సంతానంబు కన్నన్ గడున్
ఘన సంప్రీతిని జూచు నీయెడల నిక్కమైన నా పేర్మి
చక్కని నీకీర్తికి శాశ్వతంపు గరిమన్ గల్పించె నీ రీతిగన్"

అని కీర్తించాడు చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రి గారు గూటాల జమీందారీకి మన్నెం మహాలక్ష్మిమాంబ గారిని! గూటాలకు తెలుగు నేలపైన ప్రశస్తిని తెచ్చిన ఈ విదుషీమణి ధన్యజీవి. ప్రజారంజక పాలన అందించిన బహుకొద్ది జమీందార్లలో గూటాలను పాలించిన మన్యం వంశీకులు ముఖ్యాలనే చెప్పాలి.

# ఈమని

ఈమని చరిత్ర ఈనాటిది కాదు- కనీసం ఎనిమిదవ శతాబ్దం నుంచీ ఈమని చారిత్రక ప్రాధాన్యత కల్గిన పట్టణంగానే వుంది. క్రీ.శ.888-918 మధ్యకాలంలో పాలించిన మొదటి చాళుక్య భీముడి బెజవాడ శాసనంలోనూ, క్రీ.శ.945-970 మధ్య కాలం నాటి రెండవ అమ్మరాజు శాసనంలోనూ ఈమని ప్రస్తావన కన్పిస్తుంది.

క్రీ.శ.763 నాటికే ఆరువేల మూడువందల గ్రామ పరిమితులున్న "త్రిశతోత్తర షట్సహస్రావని"గా పేరొందిన వెలనాడులో ఈమని ప్రధాన గ్రామం. మొదటి విజయాదిత్యుడు తూర్పు చాళుక్య ప్రభువు. 8వ శతాబ్ది కాలంలో ఈయన వేయించిన ఒక శాసనంలో "విశనాండు"గా పేర్కొన్న ప్రదేశం ఈ వెలనాడేనని పండితులు అంటారు.

వెలనాటి మల్లవర్మ త్రిలోచన పల్లవుడికి యుద్ధాలలో కుడిభుజంగా నిలబడి, రాజ్యసాధన చేసిపెట్టాడు. అందుకు ప్రతిగా వెలనాటికి సామంతుడిగా నియమితుడయ్యాడని ఒక శాసనం చెప్తోంది. "శ్రీమాన్ వీరరసాస్రయో గుణనిధిః శ్రీ మల్ల భూపో జనియన త్రంబక పల్లవాద్రణ శిర స్సాహాయ్య కారాచిరాన్ ప్రాప్తోయం వెలనాణ్డు నామ విషయ స్సామంత చిహ్నై స్సహ" అని, త్ర్యంబక పల్లవుడి దగ్గరనుంచి సామంత చిహ్నాలతో సహా వెలనాటిని పొందినట్లు ఈ శాసనం చెప్తోంది. ఆరువల వెలనాడు అని, వెలనాటి విషయం అనీ, దీనికి పేర్లుండేవి.

వెలనాటి పాలకులలో విష్ణువర్ధనుడు, రెండవ గొంకరాజు, కొమ్మనాయకుడు వీళ్ళు ప్రసిద్ధులు. తెనాలి నుంచి, గుంటూరు- సత్తెనపల్లి వరకూ వున్న ప్రాంతం అంతా వెలనాడే! ధనదేశ్వర నగరం అంటే, ఈనాటి 'చందోలు' ఈ పాలకులకు రాజధానిగా వుండేది. నెల్లూరు వరకూ ఈ పాలకులు తమ రాజ్య విస్తరణ చేసికొన్నట్లు తెలుస్తుంది. కృష్ణానదికి ఆవలి తీరంలో ఒకవైపు పలనాడు, ఇంకొకవైపు వెలనాడు ప్రసిద్ధనాడులు లేదా ప్రాంతాలు. ఈమని ఈ వెలనాటి వెలలేని మాణిక్యంగా వెలిగిన పట్టణం.

ఈ వెలనాడులో 'కంద్రవాడి' ఒక అంతర్భాగంగా వుండేది. ప్రాచీన శాసనాలలో 'కండేరు వాడి'గా పేర్కొనబడిన ప్రాంతం ఈ కంద్రవాడేనని పరిశోధకులంటారు. ఉత్తర కండేరు, దక్షిణ కండేరుగా వెలనాడు రెండు భాగాలుగా వ్యవహరించబడినట్లు కన్పిస్తుంది.

సత్తెనపల్లి ప్రాంతాన్ని ఉత్తర కండేరువాటికగా ప్రాచీన శాసనాలలో పేర్కొనడం జరిగింది. తెనాలి పరిసర ప్రాంతాలు దక్షిణ కంద్రవాడిగా పిలువబడ్డాయి.

మొదటి చాళుక్య జయసింహుడి నిడమర్రు శాసనంలో కంద్రవాడి ప్రాంతానికి గండేరు రాజధాని అంటూ, గుంటూరు సత్తెనపల్లి ప్రాంతాలతో పాటు, దుగ్గిరాలపూడి అనే పేరుతో దుగ్గిరాలనీ, దావులూరు పేరుతో దావులూరునీ పేర్కొన్నారు.

దక్షిణ కందేరులో ఈవని కంద్రవాడి, దొడ్డి కంద్రవాడి, గుడ్ల కంద్రవాడి అని మూడు ప్రాంతాలుండేవి.

'ఈమని'ని ఆ రోజుల్లో 'ఈవని'గా పిలిచారు. "ఈవని కంద్రవాడి"లో గుండిమెడ, కూరగల్లు, ఈమని అనే ఊళ్ళున్నాయి. వీటిలో ఈవని ప్రధాన పట్టణం కాబట్టి, ఈవని కంద్రవాడి లేదా "కందేరువాడి" "కందేరు" అని వ్యవహరించారు.

గుడ్ల కంద్రవాడి అంటే "అమరావతి ప్రాంతం" లాము, తాడికొండ గుంటూరు ప్రాంతాల్లోని గ్రామాలన్నీ గుడ్ల కంద్రవాడిగా వ్యవహరించబడ్డాయి. క్రీ.శ.945-971 నాటి రెండవ అమ్మరాజు శాసనంలో ఈ కంద్రవాడికి సంబంధించిన వివరాలు చాలా వున్నాయి.

తూర్పున తూండేరు, ఆగ్నేయ భాగాన గారలగుంట, దక్షిణాన లాము, ఉత్తరాన బూరుగు, నైరుతిని ఒడ్డగుంట, పశ్చిమాన చైత్యం అనే పెద్ద తటాకం, వాయువ్యంలో భీమసముద్రం అనే పెద్ద తటాకం, ఉత్తరాన ఏనుకరాలు, ఈశాన్యంలో రేగడి గుంట ప్రాంతాలున్నట్లు ఈ శాసనంలో వుంది. దీన్ని బట్టే ఆనాటి ఈవని కందేరు వాడి, గుడ్లకందేరు వాడి, దొడ్డ కంద్రవాడి పేర్లు తెలిశాయి.

ధనదుపురం అంటే, చందోలు రాజధాని నగరంగా వున్న కాలంలో ఈమని ఒక ప్రముఖ ప్రాంతానికి రాజధానిగా వుండేదని, ఆ ప్రముఖ ప్రాంతాన్ని ఈమని కందేరువాడి లేదా ఈమని కంద్రవాడి అని పిలిచేవారనీ మనకు అర్థం అవుతోంది. ఇది వెయ్యేళ్ళనాటి సంగతి.

తెనాలి, చందవోలు అంటే చందోలు- మధ్య వున్న ప్రాంతం అంతా చారిత్రాత్మకమైనదనీ, ప్రతి గ్రామంలోనూ శిలాశాసనాలూ, రాగిపత్రాలూ దానశాసనాలూ ఎన్నో దొరుకుతున్నాయనీ, 1883లో కృష్ణా డిస్ట్రిక్ట్ మేన్యువల్‌లో గోర్డాన్ మెకంజీ పేర్కొన్నాడు.

భట్టిప్రోలు బౌద్ధస్తూపం బైటపడిన కాలం అది. క్రీ.శ.1-2వ శతాబ్దాల కాలం నాటి స్తూపం ఇది. వెల్లటూరు వైపు రోడ్డు వేస్తున్నప్పుడు ఈ బౌద్ధ స్తూపంలో చాలా భాగాన్ని తవ్వి రోడ్డు కింద పోసేశారు. స్థూపంలోని శిలాఫలకాలన్నీ రోడ్డులో కలిసి పోయాయి. కొల్లూరులో 1172 కాలం నాటి శిలాశాసనాలు చోళరాజులవి చాలా దొరికాయి. అనంతవరం, చులుమూరు, కొల్లిపర, దావులూరు ఇవన్నీ వెయ్యేళ్ళ నాటి చరిత్రకు దర్పణంగా నిలిచిన అనేక చారిత్రక ఆధారాల్ని అందించిన గ్రామాలుగా గోర్డాన్ మెకంజీ

పేర్కొన్నాడు. ఈ శాసనాలనూ, శిల్ప సంపదనూ ఎన్నింటిని ఇంగ్లండ్‌కి తరలించారో, ఎన్నింటిని బ్రిటిష్ అధికారులు తమ ఉద్యానవనాలలో అలంకరించుకున్నారో ఇప్పుడు కనిపెట్టడం కష్టం. కొలకలూరులో 1202 నాటి చోళరాజుల శాసనాలు, 1318 నాటి ప్రతాపరుద్రుడి శాసనాలు దొరికాయట.

కొమ్మమూరు కాలువని దుగ్గిరాల మీంచి తవ్వారు. రెడ్డిరాజుల కాలంనాటి చాలా శాసనాలు ఇక్కడ లభించాయని, చోళరాజులు కట్టించిన దేవాలయాలు ఈ ప్రాంతాలలో చాలా వున్నాయనీ మెకంజీ పేర్కొన్నాడు.

ఇది కేవలం 'ఈమని'కి మాత్రమే వర్తించే చారిత్రక విషయాలు కావు. భట్టిప్రోలు-తెనాలి మధ్య వున్న ప్రాచీన గ్రామాలన్నింటికీ వర్తించే వెయ్యేళ్ళ నాటి చరిత్ర! వెయ్యేళ్ళ క్రితం ఈమని ప్రముఖ పట్టణంగా వుంది. కాలక్రమంలో వివిధ కాలాలలో ఇంకా అనేక పట్టణాలు అభ్యున్నతికి నోచుకున్నాయి.

ఆధునిక యుగంలో "తెనాలి" అత్యంత ప్రాచీనయుగంలో భట్టిప్రోలు, తర్వాతి కాలంలో చందోలు, మధ్యయుగంలో ఈమని అర్వాచీనంగా దుగ్గిరాల తదితర ప్రాంతాలు ప్రముఖ పాత్ర నిర్వహించాయి. ఈమని తూర్పు చాళుక్య రాజుల కాలంలో ఒక వెలుగు వెలిగిన అలనాటి పట్టణం! ఇదీ ఈమని కథ!

# కొల్లేరు

కృష్ణాతీరానికి వన్నె తెచ్చిన మహా సరస్సు కొల్లేరు అనేక వందల సంవత్సరాలుగా సాగిన ఆంధ్రుల చారిత్రక వైభవానికి ఒక ప్రత్యక్ష సాక్షి.

మహా కవి దండి తన దశకుమార చరిత్రలో ఆంధ్రదేశాన్ని ప్రస్తావించాడు. ఆ కాలంనాటికి ఆంధ్రదేశం అంటే, వేంగి రాజ్యమే! ఏలూరుకు ఐదారు మైళ్ళ దూరంలో పెదవేగి అనే వూరు వెయ్యి నుంచి పన్నెండు వందల ఏళ్ళ పాటు ఈ వేంగి రాజ్యానికి రాజధానిగా వుంది. ఆంధ్ర రాజధాని నగరం వేంగికి సమీపంలో ఈ మహా సరస్సు వుందని రాశాడు. ఆంధ్ర రాజధాని నగరాన్ని "ఆంధ్ర నగరం" అని పేర్కొన్నాడు.

ప్రాయాసి పంచ దినైః కైశ్చి దంధ్రనగరం తస్య
నాత్యాసన్నే సవిల రాసి సదృశస్య కలహంస
గణదళిత నళిన దళ సంహతి గళిత
కింజల్క శకల శారస్య సారసశ్రేణి శేఖరస్య
సరస్తీర కాననే కృత నికేతన స్థితః" అంటూ ఈనాడు కొల్లేరుగా పిలవబడ్తున్న ఆ మహాసరస్సును వర్ణించాడు.

సరసీపురం, పద్మినీపురం, కమలాకరపురం అనే పేర్లతో కూడా అనేక శాసనాలలో ఈ ప్రాంతాన్ని వర్ణించడం జరిగింది. ఈ ప్రాంతాన్ని కొలనివీడు అనీ, కొలని మండలం అని కూడా వ్యవహారంలో వుంది.

కొలని మండల పాలకుడైన కేశవ దేవరాజులుని స్తుతిస్తున్న ఒక శాసనంలో "స్వస్తి సమస్త జన పరివృతాలంకృతుండునుం గమలాకర పుర వల్లభుండును... మన్నియ దేవేంద్రుడునైన శ్రీ మన్మహామండలేశ్వర కొలని మండలిక కేశవ దేవరాజులు..." అని వుంది.

వెలనాటి "గొంక" చోడుడు సిరిపురం శాసనంలో "కొలను'ని జయించి, దాని పాలకుడైన భీముడనే వాణ్ణి చంపి ఆంధ్ర భూతలాన్ని పదారు వేల కాలాలపాటు సుస్థిరంగా ఏలినట్లు వుంది. వెలనాటి గొంక క్రీ.శ.1109 నాటివాడు.

ఇల వెలనాటి గొంక వసుధేశు తనూభవుడైన చోడభూ
తల పది చోడ పట్టము ముదంబున గట్టి భుజా బలంబమునన్
గొలను జయించి యందు రిపుకుంజరు భీముని జంపి యాంధ్ర
తలము పదారువేలు సతత స్థితినేలె సురేంద్ర లీలలన్-"
అని ఈ శాసనంలో రాసి వుంది.

శ్రీనాధుడు భీమేశ్వర పురాణంలో కొలని ప్రతాపరుద్రుడు ఆరేటి గ్రామాన్ని బెండపూడి అన్న మంత్రికి అగ్రహారంగా దానం ఇచ్చినట్లు పేర్కొన్నాడు. కొలనిమండలం అంటే, గుడివాడ నుంచీ ఆకివీడు దాకా వున్న ప్రాంతాలు, అటు ఏలూరు వరకూ వున్న ప్రాంతాలూ భాగంగా వుండి వుంటాయి.

కొలను మండలంలో పెద్దకొలని ఏరు అంటే, సరస్సు వుందని, అదే కొల్లేరుగా జన వ్యవహారంలో మిగిలిందనీ పండితులు భావిస్తారు. నిజానికి ఈ రోజున ఆశగా వెళ్ళి కొల్లేరుని చూస్తే అక్కడ ఆక్రమించిన స్థలాలు, చేపల చెరువులు తప్ప అలనాటి కలువపూల కొలనులుగానీ, విదేశీ జాతి కొల్లేటి కొంగలు గానీ, దండి మహాకవి వర్ణించిన సలిలరాశి సదృశ కలహంసలు గానీ, సారసశ్రేణులు గానీ ఏమీ మనకు కన్పించవు. చాలా నిరాశపడి పోతాం. అయినా, వున్నంతలో 'సరసీపురం' ఖ్యాతిని ఇనుమడింపచేసే "సరస్సు" ఇంకా చెప్పుకోదగినంత వుంది అక్కడ!

క్రీ.శ.640 నాటికి వేంగిరాజ్యంలో పల్లవుల పాలన అంతమై, చాళుక్యరాజులు పాలించడం ప్రారంభించారు. కుబ్జ విష్ణువర్ధనుడు పాలకుడిగా వచ్చాడు. ఈయన తూర్పు చాళుక్య రాజవంశ స్థాపకుడు. అప్పటినించీ, నాలుగు వందల సంవత్సరాలకాలం ఈ తూర్పు చాళుక్యులు ఆంధ్రదేశాన్ని పాలించారు. రాజరాజ నరేంద్రుడు వేంగి నించి రాజధానిని రాజమహేంద్రవరంకు తరలించే వరకూ కనీసం 26 మంది ప్రసిద్ధులైన రాజులు ఈ రాజ్యాన్ని పాలించారు.

డా॥ బర్నెల్ ఈ తూర్పు చాళుక్య రాజవంశీకులకు సంబంధించిన ఐదు రాగిపత్రాల్ని సంపాదించాడు. వాటిలో రెండు కొల్లేరులో దొరికాయి.

1237-1282 మధ్య కాలంలో లాంగూల్య గజపతి అనే ఒరిస్సా రాజు ఈ ప్రాంతాన్ని జయించి, కొల్లేరు లోపల 'కొల్లేటి కోట' పేరుతో ఒక సురక్షిత స్థావరాన్ని ఏర్పరచుకోవడం కోసం ఒక కోటని నిర్మించాడు.

కర్నాటి రాజులు, ఢిల్లీ సుల్తాన్‌లు అప్పట్లో వీళ్ళకు ప్రధాన శత్రువులు. సరస్సు ఒడ్డు వరకూ చాలా సార్లు శత్రురాజులు దూసుకువచ్చారు. కానీ, సరస్సు దాటి కొల్లేటికోట లోపలికి రాలేకపోయారు. అప్పుడే ఉప్పుటేరుని తవ్వి కోట చుట్టూ వున్న కొల్లేటి నీటిని ఈ ఉప్పుటేరు ద్వారా బైటకు మళ్ళించడంతో కొల్లేరు ఖాళీ అయి, కోటని ముట్టడించడానికి అవకాశం ఏర్పడింది. ఈ ఉప్పుటేరుని తవ్వడం కోసం తన కూతురుని బలి ఇచ్చాడట శత్రు సైనికుల సేనాధిపతి! అలా రాజ్యం కోసం ప్రాణాలు బలి ఇచ్చిన ఆమెని పేరంటాలమ్మగా కొలుస్తారు ఇప్పటికీ అక్కడ! ఆ ప్రాంతాన్ని పేరంటాల కనుమ అని కూడా అంటారు.

1860లో షుమారుగా 150 ఏళ్ళ నాటి సెటిల్‌మెంట్ రిపోర్టులో ఈ కొల్లేటి నీటిని ఎత్తిపోతల ద్వారా ఉపయోగించుకొని చాలా ఎకరాల భూమి సాగు అవుతున్నట్లు వుంది. వేసవిలో ఈ నీటి మట్టం తగ్గిపోయి పంట పొలాలు ఎండిపోకుండా ఉప్పుటేరు ముఖద్వారం దగ్గర ఒక "ఎస్కేప్ వయర్"ని నిర్మించారు! నీరు వృథాగా బైటకు పోకుండా నిరోధించగలిగారు. చాలాకాలం ఈ విధంగానే కొల్లేటి నీటితో 'పంటల సాగు' బ్రహ్మాండంగా జరిగింది. కృష్ణా గోదావరికి ఆనకట్టల నిర్మాణం పూర్తయ్యాక 1850 తర్వాత కొల్లేరు ప్రాంతంలోని గ్రామాలన్నీ ఆనకట్ట కింద సాగులోకి వచ్చాయి. సముద్రం అలలు ఉప్పుటేరు లోపలికి వచ్చేలాగా, టైడల్ ఇన్‌లెట్ నిర్మాణం చేశారు. ఆవిధంగా ఎందుకో తవ్విన కాలువ ఉప్పుటేరుగా ప్రసిద్ధిపొందింది.

బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ కాలంలో, ఈ ఆనకట్ట వ్యవస్థ చాలా ప్రత్యేకంగా వుండేదనీ, ఈ సరస్సు కింద సాగయ్యే భూములలో వ్యవసాయం చేసేవారికి భూముల్ని అద్దెకిచ్చి పంటలు పండింపచేసినట్లు కనీసం 44 గ్రామాలు ఈ కొల్లేరులో ఆనాటికి వున్నట్లు కృష్ణాడిస్ట్రిక్ట్ మాన్యువల్‌లో గోర్డాన్ మెకంజీ పేర్కొన్నాడు.

కొల్లేరు తీరంలో కైకలూరు, కలిదిండి, కానుకల్లు ప్రాచీన పట్టణాలు. కలిదిండి, కానుకల్లు, గ్రామాల్లో రెడ్డి రాజుల కాలం నాటి నిర్మాణాలు, కోటలూ వున్నాయి.

1759 మార్చి 3న కెప్టెన్ మెక్లీన్ కానుకల్లు కోటను స్వాధీనం చేసుకొని సైనిక స్థావరం ఏర్పరిచాడు.

మండపాడులో కుబ్జ విష్ణువర్ధనుడి శాసనం ఒకటీ, ప్రతాపరుద్రుడి శాసనం ఒకటీ దొరికాయని మెకంజీ పేర్కొన్నాడు. కౌతరం, గుడివాడ ప్రసిద్ధ బౌద్ధక్షేత్రాలుగా వుండేవి.

ఇలా, కొల్లేరు– దాని తీరంలోని అనేక చారిత్రక పట్టణాలు– ఆంధ్రుల చరిత్రకు నిలువెత్తు సాక్ష్యులుగా ఈనాటికీ నిలిచి వున్నాయి!!

# కూచిపూడి

క్రీస్తుశకం 1678లో తానీషాగా ప్రసిద్ధుడైన గోల్కొండ సుల్తాన్ అబ్దుల్ హసన్ కుతుబ్‌షా తన రాజ్యంలో తూర్పు తీరప్రాంతాల్లో విస్తృతంగా పర్యటించాడు. కొండపల్లి, బెజవాడ దాటి కూచిపూడి వచ్చేసరికి సాయంకాలం అయ్యింది. ఆ రాత్రికి తన పరివారంతో సహా అక్కడే విడిది చేశాడు.

మాదన్న మంత్రి ఆయనను అనుసరిస్తున్నాడు. కూచిపూడి పురప్రముఖులు ఎవరో వచ్చి రాజావారిని దర్శించుకొని వెళ్ళారు. ఆ వూరుకు సుల్తాన్ తానీషాకు పూర్తి విశ్రాంతి ఏర్పాట్లు చేశారు.

ఆయన అలా విశ్రాంతి తీసుకొంటూ వుండగా, దూరంగా గజ్జలచప్పుడు, సన్నటి సంగీతం విన్పించసాగింది... మాదన్నగారిని పిలిపించి అదేమిటని అడిగాడు.

మాదన్న గారు కూచిపూడి నాట్య ప్రక్రియ గురించి, దాని విశిష్టత గురించి, ఆ కళాకారుల ప్రతిభ గురించీ వివరించాడు. దక్షిణ భారతదేశం అంతా ఈ కూచిపూడి నాట్యం చాలా ప్రసిద్ధి చెందిందని చెప్పాడు. ఆశ్చర్యపోయాడు సుల్తాన్. వెంటనే ఆ భాగవతుల్ని పిలిపించి, అక్కడ నాట్యం ఆడించవలసిందిగా ఆజ్ఞాపించాడు.

కూచిపూడి భాగవతులు చాలా సంతోషంగా వచ్చి తమ నాట్యవిద్యా వైశిష్ట్యాన్ని ప్రభువు ముందు ప్రదర్శించారు. మెచ్చుకున్న అబ్దుల్ హసన్ ఆ కూచిపూడి గ్రామాన్నే ఈ భాగవతుల కుటుంబాలకు జీవనోపాధిగా వుండేట్లు వాళ్ళకు అగ్రహారంగా రాసి ఇచ్చేశాడు.

కూచిపూడి నాట్య కళాకారుల్లో వేదాంతం వారు, వెంపటివారు, 'హరి'వారూ, భాగవతుల వారూ... ఇలా అనేక కుటుంబాలు ఈ ఈనాముని అప్పటినించీ, అంటే 1678 నుంచి తరతరాలుగా అనుభవిస్తున్నాయి. జీవిక కోసం ఈ ఏర్పాటు కొంతమేర ఉపయోగపడింది కాబట్టి, వారు నాట్యవిద్య మీద దృష్టిని పెట్టుకోవడానికి అవకాశం ఏర్పడింది.

అలా ఒక వంద సంవత్సరాలు గడిచాయి. 1762-92 మధ్యకాలంలో కూచిపూడి అగ్రహారికుల మధ్య వివాదాలు ఏర్పాడ్డాయి. అగ్రహారం మీద వచ్చే ఆదాయాన్ని తలాకొంతా తీసుకునే విషయంలో ఈ వివాదం వచ్చింది.

అప్పుడు ఈస్టిండియా కంపెనీ చీఫ్‌కి దుబాషీలుగా పనిచేస్తున్న మొసలి కంటిభానోజీ పంతులు, కాండ్రేగుల జోగిపంతులు అనే ఇద్దరు పెద్దమనుషులకి వీరి తగువుని పరిష్కరించవలసిందిగా ఆనాటి మచిలీపట్నం నవాబు ఆదేశించాడు. ఈ పెద్దలిద్దరూ

చేసిన నిర్ణయం ప్రకారం ఈ కుటుంబాలన్నీ కలిసి కూచిపూడి భూముల్ని సమానంగా పంచుకున్నాయి. వాటిని నిలుపుకోగలిగిన వారు నిలుపుకోగా, అమ్ముకున్నవారు అమ్ముకున్నారు. అయినా, ఆ రోజున తానీషా ఇచ్చిన అగ్రహారాన్నే నమ్ముకొని నాట్యకళకే జీవితాన్ని అంకితం చేసుకున్న కుటుంబాలు కూచిపూడిలోనే వున్నాయి.

పామర్రు నుంచి కుడివైపుకి తిరిగి సముద్రతీరం వైపు ప్రయాణిస్తుంటే, కూచిపూడి, మొవ్వ, పెద్ద కళ్ళేపల్లి, చల్లపల్లి, మోపిదేవి, అవనిగడ్డ, కోడూరు వంటి అత్యంత ప్రాచీన చారిత్రాత్మక పట్టణాలు వరుసగా కన్పిస్తాయి!

ఇదంతా దివిసీమ వైభవానికి దివ్యమైన తార్కాణం!!

మొదట ఈ దివిసీమ నూజివీడు జమీందార్ల ఆధీనంలోనే వుండేది. ఫ్రెంచివాళ్ళు నూజివీడు వారినించి ఈ సీమని స్వాధీనం చేసుకొని అవనిగడ్డలో ఒక కోటని కట్టుకున్నారు. ఫ్రెంచివారు బ్రిటిష్‌వారితో ఓడిపోయి, పెట్టె బేడా సర్దుకుని వెళ్ళిపోయాక, ఈ దివిసీమని తమ కానుకగా 'కాంద్రేగుల జోగిపంతులు' అనే దుబాషీకి ఇచ్చుకున్నారు బ్రిటిష్‌వాళ్ళు. ఆవిధంగా కాంద్రేగుల జోగిపంతులు కూచిపూడి వారి బాగోగులకు బాధ్యుడై వారి వివాదాల్ని పరిష్కరించడానికి అవకాశం కల్గింది.

కృష్ణాతీరంలో కూచిపూడి, అయ్యంకి సాహితీ సాంస్కృతిక వైభవానికి గుర్తులు.

ఇది 'కుచేలపురం' అని దీని స్థలపురాణం చెప్తుంది.

తరంగాలను రచించి, వాటిని నాట్య శాస్త్రానికి మేళవించిన నారాయణ తీర్థులవారు కృష్ణాతీరం వాడేనని పండితుల ఊహ. తమిళనాడు వాడని కొందరంటారు. కృష్ణకు ఆవలి వైపున కొల్లూరు వాడనీ, ఈవలి వైపున దివిసీమ వాడనీ మరికొందరు పండితులు భావిస్తూ వుంటారు.

ఈ నారాయణ తీర్థుల వారి శిష్యుడు 'సిద్ధప్ప'. సిద్ధేంద్ర యోగిగా ఈయన కూచిపూడిలో నివాసం ఏర్పరచుకొని, కూచిపూడి నాట్యకళకు కారకుడు ప్రేరకుడిగా నిలిచాడు.

నారాయణ తీర్థులవారు అంధులనీ, వారికి కళ్ళు కన్పించేవి కావనీ అంటారు. ఆయన నిద్రిస్తున్నప్పుడు, ఆయన పొట్టమీద చిన్ని కృష్ణుడు నాట్యం చేసేవాడట.

సిద్ధేంద్రయోగి ఇది గమనించి గురువుగారికి చెబితే, ఈసారి శ్రీ కృష్ణులవారు కన్పిస్తే నువ్వూ నేనూ తరించేది ఎప్పుడో అడగమని ప్రోత్సహించాడట.

అప్పుడు కృష్ణుడు "పారిజాతపహరణం" కథని ఒక నృత్యరూపకంగా తయారుచేసి, ఆ కథకు ప్రచారం కల్పిస్తే సిద్ధేంద్ర యోగి తరిస్తాడనీ, నారాయణ తీర్థులకు మాత్రం ఇంకొక జన్మ వుందనీ చెప్పినట్లు ఒక కథ ప్రచారంలో వుంది.

తన పారిజాతాపహరణం నృత్య కావ్యాన్ని ప్రదర్శించడం కోసం సిద్ధేంద్రయోగి కొందరు పిల్లల్ని కూచిపూడిలో చేరదీసి, వాళ్ళకు నృత్యం నేర్పి, వాళ్ళని గొప్ప కళాకారులుగా తీర్చిదిద్దాడని అంటారు.

భామాకలాపం, గొల్ల కలాపం తరంగాలూ జయదేవుడి అష్టపదులూ, అధ్యాత్మ రామాయణ కీర్తనలు, క్షేత్రయ్య మువ్వగోపాల పదాలు కూచిపూడి వారి నాట్య విద్యకు ప్రధాన ప్రేరకాలుగా నిలిచాయి.

కీ॥శే॥ వేదాంతం రాఘవయ్య, కీ॥శే॥ వెంపటి సత్యన్నారాయణ మూర్తి, శ్రీ వెంపటి చినసత్యం వంటి ప్రముఖులు. ఈ కళకు విశ్వవ్యాప్తిని కల్గించిన ప్రముఖులు.

నియమబద్ధమైన జీవితం, ఉత్తమ సంస్కారం, వృత్తి పట్ల గౌరవభావం కూచిపూడి కళాకారులకు సహజ లక్షణాలు. తమిళనాడు, కేరళ, కర్ణాటక, మహారాష్ట్ర వంటి దూరదూర ప్రాంతాలకు బృందాలుగా వెళ్ళి ప్రదర్శనలిచ్చేందుకు తగిన ఆరోగ్యం, మంచి దేహదారుఢ్యం వీరికి వుంటాయి.

ఒకసారి కేరళలో, "భాగవతుల దశరథ రామయ్య" అనే కూచిపూడి కళాకారుడు ప్రదర్శన ఇవ్వడానికి వెళ్ళినప్పుడు ఒక మాంత్రికుడు అసూయతో దశరథరామయ్య గారి నాట్యబృందం మీద చేతబడి ప్రయోగించాడట!

దాని ఫలితంగా అక్కడెక్కడో ఆ మాంత్రికుడు నూతిలోకి దిగి బక్కెట్లకొద్దీ నీళ్ళు తాగుతుంటే, ఇక్కడ స్టేజీ మీద సత్యభామ పాత్ర వేస్తున్న వ్యక్తికి పొట్ట ఉబ్బడం మొదలయ్యిందట. ఇది గమనించి, దశరథ రామయ్య ఒక సూదిని మంత్రించి పందిరిగుంజకు గుచ్చాడట. అందులోంచి నీళ్ళన్నీ కారిపోయి సత్యభామ ఉబ్బరం తగ్గిపోయిందనీ, ప్రజలు ఇది తమ గ్రామం మాంత్రికుడు చేసిన పనేనని గుర్తించారనీ ఒక కథ వుంది. కూచిపూడి భాగవతులు శారీరకంగా శత్రువుని ఎదుర్కోగలగడమే కాకుండా, ఇలాంటి మహిమాన్విత శక్తులు కూడా సంపాదించుకొని, ప్రతిక్రియలు చేయగలిగేవారనీ, ఆ మాత్రం సత్తు లేకపోతే, ఊరు కాని ఊరుకీ, దేశంకాని దేశానికి వెళ్ళి నెగ్గుకురావడం కష్టమనీ ఈ కథని బట్టి అర్థం అవుతుంది.

కృష్ణాతీరానికీ, తెలుగువారికీ వన్నె తెచ్చిన కూచిపూడి వైభవం అది!

# మాచెర్ల

పలనాటి సీమకు హృదయం లాంటిది మాచెర్ల. మాచెర్ల పేరు చెబితే పౌరుషానికి మరో పేరైన పోతుగడ్డగా జన హృదయం పులకించిపోతుంది!

క్రీ.శ. 2,3 శతాబ్దాల కాలంలో ఒక వెలుగు వెలిగిన అలనాటి పట్టణం ఈ మాచెర్ల. సముద్రానికి 120 మైళ్ళ దూరంలో కృష్ణానదికి దక్షిణ తీరాన 15 మైళ్ళ దూరంలో ఈనాటి గుంటూరు జిల్లాలో మాచెర్ల వుంది.

కృష్ణానది మాచెర్లను చుట్టి ప్రవహిస్తుంది. అందుకని 15 మైళ్ళ దూరాన వున్నా, ఉత్తరదిశలోనూ, పడమర దిశలో కూడా కృష్ణానది హద్దుగా కన్పిస్తుంది. దక్షిణ దిశలోనూ, తూర్పు దిశలోనూ కొండలూ, అడవీ వ్యాపించి వున్నాయి.

ఈ కొండలూ, అడవులే అమరావతి, భట్టిప్రోలు, నాగార్జునకొండ బౌద్ధ స్తూపాలకు రాతినీ, కలపనూ సమకూర్చాయి.

నాగార్జునసాగర్ ఏర్పడే వరకూ మాచెర్ల నిస్సారమైన భూమే! మెట్ట ప్రదేశం. జొన్నలు, రాగులు సజ్జలతో పాటు, రంభయైన ఏకులె వడకున్ అన్నట్లుగా, పత్తి పంట విస్తారంగా పండేది ఇక్కడ!

పల్నాటి వీరయోధులకు మాచెర్ల ఈనాటికీ సజీవంగా వున్న ఒక స్మృతి చిహ్నం అని చెప్పాలి.

తొలినాళ్ళలో పాశుపత శైవానికి, ఆ తర్వాత బౌద్ధానికి మలినాళ్ళలో వీర శైవానికీ మాచెర్ల కేంద్రస్థానంగా వుండేది.

మల్లినాథుడు, ముదిగొండ వీరబసవకవి వంటి వీరశైవ కవి ప్రముఖులు నడిచిన నేల ఇది. ఆచార్య నాగార్జునుడి బోధలతో పునీతమైన భూమి ఇది!

మాచెర్ల చెన్నకేశవ దేవాలయం– 'మరో భారతం' అనదగిన రీతిలో దాయాదులైన రాజవంశీకుల కథకు నిలువెత్తు సాక్ష్యంగా కనిపిస్తుంది. శ్రీనాథ కవి సార్వభౌముడు పల్నాటి వీరచరిత్రని మంజరీ ద్విపద వృత్తంలో రచించి తెలుగు ప్రపంచానికి అందించాడు. ఇది యుద్ధ కావ్యం. వీరరసం ప్రధానమైంది. ఇందులోని ప్రతి పాత్రా శ్రీనాథకవి చేతితో చెక్కిన మహాశిల్పాలై నిలిచాయి.

యిక్ష్వాకు రాజవంశీకులు క్రీస్తు శకం తొలి శతాబ్దాలలో నాగార్జునకొండ అంటే, శ్రీ పర్వతాన్ని కేంద్రంగా చేసుకొని పాలించిన కాలంలో మాచెర్ల సహా పల్నాడు యావత్తూ రాచరిక వైభవాన్ని అనుభవించిందనే చెప్పాలి! "విజయపురి" ఇక్ష్వాకుల రాజధాని పేరు.

రసాయన శాస్త్రవేత్త సిద్ధ నాగార్జునుడు నివసించిన శ్రీ పర్వతానికి దగ్గర్లోనే 'విజయపురి' వుంది. అక్కడ అనేక శిధిలాలు శాసనాలూ దొరికాయి. ఇక్ష్వాకులు పతనమైన తర్వాత తెలుగువారి రాజధాని ఏలూరు దగ్గర వేంగి దేశానికి మారింది. కాలక్రమంలో బౌద్ధమతం కూడా నీరసించిపోవడం వలన పల్నాడు చరిత్రలో ప్రధాన పాత్రని చాలాకాలం పోషించలేకపోయింది!

'పల్లి' అనే పదానికి, స్కూలు, ఆసుపత్రి సౌకర్యాలు వున్న వూరు అని ఒక అర్థం వుంది. బౌద్ధుల ఆధ్వర్యంలో నడిచే స్కూళ్ళు, ఆసుపత్రులు ఈ పల్లెల్లో వుండేవి. బౌద్ధ, జైన మతాలకు చెందిన ప్రముఖులు విద్యా ఆరోగ్య సౌకర్యాల్ని ప్రజలకు ఉచితంగా కల్పించే వారనడానికి ఇది సాక్ష్యం!

కృష్ణా, గుంటూరు, గోదావరి జిల్లాలో 'పల్లి' పేరుతో వున్న ప్రాచీన గ్రామాలు కొండపల్లి, గుంటుపల్లి వంటివి క్రీస్తుశకం తొలి రోజుల్లో బౌద్ధ లేదా జైనమతాల ప్రాబల్యం నడిచిన గ్రామాలు అయివుంటాయని పండితులంటారు.

ఇలాంటి పల్లెలు ఈ జిల్లాల్లో ఎక్కువగా వున్నప్పటికీ పలనాటి ప్రాంతంలో మరీ ఎక్కువగా వుండి, పల్లెలనాడు పల్నాడు అయ్యిందని కొందరు చరిత్రకారులు అంటారు. పాలరాయి వంటి తెల్లని పలకలరాయి దొరికే ప్రాంతం కాబట్టి పలనాడు పల్నాడు అయ్యిందని మరికొందరు అంటారు.

క్రీస్తుశకం 12వ శతాబ్దిలో హైహయ వంశీకులు పల్నాడుని పాలించడం ప్రారంభించాక పలనాడు మళ్ళీ చారిత్రక వైభవాన్ని సంతరించుకుంది. చాగి రాజవంశపు మొదటి బేతరాజు ఈ హైహయలకు మూల పురుషుడు. గురజాల వీరభద్రేశ్వరుని దేవాలయంలోనూ, మాచెర్ల చెన్నకేశవ దేవాలయంలోనూ ఇతను వేయించిన శాసనాలు కొన్ని దొరికాయి. బహుశా ఈయనే చెన్నకేశవ దేవాలయ నిర్మాత కావచ్చు. శీలం బ్రహ్మనాయుడు దాన్ని పునర్నిర్మించి వుండవచ్చునని భావిస్తారు.

తూర్పు చాళుక్య ప్రభువు రెండవ విష్ణువర్ధనుడు క్రీ.శ.669లో వేయించిన శాసనంలో "శ్రీ మదింద్ర వర్మ మహారాజస్య పుత్రః నానా శాస్త్రా భ్యాసో పాత్తానేక విద్యావిశారదః విష్ణువర్ధన మహారాజః "పల్లిరాష్ట్రే" కోణికి నామ గ్రామం..." అంటూ, కొనికి గ్రామాన్ని దానం ఇచ్చినట్లు చెప్పుకున్న ఒక శాసనం దొరికింది. "పల్లి రాష్ట్రం" అనే పేరు క్రీ.శ.7వ శతాబ్దిలో పల్నాడుకు వుండేదనడానికి ఇది తిరుగులేని సాక్ష్యం. 'పల్లి' పదానికి బౌద్ధపరమైన అర్థం ఇక్కడ వర్తిస్తుందనే మనం అనుకోవాలి!

కులోత్తుంగ గొంకరాజు కొడమగూడ గ్రామంలో... "ముదిసెలి ఈసన పెగ్గడ పల్లినాంటిలో నుందమకు" అంటూ పల్లినాడు అనే పేరుని ప్రయోగించాడు. "పల్లి నాంటి వీరుండు అనుంగుం దేవ మహారాజుల ఏలికి..." అనీ, "పల్లినాటిలోని రుగ్యపట్టము" అనీ- ఇలా అనేక శాసనాలలో ఈ పల్లినాడు పేరు కన్పిస్తుంది.

వినుకొండ వల్లభరాయుడు శ్రీనాథ మహాకవికి సమకాలికుడు. 14వ శతాబ్ది వాడు! ఈయన రాసిన క్రీడాభిరామంలో పలనాడు, పల్నాడు, పల్లైనాడు, పల్లైదేశం పేర్లు కన్పిస్తాయి.

శ్రీనాథుడు పల్నాటి వీరచరిత్రలో మాత్రం

"విలసిల్లు పలనాటి వీరుల చరిత్ర

జనులెల్ల భక్తిచే జదువుట కొరకు"

అని రాసుకున్నాడు.

పింగళిసూరన ప్రభావతి ప్రద్యుమ్నంలో 'పలనాడు' అనీ, అప్పకవి "పల్లైనాడు" అనీ ప్రయోగించారు.

ఆంధ్రుల చరిత్ర అనే గ్రంథంలో పల్లవులు పాలించిన నేల పల్లవనాడు పల్నాడుగా మారిందని రాశారు. పల్లవబొగ్గ పల్నాడుకు పూర్వరూపం అని వీరి అభిప్రాయం.

1862లో ముదిగొండ వీరభద్రుడు రచించిన పల్నాటి వీరుల గ్రంథంలో "పాల మాచాపురం" అనే నగరం వుందని చెప్పడంతో కథ మొదలౌతుంది.

పల్నాటి మాచెర్లని సంస్కృతీకరించడం కోసం "పాల మాచాపురం" ప్రయోగాన్ని కవులు చేసి వుంటారు.

ఇక్కడ చెన్నరాయుడు అనే పేరుతో విష్ణుమూర్తిని కొలుస్తారు. శివుడు మల్లికార్జునుడైతే, విష్ణువు చెన్నరాయుడు.

'మహాదేవి చర్ల' పేరుతో ఈ నగరాన్ని కొంతకాలం వ్యవహరించారని, అదే క్రమేణా మాచెర్లగా మారిందనీ కొందరంటారు. చెన్నకేశవ స్వామి దేవాలయం ముందుభాగంలో వున్న మండపం మీద క్రీ.శ.1397 నాటి శాసనంలో ఈ మహాదేవిచర్ల పేరు కన్పిస్తుంది.

నాగులేరు, చంద్రభాగ అనే కృష్ణా రెండు ఉపనదులు ప్రవహించిన ఈ నేల మాచెర్ల కేంద్రంగా ఎన్నో సామాజిక రాజకీయ పరిణామాలను చవిచూసింది.

"చిన్న చిన్న రాళ్ళు, చిల్లర దేవుళ్ళు
నాగులేటి నీళ్ళు నాపరాళ్ళు
సజ్జజొన్న కూళ్ళు, సర్పంబులను దేళ్ళు
పల్లెనాటి సీమ పల్లెటూళ్ళు..." అనే శ్రీనాథుడి చాటుపద్యం ఇక్కడ తప్పకుండా మనకు జ్ఞాపకం వస్తుంది.

పల్నాటి వీరుల పోరాటం, కారెంపూడి యుద్ధం, బ్రహ్మనాయుడు, నాయకురాలు నాగమ్మల వ్యక్తిత్వం బాలచంద్రుడి పౌరుషం ఇదంతా గతించిన చరిత్రే కావచ్చు. కానీ, ఈ చరిత్ర పల్నాడులో వీరారాధనకు దారితీసింది.

చంద్రవంక నదీతీరాన బ్రహ్మనాయుడు మూడు దేవాలయాలను నిర్మించి పల్నాటి వీరులకు అంకితం ఇవ్వడం మాచెర్ల ప్రత్యేకతగా చెప్పుకోవాలి.

క్రీ.శ. 1315లో పల్నాటి యుద్ధవీరుల ఆవాసం కోసం ఇక్కడ కొంత భూమిని ఇచ్చినట్లు ఒక శాసనం కూడా దొరికిందట.

మహదేవిచర్ల చెన్నకేశవస్వామి దేవాలయం చాలా గంభీరంగా వుంటుంది. హైహయ రాజవంశీకుల పాలనావైభవం ఇక్కడ కళ్ళకు కట్టినట్లు కనిపిస్తూ వుంటుంది. ఇది మాచెర్ల అలనాటి పట్టణ వైభవానికి ఒక సంస్మరణ మాత్రమే!

# బాపట్ల

బౌద్ధ మహాయుగంలో వన్నెకెక్కిన అలనాటి పట్టణాలలో బాపట్ల అత్యంత ప్రాచీనమైనదనే చెప్పాలి. "బాపంపట్ల అనేది శాసనాలలో దీనికి కనిపించిన ఒక పేరు. బాపట్లని భావపురి అని కూడా పిలుస్తుంటారు. భావనారాయణ స్వామి దేవాలయం ఈ వూరిలో ప్రసిద్ధి కాబట్టి 'భావపురి' అనే మాట వాడుకలో వచ్చింది. 1136లో "భావ పట్టణం పేరు ఒక శాసనంలో కన్పిస్తుంది కూడా!

క్రిమికంఠ చోళ చక్రవర్తి క్రీస్తు శకం 593లో భావనారాయణ స్వామి దేవాలయాన్ని కట్టించాదని ఒక ఐతిహ్యం వుంది. వీర ప్రతాప చోళ చక్రవర్తి భావనారాయణ స్వామి నిత్య నైవేద్యాల కోసం బాపట్ల పట్టణాన్ని అభివృద్ధి చేసి స్వామికి అర్పించుకొన్నాడు.

శిఖరం వారు, బాపట్ల వారు, దేశిరాజువారు, ఆముదాలపల్లివారు, స్థానం వారు... బాపట్లలో అతి ప్రాచీన కుటుంబీకులనీ, వారికి బాపట్ల మీద మిరాశీ హక్కులు వుండేవనీ ఈ గ్రామ కైఫీయత్తులో వుంది.

కాకతీయులు, రెడ్డిరాజులు విజయనగర సామ్రాజ్యాధీశుల కాలంలో బాపట్ల సముద్రతీరం వర్తకవాణిజ్యాలకు విఖ్యాతి చెందిన ప్రాంతం. ఈ ఓదవరేవుని మోటుపల్లి అని పిలిచేవారు, వేళానగరం అనీ, దేశ్యాయకొండ పట్టణం అనే పేర్లు కూడా ఈ నగరానికి వున్నట్లు శ్రీ కుందూరి ఈశ్వరదత్తు ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం గ్రంథంలో రాశారు.

రెడ్డి రాజ్య ప్రముఖుడు అనపోతారెడ్డి, కాకతి గణపతిదేవుడు వంటి చక్రవర్తులు రాయించిన తెలుగు శాసనాలూ, కొన్ని అరవ శాసనాలు కూడా ఇక్కడ దొరికాయి. కాకతిరుద్రమ దేవి కాలంలో మార్కోపోలో ఈ ఓడరేవుని సందర్శించాడు. ఇక్కడ ఎగుమతి దిగుమతుల సౌకర్యాల గురించి ప్రశంసించాడట!

ఎర్రాప్రెగడకవి, హరివంశంలో-

బాహాదర్పమునం బ్రతీపధరణీ పాలావళింద్రోలి యు
త్సాహోదగ్రుడు మోటుపల్లి గొని సప్తద్వీప సద్వస్తు సం
దోహంబున్ నెచ్చెలి సముద్రుం బ్రీతి గావించుచున్
మాహాత్మ్యంబు వహించె మల్లరధినీ నాథుండు గాఢోద్ధతిన్" అంటూ, ప్రోలయ వేమారెడ్డి సోదరుడైన మల్లారెడ్డి విరోధి రాజుల్ని పారద్రోలి ఈ ఏడు ద్వీపాల మహా

సముద్రాన్ని జయించి సముద్రుడికి ప్రీతి కల్గించాడని వర్ణించాడు. ఎర్రన గారి కాలానికి బాపట్ల మంచి వెలుగులో వుంది!

కాకతీయుల కాలంలో వేళా నగరంగా పిలువబడిన ప్రాంతమే రెడ్డి రాజుల కాలంలో "మోటుపల్లి" అయ్యిందనడానికి తార్కాణంగా "శ్రీ మద్వేళానగరమైన శ్రీమతు మోటుపల్లి శ్రీ గణపతి ప్రసన్న కేశవ దేవరకు కాకతి గణపతి దేవ మహారాజు ధర్మువుగా హవిర్బలి యర్చనలకు అంగరంగ భోగాలకు నిచ్చిన ఆదూరు..." అంటూ, ఆదూరును దానం ఇస్తూ వేయించిన దానశాసనంలో ఈ ఊరుని వేళానగరం అని వ్యవహరించినట్లుంది. ఊరుపేరు మార్పుకి కారణాలు ప్రత్యేక పరిశోధనాంశం.

ఒంగోలుకి ఉత్తరంగానూ, బాపట్లకు దక్షిణంగానూ వున్న ప్రాంతం మొత్తాన్ని "అద్దంకి దండపాట" అని పిలిచేవారు.

"వీరశ్రీ గజపతి గాడేశ్వర నవకోటి కర్ణాటక కలుబరిగేశ్వర రాయశ్రీ ప్రతాపరుద్రదేవు, మహారాజం కరువి జయరాజ్యే... అర్ధోదయ పుణ్య కాలాన శ్రీ హస్తానను ధారాపూర్వకం గాను... అద్దంకి దండ్డ పాటలోని వంకాయపాదున్ను..." అంటూ అద్దంకి దండపాట లోని వంకాయపాదుని దానం ఇచ్చినట్లు ఇంకొక శాసనంలో వుంది. గజపతుల కాలంలో అద్దంకి దండపాటలో ఒక ముఖ్య నగరంగా వుండేది బాపట్ల!

పావులూరి మల్లన కవి కమ్మనాడు గురించి ప్రస్తావిస్తూ తన గురించి రాసుకున్నాడు.

"ఇల గమ్మనాటిలోపల
విలసిల్లిన పావులూరి విభుడను సూత్రా
కవితా వస్తంబద్విజ
కుల తిలకుడ వినుత గార్గ్య గోత్రోద్భవుడన్" అని!

కమ్మనాటిలోపల విలసిల్లిన పావులూరు తన వూరుగా ఈ పద్యంలో చెప్పుకున్నాడు. పావులూరు బాపట్ల దగ్గరే వుంది. శ్రీశైలం, నరసరావుపేట, బాపట్ల, ఒంగోలు, గుండ్లకమ్మనది, మార్కాపురం... ఈ మధ్యలో వున్న ప్రాంతం అంతా కమ్మనాడు గానే పిలవబడేదనీ, కమ్మరాష్ట్రం, కర్మరాష్ట్రం, కమ్మాంక రాష్ట్రం, కమ్మ విషయం... ఇలా ఈ ప్రాంతాన్ని వివిధ కాలాలలో వ్యవహరించారనీ శాసనాల ఆధారంగా తెలుస్తోంది! కమ్మనాడులో బాపట్ల ప్రముఖప్రాంతం ఆనాడు!

విజయనగర రాజ్య పతనం తర్వాత మాలిక్ ఇబ్రహీం ఈ ప్రాంతాన్ని స్వాధీనం చేసుకున్నాడు. ఆయన తిమ్మ భూపాల నగరానికి నిజాంపట్నం అని పేరు పెట్టి ఈ

ప్రాంతాన్నంతా నిజాంపట్నంలో కలిపేశాడు. దీనికి దేశపాండ్య, దేశముఖి పదవుల్లో కొందరిని నియమించాడు.

1752లో నాసర్ జంగ్ ఈ ప్రాంతాన్ని ఫ్రెంచి వారికి స్వాధీనం చేశాడు. ఫ్రెంచి వారు 7 సంవత్సరాలు పాలించిన తర్వాత 1759లో ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీకి స్వాధీనం అయ్యింది. ఆ కాలంలో బాపట్ల అమరావతి జమీందారు రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు పాలనలో వుండేది. వాసిరెడ్డి జమీందారీ అంతమయ్యాక, ఇంగ్లీషు కంపెనీ పరం అయ్యింది.

కంపెనీ దుబాషీగా వున్న కాంద్రేగుల జోగిపంతులు బాపట్ల భావనారాయణ దేవాలయాన్ని పునఃప్రతిష్ఠించి, నల్లాని నరసింహాచార్యుల్ని, శ్రీనివాసుల భావనా చార్యుల్ని అర్చకులుగా నియమించినట్లు తెలుస్తోంది. అప్పట్లోనే సోమేశ్వర దేవాలయం కూడా కట్టి శివార్చకుడిగా స్వర్ణ బ్రహ్మన్నని నియమించాడట. ఆ విధంగా విష్ణ్వాలయం శివాలయం రెండూ ఏర్పడ్డాయి.

సముద్రానికి నాలుగు మైళ్ళ దూరాన ఎత్తయిన యిసుక దిబ్బ మీద ఈ పట్టణం వుంది. ఇక్కడి వ్యవసాయ విద్యాలయం ఈ ఊరుకు ఒక గొప్ప వన్నె తెచ్చింది. బాపట్లకు సమీపంలోని జిల్లెళ్ళమూడిలో మాతృశ్రీ ఆశ్రమం ఆధ్యాత్మిక సంపన్నతను కల్గిస్తోంది.

అప్పటికీ ఇప్పటికీ బాపట్ల కూరగాయలకు ప్రసిద్ధి. మంచి దవనం, మల్లెపూలు, పొట్టి వంకాయలు బాపట్ల పేరుతో ఖ్యాతిని పొందాయి. అలనాటి పట్టణ వైభవం ఈనాటికీ బాపట్ల వెడితే చక్కగా దర్శనం ఇస్తుంది మనకి!!



| Check List | | | |
|---|---|---|---|
| Book Number | G.V.Po/A187 | Date | 4/11/2020 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CI, 133 | | |
| Missing Pages | NO | | |
| Prepared | Yameema | Scanned | Mounika |
| BOOK SIZE | H 8.8 W 5.5 | Pages | 137 |